# తాళపత్ర గ్రంథం

అనేక గ్రంథాల్లో దాగి ఉన్న జీవన, ఆచార, ఆరోగ్య, సాంప్రదాయ రహస్యాలు



రచన, సేకరణ: మైథిలీ వెంకటేశ్వరరావు

# తాళపత్ర గ్రంథం

(అనేక గ్రంథాల్లో దాగి ఉన్న జీవన ఆచార, ఆరోగ్య,
సాంప్రదాయ రహస్యాలు... స్థూల అక్షరాలతో...)

రచన, సేకరణ :

## మైథిలీ వెంకటేశ్వరరావు

తాళపత్ర గ్రంథం

రచన, సేకరణ :
మైథిలీ వెంకటేశ్వరరావు



మొదటి ముద్రణ: 2010

# ఈ తాళపత్ర గ్రంథం గూర్చి.....

మన పురాణాల్లోనూ, ఇతి హాసాల్లోనూ, వేదాల్లోనూ ఎన్నో అమూల్యమైన ఆచారాలూ, నమ్మకాలతోపాటు, ఆరోగ్యాలకి సంబంధించినవీ పొందుపరిచారు. అలాంటివి తెలుసుకోవటం ద్వారా, ఆచరించటం ద్వారా ఆరోగ్యమూ, జ్ఞానమూ, పుణ్యం.

అంతటి అమూల్య విషయాలను వినగానే, చదవగానే తెలిసినట్లుంటుంది. కాని అంతరార్థము బోధపడదు. ముక్కోటినాడు ఉత్తరద్వార దర్శనము చెయ్యాలని తెలుస్తుంది. అలాగే స్త్రీలు గర్భం ధరించినప్పుడు బైటికెళ్ళ కూడదంటారు. కానీ దేనికి? వాటి వల్ల మంచేమిటి? వినకపోవటం వల్ల అనర్థ మేంటి?

ఈ గ్రంథం కోసం రామాయణాది, భారత, భాగవతములు, చరక సంహిత, పతివ్రత గాథలూ, పురాణాలూ, మనుస్మృతీ, వర్ణాశ్రమ ధర్మాలూ, నిర్ణయ సింధూ, మహామహా ఆధ్యాత్మిక జీవిత పురుషుల చరిత్రలూ, అనేక పత్రికలూ, చాణక్య, భర్తృహరి, విదుర వంటి నీతి శాస్త్రాలూ, శౌనకాది మునుల గాథలు వంటి వాటి నుంచి సేకరించాను. ఈ పుస్తకం కోసం ఎన్నో వందల పుస్తకాలను కూడా పరిశీలించాను. ఎంతో మంది పెద్దలనూ, స్వామిజీలనూ, భక్తులనూ నాకు తెలియనవి అడిగి అది ఎందుకూ, అని అడిగి మరీ చెప్పించుకున్నాను. దేవాలయాలకీ, పుజాదికాలకీ, యజ్ఞాలకీ వెళ్ళినప్పుడు అక్కడి యజ్ఞకర్తలను ఏ సందేహం కలిగినా ఓపికగా ఉండి తెలుసుకొని చెప్పించుకోవటం జరిగింది. వారందరికీ నా ప్రణామాలు.

గతంలో వచ్చిన నా తాళపత్ర నిధి గూర్చి అనేక మంది ఫోన్‌ల ద్వారా ఆచార వ్యవహారాల గూర్చి ఒక్క విషయమే వ్రాశారు. లోతుగా, మరిన్ని విషయలనూ, పెద్దలు పెట్టిన ఆచారాల గురించి మరికొన్ని చెబితే ఇంకా బావుండేది అని శెలవిచ్చారు. అవును పెద్దలు పెట్టిన ఆచారాల్లో అంతరార్థము ఒక్కటే కాదు. ఒక్క ఆచారం వల్ల ఎన్నో రకాలుగా ప్రయోజనాలున్నాయి.

అందుకే ఈ తాళపత్రగ్రంథంలో (తాళపత్ర రహస్యాలుగా తరువాత పుస్తకంగా తేస్తాననీ తాళపత్ర నిధిలో ప్రకటించాను.) ఆయుర్వేదం, ఆధ్యాత్మిక, దైవ, ఆచార్య, నమ్మకాల్లో మర్మలూ, ధర్మాలూ, ఇలా ఎన్నో విషయాలను సమపాళ్ళలో మేళవించటానికి నా వంతు ప్రయత్నం చేశాను. ఎక్కడైనా పొరపాటు చేసినా, నాకు చెప్పి సరిదిద్దుకునే అవకాశం ఇమ్మని ప్రార్థిస్తున్నాను. నన్ను ఇంతగా ఆదరిస్తూ నన్ను ముందుకు తీసుకెకుతున్న మీ ఆశీస్సులే నాకు శ్రీరామరక్ష.

అందరికీ శిరస్సువంచి నమస్కరిస్తూ... మీ

\- మైథిలీ వెంకటేశ్వరరావు

## విషయసూచిక


1. విఘ్నేశ్వరుని మూల మంత్రము ..... 33
2. గకారాక్షర దేవుడు గణేశుని ఎలా పూజించాలి? ..... 33
3. నదిదాటేటప్పుడు చిల్లరేస్తారెందుకు? అందులో ఏ అర్థం దాగింది ? ..... 34
4. రామాయణ సారము ..... 35
5. ఏకభుక్తా మహాయోగి, ద్వి భుక్తా మహాభోగి, త్రి భుక్తా మహారోగి ..... 36
6. శ్రీ పద్మావతీ మూలమంత్రము? ..... 36
7. సూర్యభగవానుణ్ణి ఏ దేవతలు ఏ సమయంలో పూజిస్తారు? ..... 36
8. మైల ఉన్న వార్ని తాకకూడదనేదెందుకు? ..... 37
9. 'వెళ్తాను' అని ఎప్పుడనాలి? 'వెళ్ళివస్తాను' అని ఎప్పుడనాలి? ..... 37
10. దుఃఖీ సదా కో విశయాను రాగి ..... 38
11. శ్రీ కృష్ణ భగవానుని పూజకు పనికి రాని పూవులు? ..... 38
12. అన్ని ఆకులకంటే అరిటాకు భోజనం మహాశ్రేష్ఠమా? ..... 38
13. దేవతలందరినీ వారి వారి రూపాల్లో పూజిస్తారు? మరి మహాశివుణ్ని లింగరూపంలో పూజించటానికి కారణము?..... 39
14. పంచెకట్టు లేదా చీరకట్టులో ఎంత ఆరోగ్యముంది? ..... 39
15. పురుషార్థాలంటే ఏమిటి? ..... 40
16. ఆడపిల్లలని ఏ వయస్సులో ఎలా పిలవాలి? ..... 40
17. ద్రౌపది కర్ణుణ్ని ఆరో భర్తగా కోరుకుందా? ..... 41
18. మహాశివుడూ, పార్వతీ ఏ వర్ణము కలవారు? ..... 41
19. కురుపాండవుల వంశవృక్షం ఎక్కణ్ణించి మొదలైంది? ..... 41
20. గుడిలో కాళ్ళు కడుక్కోగానే మూడుసార్లు నోటిని పుక్కిలించి బైటికి వదిలేదెందుకు? ..... 42
21. సర్పాపదలు తొలగుటకు శ్రీకృష్ణ మూల మంత్రము? ..... 42
22. స్త్రీ అంటే? ..... 43

23. మైలలో దేవుణ్ని ధ్యానించవచ్చా? ..... 43
24. భగవంతుడిచ్చిన ఆయువు పూర్తవ్వకుండానే ఎందుకు స్వర్గస్తులవుతున్నారు? ..... 44
25. గృహంలోకి దుష్టశక్తులు ప్రవేశించకుండా ఉండాలంటే? ..... 45
26. పొగడ్తకీ, ప్రశంసకీ తేడా ఏమిటి? ..... 45
27. వేద ఉపనిషత్తులు పురాణాల ప్రకారము నవగ్రహాలకి ఏ దానాలు చేయాలి? (అష్టాదశ పురాణాల నుంచి) ..... 46
28. సర్వాభీష్టసిద్ధిప్రద మూల మంత్రము ..... 46
29. ధనుర్మాసంలో నైవేద్యం ప్రత్యేకత ఏమిటి? ..... 47
30. ఇంట్లో పిచ్చికలు గూడు పెడితే ఎంత అరిష్టము? ..... 47
31. తల్లి కడుపులో లింగనిర్ధారణ ఎలా జరుగుతుంది? ..... 48
32. ఈ ప్రపంచంలో తీర్చలేని బాధేమిటి? ..... 48
33. పెద్దలు పిల్లలకి చెప్పాల్సినవి? చేయాల్సినవి? ..... 48
34. జ్యోతిష్యాన్ని ఎంత వరకు నమ్మవచ్చు? ..... 49
35. భగవంతునికి వెలిగించే దీపాన్ని నేలపై ఎందుకుంచకూడదు? ..... 50
36. మహావైభోగాలను పొందే స్త్రీ హస్త లక్షణము? ..... 50
37. దైవపూజ చేసేటప్పుడు తలపాగా తీసి కొలిచేదెందుకు? ..... 51
38. రఘుకుల తిలకుడు, ధర్మమూర్తి అయిన శ్రీరామచంద్రుడు వాలిని చెట్టు చాటు నుంచి కొట్టడం ఎంత వరకు ధర్మం?..... 51
39. నోము నోచుకునేవారు తమకన్నా చిన్నవారికీ నమస్కరించవచ్చా? ..... 52
40. నల్లపూసలు ధరించటంలో పరమార్ధము? ..... 52
41. ఏ దేవునికి ఏమిష్టం? ..... 53
42. మంగళవారం భూమిని ఎందుకు త్రవ్వకూడదు? ..... 53
43. ప్రకృతి వంటి అందమైన స్త్రీ నెలలో ఆ రోజుల్లో ఎంత వ్యధ చెందుతుంది? ..... 53
44. వివాహం సకాలంలో జరుగుటకు మంత్రము? ..... 54
45. ఒకప్పుడు మంత్రసాను లెక్కదుండేవారు? ..... 55
46. ఎలాంటి బ్రాహ్మణుడికి నమస్కరించాలి? ..... 55
47. వ్రతము చేసిన రోజు కలవకూడదా? ..... 56
48. ఆచమనం ఎలా చెయ్యాలి? ..... 56
49. వివాహం కాని ఆడపిల్లలు ఏ పారాయణం చేయాలి ? ..... 57
50. ఎలాంటి ధనం ముందు తరాలకి అందదు? ..... 58
51. యక్షసత్వ స్త్రీ లక్షణములు? ..... 58
52. నెయ్యి వాడకం ముసలితనాన్ని దూరం చేస్తుందా? ..... 58
53. గుడిలో కెళ్ళే ముందు తలపై నీళ్ళు చల్లుకుంటారెందుకు?..... 59
54. తెలుగు సంవత్సరాలు అరవై ఎందుకున్నాయి? ..... 59
55. గంధర్వ సత్వ స్త్రీ లక్షణములు? ..... 60
56. అందంగా ఉండాలంటే కంచుపాత్రలో భోజనం చెయ్యాలా? .....60
57. శ్రీకృష్ణ పంచదశాక్షర మహా మంత్రము? ..... 61
58. ఎలాంటి లక్షణాలు గల స్త్రీ తనకు తాను సుఖపడుతుంది?..... 61
59. కుటుంబమంతా గుడికెళ్తే ఎక్కువ ఫలం వస్తుందా? ..... 62
60. శరీర బరువూ, క్రొవ్వూ తగ్గాలంటే? ..... 62
61. ప్రతి పూజకీ గోవుపాలే ఎందుకు వాడతారు? ..... 63
62. ఆధ్యాత్మిక జీవితం అంటే? ..... 63
63. శివాలయానికి వెళ్ళినప్పుడు ముందుగా నవగ్రహాలని దర్శించుకోవాలా లేక శివుణ్ణా? ..... 64
64. ద్రౌపది ధర్మవిజేతయా, అధర్మ విజేతయా? ..... 64
65. మనిషి చేసే తప్పొప్పులు శరీరానికే అయినప్పుడు ఆత్మకేదోషమూ అంటదు కదా? ..... 65
66. దైవదర్శనానికి వెళ్లే ముందు కాళ్ళను చిన్న పొడ కూడాలేకుండా కడగాలని అంటారు. దేనికి? ..... 66
67. తిరుమల స్వామి సన్నిధిలోనున్న గడప ఎవ్వరు? ..... 66
68. శ్రీకృష్ణ అష్టాక్షర మహామంత్ర పరమార్థము? ..... 67
69. పిశాచసత్వ స్త్రీ లక్షణములు? ..... 67
70. నిత్య సత్యాలు తెలుసుకో (శ్రీ విద్యా ప్రకాశానంద గిరి స్వాములవారు) ..... 68

71. తల్లీ తండ్రీ ఒకే కులం కాకపోతే పుట్టే బిడ్డా? ..... 69
72. కడుపుతో ఉన్న స్త్రీ చీకటి పడిన తర్వాత బైటికెందుకెళ్ళకూడదు? ..... 69
73. తీర్థాన్ని ఎన్నిసార్లు తీసుకోవాలి? ..... 70
74. మునులూ, స్వామీజీలూ, అయ్యప్పలూ స్నానం అయ్యాక విభూతి ధరిస్తారు. ఆధ్యాత్మిక భావనతో పాటు మరేదన్నా కారణం ఉందా? ..... 70
75. గాజు, స్టీలు పాత్రల్లో భోజనము? ..... 70
76. ఇంద్రియ నిగ్రహంతో పాటు ముసలి ఛాయలు రాకూడదంటే? ..... 71
77. శ్రీకృష్ణ భగవానునికి ఇష్టమైన పూలు? ..... 71
78. పెసలు పొట్టు తీసి తినకూడదా? ..... 72
79. కపిసత్వ స్త్రీ లక్షణములు? ..... 72
80. పురుషుని వీర్యంలో బంగారపు అంశ ఉన్నదా? ..... 72
81. సంతానం కోసం సేతుస్నానం ఎందుకు చేస్తారు? ..... 73
82. తేలికగా ధనలక్ష్మి వచ్చి పడాలంటే? ..... 73
83. 400 సంవత్సరాలకు ముందు స్త్రీ జీవన విధానము ఎలా ఉండేది? ..... 74
84. కలలో ఏం వస్తే ఏ ఫలితం జరుగుతుంది? (అష్టాదశ పురాణాల నుంచి) ..... 76
85. మనోభీష్టములు సిద్ధుంచుట కొరకు? ..... 76
86. ఆయుర్వేదంలో రొంపకు చెప్పిన అమోఘమైన వైద్యం...?..... 77
87. స్నేహం ముసుగులో చేసే ద్రోహాలకి ఏ శిక్ష......? ..... 77
88. శత్రువుపై విజయము కొరకు? ..... 77
89. దక్షిణ దిశలోనున్న చింతచెట్టు చుట్టూ తిరిగితే వ్యాధులు నమయవుతాయా? ..... 78
90. రోజుకి ఎన్నిసార్లు పుక్కిలించాలని ఆయుర్వేదం చెబుతోంది?..... 78
91. ఉసిరిక పొడిని ఒంటికీ, తలకీ రాసుకొని స్నానం చేస్తే? ..... 79
92. పుట్టిన దగ్గర్నించి పోయేదాకా ఏడుపేనా? ..... 79
93. అరటిబోదెలో దీపం వెలిగించి వదిలితే మంచి భర్త లభిస్తాడా? ..... 80
94. విద్యాభివృద్ధి కొరకు? ..... 81
95. తినే అన్నం పళ్ళెం విసిరేస్తే భగవంతుణ్ని విసిరేసినట్టేనా? ..... 81
96. మనిషి తాను తప్పనిసరిగా తీర్చాల్సిన ఋణాలు? ..... 82
97. రావిచెట్టూ, వేపచెట్టూ కలిసున్న దగ్గర ప్రదక్షిణలు చేస్తే గర్భం ధరిస్తారా? ..... 83
98. కర్ణాభరణాలు ధరించేది ఎందుకు? ..... 83
99. భగవంతునికి పెట్టే నైవేద్యం ఎందులో పెట్టాలి ? ..... 84
100. అల్యూమినియం పాత్రల్లో భోజనం ఎంతవరకు మంచిది?..... 84
101. యజ్ఞోపవీతమును ఎప్పుడు మార్చాలి? ..... 85
102. సంధ్యా కాలమంటే? ..... 85
103. బంధ విముక్తి కొరకు? ..... 85
104. నవ్వే బుద్ధుడు బొమ్మను బహుమతిగా తీసుకుంటే మంచి జరుగుతుందా? ..... 86
105. సాలగ్రామము ఎలా తయారవుతుంది? ..... 86
106. ఇంటిలో తప్పనిసరిగా వాస్తు ప్రకారం పెట్టుకోవాల్సినవి?..... 87
107. సంగీతము వ్యాధులను దూరం చేస్తుందా? ..... 87
108. నేత్ర వ్యాధులు హరించుటకు? ..... 88
109. అపమృత్యు భయం పోవాలంటే? ..... 88
110. వంట ఇంటికీ, గృహానికీ పరిమితమైతే మీ ఆయుష్షు పదేళ్ళు తగ్గినట్టే? ..... 88
111. నాగులచవితికి పుట్టలో పాలుపోస్తే సంతానం కలుగుతుందా? ..... 89
112. ముక్కుపుడక కుట్టించుకోవటంతో ఆరోగ్యము? ..... 89
113. గృహస్థు తామరాకు, మోదుగ ఆకుల్లో భోజనం చేయరాదు. ఎందువలన? ..... 90
114. అకాల భయము తొలగిపోవుటకు? ..... 90
115. ఆడ, మగ తేడా లేకుండా చెవులు కుట్టించటం ఎందుకు?..... 91
116. స్త్రీ పిచ్చి ఎంతటి వాడ్నయినా అధముడ్ని చేస్తుందా? ..... 92

117. ధనుర్మాసంలో వివాహాలు ఎందుకు చేయరు? ..... 92
118. ఇంటిల్లిపాది భోజనానికి కూర్చున్నప్పుడు భిక్షగాడు వస్తే?..... 93
119. ఏ సమయంలో భిక్ష వెయ్యకూడదు? ..... 93
120. నవగ్రహ శాంతులున్నప్పుడు స్త్రీలు ఏ నగలు
ఎవరి కోసం ధరించాలి? ..... 93
121. రుద్రాక్ష ఎంత పవిత్రమైనది? ..... 94
122. మగబిడ్డ లేదా ఆడబిడ్డ పుట్టాలంటే? ..... 94
123. భగవంతునికి కొట్టిన కొబ్బరికాయను ఎలా పెట్టాలి? ..... 95
124. శీఘ్ర రోగ నివారణకు? ..... 95
125. పాపిట బిళ్ళ పరమార్థం ? ..... 95
126. ఆయుష్షుని తగ్గించేవీ, అనారోగ్యాన్ని పెంచేవి? ..... 96
127. త్రిమధుర ప్రసాదమంటే? ..... 96
128. కార్యములందు విజయము కలుగుటకు? ..... 96
129. జ్వరమూ, నీరసమూ, దగ్గు ఉన్నప్పుడు దిష్ఠి తియ్యగానే
ఒకింత ఉపశమనం ఎలా కలుగుతుంది? ..... 97
130. ఆత్మ ఎలా ఉంటుంది? ..... 97
131. దేవాలయాలను పర్వతాలూ, గుట్టల మీద
ఎందుకు నిర్మించారు? ..... 98
132. అర్థాంగి అని ఎందుకంటారు? ..... 98
133. భార్య లేకపోతే భర్త పుణ్యకార్యాలకి అర్హుడు కాదా? ..... 99
134. రావిచెట్టు చుట్టూ తిరిగితే ఆరోగ్యవంతమైన
పిల్లలు పుడతారా? ..... 99
135. కంచు పాత్రల్లో ఎవరు భోజనం చెయ్యకూడదు? ..... 100
136. శరీరాన్ని అనారోగ్యం ఎలా ఆవహిస్తుంది? ..... 100
137. ఏ దిక్కున వెళుతూ ఏమి జపిస్తే కార్యము సిద్ధించును? ..... 101
138. ప్రతి ఒక్కరి కనీస ధర్మాలు? ..... 101
139. ఆయుర్వేదం అధర్వణ వేదానికి ఉపవేదమా? ..... 102
140. తులసి ఇంట్లో ఉంటే పాములూ, తేళ్ళూ ఎందుకు రావు?..... 103
141. దేవాలయంలో మర్రిచెట్టుకి ప్రదక్షిణలు చేసేదెందుకు? ..... 103
142. భువిపై తప్పనిసరిగా దర్శించాల్సిన దివ్యక్షేత్రాలు ఏవి? ..... 104
143. ఏ సమయంలో ఎలాంటి తాంబూలాన్ని వేసుకోవాలి? ..... 104
144. శ్రీరామచంద్రుడు సీతను వదిలేసింది ఎందుకు? ..... 104
145. పర్వత ప్రాంతాల్లో, ఎత్తు ప్రాంతాల్లో వారు కిటికీలు
తీసి ఉంచాలని చెప్పేదెందుకు? ..... 105
146. వ్యవహార సాఫల్యత కొరకు? ..... 106
147. ఎర్ర నీళ్ళ దిష్ఠి ఎలా తీస్తారు? ..... 106
148. ఆయుష్షుని పెంచేవీ, ఆరోగ్యాన్ని కలిగించేవీ? ..... 107
149. నవగ్రహాలకి ఏ నైవేద్యాలను నివేదించాలి? ..... 107
150. మగవారికి పాతివ్రత్య నియమం ఎందుకు పెట్టలేదు? ..... 108
151. ఏ దిక్కుగా తిరిగి జపం చేయాలి? ..... 108
152. గ్రహ, నక్షత్ర, అపశకున దోషములు తొలగుటకు ? ..... 109
153. ఆయుర్వేద శాస్త్రం నాలుకను ఎలా
గీచుకోవాలని చెబుతుంది? ..... 109
154. శివ విష్ణువుల పంచామృత ప్రసాదంలో ఎంత
ఆరోగ్యం దాగుంది? ..... 109
155. పుత్రుడు లేకపోతే? ..... 111
156. ముక్తినిచ్చేవి ఏవి? ..... 112
157. ఇవన్నీ అసత్యదోషాలు కావు ..... 112
158. కుక్కనెందుకు కొట్టరాదు? ..... 112
159. తుమ్ము దోషము పోవుటకు ? ..... 113
160. సౌందర్యవతియైన భార్య కావాలనుకుంటే ? ..... 113
161. స్త్రీలు రుద్రాక్షను ధరించవచ్చా? ..... 114
162. ధ్వజస్థంభ పరమార్థమేమిటి? ..... 114
163. ఏ తిథినాడు ఏ ఆహారం తీసుకుంటే పాపం కాదు? ..... 115
164. అష్టదిక్పక్రమమునకు అధిపతులెవ్వరు? ..... 116
165. శతృవుల భయము తొలగిపోవుటకు? ..... 116
166. మహానిందితుడెవ్వడు? ..... 116
167. పుణ్యం తరిగిపోతే ఇక నాశనమేనా? ..... 117

168. అగ్నిప్రమాదములు దరి చేరకుండుటకు? ..... 117
169. దక్షిణాయనమంటే? ..... 117
170. తల్లి నుంచి ఏ అవయవాలు, తండ్రి నుంచి ఏ అవయవాలు శిశువుకి వస్తాయి? ..... 118
171. ఈ కలియుగాన ఏమేమి జరుగుతాయి? ..... 118
172. ఉత్తరాయణ కాలమంటే? ..... 119
173. సర్పభయ నివారణకు? ..... 119
174. దైవమందిరం పట్ల ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి? ..... 120
175. అనామిక వేలికి తప్పక ఉంగరం ధరించాలా? ..... 120
176. ప్రాణాయామంలో ఉన్న చిదంబర రహస్యం? ..... 121
177. స్త్రీ పక్కదారి పట్టడానికి కారణాలు? ..... 121
178. తిరుమల స్వామిని దర్శించేటప్పుడు బ్రహ్మనాడినీ దర్శించండి? ..... 122
179. స్నానము, దేవపూజ, ప్రదక్షిణ నమస్కారముల సమయాన చేయవలసిన జపము? ..... 122
180. ప్రపంచంలోనే అతి పెద్ద మరకతము ఎక్కడుంది? ..... 123
181. నరకలోకంలో ఏ పాపాలకి ఏ శిక్షలు...? ..... 123
182. ఏ దేవాలయాలు ఏ దిశగా ఉంటాయి? ..... 124
183. ధనధాన్యములు నిలువ చేయు సమయాన? ..... 124
184. భార్య ఎంత సేవ చేస్తుంది? మరి మీరు? ..... 125
185. సీమంతం చేసే పండుగలో గాజులు తొడిగేదెందుకు? ..... 125
186. తన భార్యను తాను, తన భార్య తననూ నగ్నంగా చూడాలనుకుంటే? ..... 126
187. కుంతి ముగ్గురు పుత్రులు జన్మించగానే ఇక వద్దు అని ఎందుకన్నది? ..... 127
188. రుద్రాక్షలో ఎంతటి ఔషధశక్తి దాగి ఉంది? ..... 127
189. తిరుమల శ్రీవేంకటేశ్వరునికి నివేదించేదీ, అతిపురాతనమైనదీ, ఆలయానికే పరిమితమయ్యే ప్రసాదం? .....128
190. విత్తనం ఒకటేస్తే మొక్క మరొకటి మొలవదు కదా? ..... 128
191. హోమాదుల నిర్వహించు సమయాన? ..... 128
192. ఏ తిథిలో ప్రయాణము చేస్తే ఏ ఫలితము వస్తుంది? ..... 129
193. ఈ కలియుగంలో ఏ కార్యం అనంతమైన ఫలితాన్నిస్తుంది?..... 130
194. దుఃస్వప్న దోషములు హరించిపోవుటకు? ..... 130
195. కన్యాదానమంటే? కొన్ని విషయాల వరకే వరునికి హక్కు?..... 131
196. పురుషులకి పరాయి స్త్రీలపై మోజెందుకు? ..... 131
197. కంకణాన్ని ఎందుకు కట్టుకుంటారు? ..... 132
198. ప్రయాణానికీ, తీర్థయాత్రలకీ ఏ రోజు మంచిది? ..... 133
199. శరీరంలో ఏ భాగం అదిరితే ఎలాంటి ఫలం? ..... 133
200. దానవసత్వ స్త్రీ లక్షణములు? ..... 134
201. సకల కార్యాల్లోనూ, గృహస్థుడిగానూ విజయుడవ్వాలంటే?..... 134
202. నీటి ప్రయాణములో అపశృతి జరగకుండుటకు? ..... 135
203. భగవంతునికి అర్పించే టెంకాయలో మరో పరమార్థం? ..... 135
204. వధూవరుల వివాహంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు? ..... 135
205. ఒకరి దుస్తులు మరొకరు ధరించవచ్చా? ..... 137
206. పిల్లలు పుట్టని దంపతులు 'గాయత్రి' జపిస్తే సంతానం కలుగుతుందా? ..... 137
207. గృహస్థాశ్రమమంటే? ..... 138
208. ఈ పుత్రుడ్ని కూడా కొడుకుగానే పరిగణించాలి? ..... 138
209. వివాదములు తొలగి విజయము చేకూరుటకు? ..... 139
210. జ్యేష్ఠాదేవి ఆవహిస్తే వచ్చే లక్షణాలు? ..... 139
211. కొత్తగా పెళ్ళయిందా? ..... 139
212. నిద్రలేవగానే చూడాల్సిన వస్తువులేమిటి? ..... 140
213. మహాశివుడు లింగరూపంలో ఎందుకుంటాడు? ..... 140
214. పురాతన కాలంలో దేవదాసిల ధర్మాలు? ..... 141
215. దేవాలయ వాతావరణంలో నూతన శక్తి మనలో ఎందుకొస్తుంది? ..... 141
216. సంతానవంతులగుటకు చేయ వలసిన జపము? ..... 142
217. ఎలాంటి స్త్రీ వేశ్యక్రింద వస్తుంది? ..... 142

218. రాక్షససత్వ స్త్రీ లక్షణము? ..... 142
219. కులాలెందుకు ఏర్పరిచారు? ..... 143
220. తల్లీ, తండ్రీ వివాహం గూర్చి పట్టించుకోకపోతే? ..... 143
221. విశ్వామిత్రుడు హరిశ్చంద్రుడ్ని అడిగిన ధనమెంత? ..... 144
222. ఈ సమస్త సృష్టిలో తొలిపెళ్ళికూతురు,
తొలి ముత్తైదువ ఎవరు? ..... 145
223. జపం తర్వాత ఎంత నిగ్రహంగా ఉండాలి? ..... 145
224. సర్వకార్యసిద్ధి కొరకు? ..... 146
225. కొబ్బరి కల్లు త్రాగితే సుందరమైన బిడ్డలు పుడతారా? ..... 146
226. శివాలయంలో ప్రదక్షిణ చేసేటప్పుడు చేయాల్సిన
ముఖ్య విధి? ..... 146
227. భోజనము చేస్తున్నప్పుడు ఎన్ని నీళ్ళు త్రాగాలి? ..... 147
228. స్త్రీ లక్షణాల బట్టి ఏ జాతికి చెందినదవుతుంది? ..... 147
229. ఆడపిల్లను శుక్రవారమూ, కోడలిని శనివారమూ
పంపకూడదా? ..... 149
230. తిరుమల లడ్డు ఎప్పట్నించి ప్రసాదంగా వస్తోంది? ..... 149
231. ఎలాంటప్పుడు అబద్ధం ఆడాలి? ఏ సమయంలో
అబద్ధం ఆడకూడదు? ..... 149
232. పూర్వ కాలంలో తుఫానువంటి ఉపద్రవాలొస్తున్నాయని
ఎలా కనిపెట్టేవారు? ..... 150
233. సర్వారిష్టములు తొలగుటకు? ..... 151
234. హీరవాయువు ఏ సమయంలో వీస్తుంది? ..... 151
235. ఆయుర్వేదమున అనారోగ్యకాలంగా చెప్పిన రోజులు? ..... 151
236. పదిమంది మీ వద్దకు వచ్చినప్పుడు ఎలా మాట్లాడాలి? ..... 152
237. ఆయుర్వేద, ధర్మశాస్త్రాల్లో చెప్పినవి? ..... 152
238. భోజనాన్ని ఎలా తినాలి? ..... 153
239. శ్రీకృష్ణుడిలో చూడాల్సింది చిలిపితనమే కాదు? ..... 153
240. ధనుర్మాసంలో గొబ్బెమ్మలు ఎందుకు పెడతారు? ..... 154
241. కొత్తబిచ్చగాడు పొద్దెరగడంటే? ..... 154
242. కలియుగములో మానవులు చేసే ఎట్టి పాపములైనను
తొలగుటకు? ..... 155
243. ఏ శివాలయంలో పూజ చేస్తే ఏ ఫలం? ..... 155
244. ఏ నక్షత్రములో ఇచ్చిన సంపదలు తిరిగిరావు? ..... 155
245. గంగాజలములో అంతటి శక్తి ఉండటానికి కారణమేమిటి?..... 156
246. పాపమంటే రోగము.... పుణ్యమంటే ఆరోగ్యము! ..... 156
247. నవరత్నాల ఉంగరాన్ని ధరించమని శాస్త్రాలెందుకు చెప్పాయి? ..... 156
248. ఏ రోజు పాపాలు ఆ రోజే ఎలా పోతాయి? ..... 157
249. నదులు, సముద్రములు దాటుతున్నప్పుడు? ..... 157
250. పుణ్యం కొద్దీ పురుషుడూ, దానం కొద్దీ బిడ్డలూ అంటే? ..... 158
251. పెళ్ళాం వండి పెట్టిన దానికన్నా, బైట...
రుచెందుకు ఉంటుంది? ..... 158
252. నిద్రపోయే వార్ని ఎలా లేపాలి? ..... 158
253. కలబంద నివాస, వ్యాపార సంస్థలకి కట్టేదెందుకు? ..... 159
254. భవిష్యపురాణంలో తెలిపిన సుఖము నిచ్చు
స్త్రీ లక్షణములు ఏమిటి? ..... 159
255. నాగసత్వ స్త్రీ లక్షణము? ..... 161
256. ప్రొద్దున లేవగానే ఎవరి మొహం చూసావంటే...? ..... 161
257. శృంగారంలో వెనకపడితే? ..... 161
258. నెమలి కన్నులుగల పింఛము శివునికెందుకు సమర్పిస్తారు?..... 162
259. నిండు నూరేళ్ళు ఆరోగ్యంగా బ్రతకాలంటే? ..... 162
260. లేవగానే చేతులు రుద్ది కళ్ళకు అద్దుకునేది దేనికి? ..... 162
261. చెప్పులను బైట వదలి రావాలని ఎందుకంటారు? ..... 163
262. మన శరీరంలో విశుద్ధి చక్రం ఎక్కడుంది? ..... 163
263. నరసత్వ స్త్రీ లక్షణము? ..... 164
264. తులసిలో మహోన్నతమైన ఆరోగ్యం దాగి ఉందా? ..... 164
265. ప్రతినెలా ఓ సంవత్సరం మీ వయస్సు వెనక్కి వెళ్ళాలంటే?..... 165
266. నిత్యకళ్యాణము పచ్చతోరణ మంటారెందుకు? ..... 165
267. కార్యసిద్ధి మంత్రము ..... 166

268. జనన లోపాల నివారణ మర్రి ఆకు భోజనము! ..... 166
269. శుభలేఖలకి నలువైపులా పసుపు ఎందుకు రాస్తారు? ..... 166
270. మంగళసూత్రాల్లో గుబ్బ ఎందుకుంటుంది? ..... 167
271. సముద్రస్నానం ఎలా చేయాలి? ..... 167
272. మనుజుడు రోజును ఎలా ప్రారంభించి, ఎలా పూర్తి చేయాలి? ..... 168
273. జ్వరం, తలనొప్పి తగ్గు ముఖం పట్టుటకు? ..... 168
274. మన పెద్దలు మడితో భోజనము చెయ్యమన్నదెందుకు? ..... 169
275. ఋషులూ, మునులూ నియమిత వేళలో
సూర్యనమస్కారం చేసేదెందుకు? ..... 169
276. దేవసత్వ స్త్రీ లక్షణములు ..... 170
277. సంఖ్యా శాస్త్రం ప్రకారం పిల్లలకి పేర్లెలా పెట్టాలి? ..... 170
278. మహా పుణ్యాతి పుణ్య పూజాదికార్యాలేవి? ..... 170
279. బిడ్డలకి దిష్ఠి ఎలా తియ్యాలి? ..... 171
280. దంతధావన ఎలా చేయాలి? ..... 171
281. సర్వ మంగళప్రదమైన గృహము కొరకు? ..... 172
282. తలస్నానం చన్నీటితో ఎందుకు చేయమంటారు? ..... 172
283. హోమగుండం వద్ద ఎలాంటి ముగ్గులు వేస్తారు? ..... 172
284. గజసత్వ స్త్రీ లక్షణము? ..... 173
285. తల్లీ, తండ్రీ ఎంత గొప్పవారని శాస్త్రాలు చెబుతున్నాయి? ..... 173
286. విఘ్నేశ్వరుని ప్రసాదం తిన్న తర్వాత ఏం చెయ్యాలి? ..... 174
287. ఉఫ్.. ఉఫ్.. మని ఆహారాన్ని తినటము, పెట్టడం
చేయరాదు? ..... 175
288. శనిగ్రహం గూర్చి భయం వద్దు? ..... 175
289. ఫలాలను ఎలా ఆరగించాలి? ..... 175
290. ఉదయం లేవగానే గోరువెచ్చని నీళ్ళెందుకు త్రాగుతారు? ..... 176
291. కార్యము ఏ రోజు పెట్టుకోవాలి? ..... 176
292. నిత్యమూ ఏఏ సమయాల్లో, ఏమని దైవస్మరణ చేయాలి? ..... 177
293. కుబేరుని మూల మంత్రం ..... 177
294. నవగ్రహాలకి ప్రదక్షిణ ఎక్కడ్నించి ప్రారంభించాలి? ..... 177
295. తల్లి గర్భంలో బిడ్డ ఏ విధంగా ఎదుగుతాడు? ..... 178
296. శుభకార్యం జరగాలని భావించే వారు
చేయాల్సిన స్నానము? ..... 179
297. ఉత్తమమైన ఆహారమేది? ..... 179
298. గోరువెచ్చని నీటితో స్నానమెలా చెయ్యాలి? ..... 179
299. కాకసత్వ స్త్రీ లక్షణము? ..... 180
300. శంఖము పూరించటమంటే? ..... 180
301. ఉత్తమోత్తమమైన కృతజ్ఞతంటే? ..... 180
302. మానవుని జీవిత ఆయుష్షు పదేళ్ళ లోపా? ..... 181
303. ఏ రోజుల్లో అభ్యంగనస్నానం చేయకూడదు? ..... 181
304. దశషోడశ దానాలేవి? ..... 182
305. సకల దేవతలకీ సమర్పించవల్సిన ప్రీతికరమైన
నైవేద్యాలు ఇవి మాత్రమే! ..... 182
306. భర్తను కొంగున ముడివేసుకోవటానికి ఆయుర్వేద
పుస్తకాల్లోని పెట్టుమందులో ఎంత సత్యముంది? ..... 183
307. ఏ సంతానాన్ని దానమివ్వాలి? ..... 184
308. కంటి వ్యాధులున్న వారు వెండి కంచంలో తినటం
ఎంత మంచిది? ..... 184
309. దైవస్నానము అంటే? ..... 184
310. కాశీకీ, శబరిమల వెళ్ళేటప్పుడు తల్లి అనుమతి
తీసుకోవాలా? ..... 185
311. నిద్రలేవగానే భగవంతుని ధ్యానమెందుకు? ..... 185
312. వైతరిణి నది ఎలా ఉంటుంది? ..... 185
313. చతుర్విధ దానాలంటే? ..... 186
314. యమపురిదారెలా ఉంటుంది? ..... 186
315. ఏ పాపాలు ఎన్ని యజ్ఞాలు చేసినా పోవు? ..... 187
316. ఏ సుగుణం వల్ల ఏది సిద్ధిస్తుంది? ..... 187
317. అమృతా సద్గుణా పత్ని అంటే? ..... 188
318. ఏవి చేయకూడదు? ఏవి చేయాలి? ..... 188

319. ఏ తుమ్ము శుభప్రదమైనది? ..... 189
320. బాదం ఆకులో భోజనం వల్ల ఏ ఫలం వస్తుంది? ..... 189
321. మహిళలు ఎంతటి తెలివిగలవారు? ..... 189
322. ఈ భూమికి మహాప్రళయం ఎప్పుడు? ..... 190
323. తల్లినీ, తండ్రినీ, పెద్దలనూ ధిక్కరించి చులకన చేస్తే? ..... 190
324. బంగారు వంకీలు ధరించటంలో పరమార్థం? ..... 191
325. వన్యప్రాంతాల్లో ఋషులెందుకు నివాసం ఏర్పరుచుకుంటారు? ..... 191
326. విషబాధలు గల రోగులు మహాశివుణ్ణి ఎందుకు ప్రార్థిస్తారు?....192
327. అత్తగారింట ఏ వైపు తలపెట్టి నిద్రించాలి? ..... 192
328. ఏ ఋతువుల్లో ఏ వస్త్రాలు ధరించాలి? ..... 193
329. వ్యభిచరిస్తే నరకంలో యముడు ఏ శిక్ష విధిస్తాడు? ..... 194
330. దుర్మార్గులూ, స్త్రీ మానస చోరులూ ఎలా జన్మిస్తారు? ..... 194
331. పెళ్ళిలో ఎవరు ముందు జీలకర్ర పెడతారో వారి మాటే చెల్లుతుందా? ..... 195
332. ఋషులు కమండలంలోని నీళ్ళు చల్లి శపించేదెందుకు? ..... 195
333. ఆలయాల్లో వేదస్నానగుండం ఉండేదెందుకు? ..... 196
334. బంగారు కంచంలో తింటే ఆయుష్షు పెరుగుతుందా? ..... 196
335. ఎప్పుడు గర్భవతి అయితే ఎలాంటి బిడ్డలు కలుగుతారు?..... 197
336. నిద్రరానివారు గోరింటాకు తలక్రిందెందుకు పెట్టుకుంటారు? ... 198
337. చెడుసావాసాలు వద్దు అని పెద్దలు మందలించేదెందుకు?..... 198
338. దీర్ఘాయుష్మంతునిగా భర్త ఉండాలంటే? ..... 199
339. గంపలో పెళ్ళికూతురిని ఉంచి తెచ్చేదెందుకు? ..... 199
340. జింక చర్మము మీద గతంలో తపస్సు చేసేవారెందుకు? ..... 199
341. ఆహారం తీసుకునేముందు దైవ ప్రార్థన చెయ్యటమెందుకు?..... 200
342. పురుషుల్లో పుణ్య పురుషులు వేరయా ... అంటే? ..... 200
343. చిరకాల మిత్రునిగా నిలిచిపోవాలంటే? ..... 201
344. ఆజ్ఞాచక్రాన్ని ఎలా పూజించాలి? ..... 201
345. ఇవన్నీ ఇలా చెయ్యటం చాలా అనారోగ్యము? ..... 202
346. స్త్రీలు సుందరకాండను ఎందుకు పఠించకూడదంటారు? ..... 204
347. తాంబూలాన్ని ఎవరు వేసుకోకూడదు? ..... 204
348. ఉదయం లేవగానే చెయ్యాల్సిన భూ ప్రార్థన? ..... 205
349. భగవంతుడు కామాన్ని ఎందుకు పెట్టాడు? ..... 205
350. ఆవుపాలు ఎంత శ్రేష్ఠమైనవి? ..... 205
351. ఆచమనములో మూడు ఉద్ధరిణిల నీటి పరమార్థం ఏమిటి? ...206
352. ఎర్రరంగుతో ఉన్నది కుంకుమకాదు! ..... 206
353. వేదాలూ, ఉపనిషత్తులను చేతులతో తాకి కన్నులకు అద్దుకోమని ఎందుకు చెప్పారు? ..... 207
354. ఇంట్లో గాలీ, ధూళీ ఉంటే తులసి చెట్టు ఎండిపోతుందా?..... 207
355. బ్రహ్మస్నానము ఎలా చేయాలి? ..... 208
356. దేవాలయం నుంచి వచ్చాక స్నానం చెయ్యకూడదా? ..... 208
357. దైవధ్యానం ఎలా చెయ్యకూడదు? ..... 209
358. ఈ స్త్రీ కూడా పతివ్రత క్రిందే వస్తుంది? ..... 209
359. స్నానబట్టను ఎలా వదలాలి? ..... 209
360. 'కృష్ణ, కృష్ణ, కృష్ణ' అని తలుస్తే? ..... 210
361. ధగ ధగ మెరిసే బంగారు వడ్డాణం కేవలం వైభోగమే కాదు? ..... 210
362. ఏ సంవత్సరం ఎక్కడ పుష్కరం... పుష్కర పరిధి గల ప్రాంతము? ..... 211
363. బృహస్పతి మేషములో ప్రవేశించిన? ..... 211
364. బృహస్పతి వృషభములో ప్రవేశించిన? ..... 212
365. బృహస్పతి మిధునములో ప్రవేశించిన? ..... 212
366. బృహస్పతి కర్కాటకములో ప్రవేశించిన? ..... 212
367. బృహస్పతి సింహములో ప్రవేశించిన? ..... 212
368. బృహస్పతి కన్యలో ప్రవేశించిన? ..... 213
369. బృహస్పతి తులలో ప్రవేశించిన? ..... 213
370. బృహస్పతి వృశ్చికములో ప్రవేశించిన? ..... 213
371. బృహస్పతి ధనస్సులో ప్రవేశించిన? ..... 213
372. బృహస్పతి మకరములో ప్రవేశించిన? ..... 214

373. బృహస్పతి కుంభములో ప్రవేశించిన? ..... 214
374. బృహస్పతి మీనములో ప్రవేశించిన? ..... 214
375. స్వామికి హారతి ఎలా ఇవ్వాలి? ..... 215
376. 108 ప్రాముఖ్యత విశేషాలు? ..... 215
377. పురుషులకు ఏ రోజు తలంటు స్నానం చేస్తే
ఏ ఫలం వస్తుంది? ..... 216
378. ఋతు సమయంలో స్త్రీలు పసుపు నీరెందుకు త్రాగుతారు?..... 216
379. పుత్రుడ్ని తండ్రి ఎలా పెంచాలి? ..... 217
380. ఎలాంటి కాటుకను పెట్టుకోవాలి? ..... 217
381. తాంబూలంలో ఎంత ఆరోగ్యముంది? ..... 218
382. కంచుపాత్రలో ఏ పానీయము త్రాగరాదు? ..... 218
383. అష్టమైథునములంటే? ..... 219
384. నైరుతిలోనే ఆరోగ్యముందా? ..... 219
385. సంపదల కోసమూ, విజయం కోసమూ! ..... 219
386. చూపుడు వేలును ధర్మకార్యాల్లో ఎందుకు
వినియోగించకూడదు? ..... 220
387. పులిచర్మము మీద పూర్వకాలంలో ఋషులెందుకు
తపస్సు చేసేవారు? ..... 220
388. పిల్లేళ్ళు ఎందుకు ధరిస్తారు? ..... 221
389. ఆనుకొని కూర్చుంటే ఫలమురాదా? ..... 221
390. ఏ స్త్రీ ఎన్ని వరాలు కోరుకోవాలి? ..... 221
391. ఏ సమయంలో అన్నమాట జరిగి తీరుతుంది? ..... 222
392. పురాతన కాలంలో వర్షాలు పడతాయని ఎలా
నిర్ధారించేవారు? ..... 222
393. ఈ ప్రపంచంలో దురదృష్టవంతులెవ్వరు? ..... 222
394. ఏ దేవునికి ఏ అక్షతలు వాడాలి? ..... 223
395. అసలు సిసలు మిత్రుడంటే? ..... 223
396. స్త్రీలు సిగ్గు పడినప్పుడు ఈ పని చేయరాదు? ..... 223
397. విభూధి బొట్టు ఎలా పెట్టుకోవాలి? ..... 224
398. అరటిఆకు ఎలా వేసి వడ్డించాలి? ..... 224
399. సిద్ధులూ, యోగులూ తమని తాకనీయరు. దేనికి? ..... 224
400. ఏ భోజనాన్ని ఏమంటారు? ..... 225
401. సన్యాసులు పాదాలకి మెట్టెలు, కడియాలు ఎందుకు ధరిస్తారు? ..... 225
402. ఏ సమయంలో ఏ పని ఏ దిక్కుగా ప్రారంభించాలి? ..... 226
403. తాంబూలము ముత్తైదువులకు ఎలా ఇవ్వాలి? ..... 226
404. తలక్రింద చెయ్యి పెట్టి ఎందుకు నిద్రించకూడదు? ..... 226
405. స్త్రీ ధనమంటే? ..... 227
406. ఎవరు అతిథి మర్యాదలు పాటించనవసరంలేదు? ..... 227
407. అడ్డబాస పరమార్థము ..... 227
408. ఏ వస్తువులు శ్రాద్ధకార్యాలకు వాడకూడదు? ..... 228
409. వధూవరుల తలపై పెట్టించే జీలకర్రా - బెల్లంలో
ఆయుర్వేద రహస్యం? ..... 228
410. సౌందర్యవతియైన భార్య కావాలనుకుంటే ? ..... 229
411. దీర్ఘాయుష్మంతునిగా భర్త ఉండాలంటే? ..... 230
412. సకల కార్యాల్లోనూ, గృహస్థుడిగానూ విజయుడవ్వాలంటే?..... 230
413. ఎన్నిజన్మల తర్వాత మానవజన్మ? ..... 231
414. సంపదల కోసమూ, విజయం కోసమూ ..... 231
415. మహావిజయం కొరకు? ..... 231
416. లక్షలాది రూపాయలు విలువ చేసే ఆరోగ్య
రహస్యం ఈ క్రింది విషయంలో ఉందా? ..... 232
417. తెలుసుకోవాల్సిన విషయం? ..... 232
418. భార్యను దగ్గరికి తీసుకున్నప్పుడు కనులు తెరిచే ఉంచాలా?..... 233
419. వికలాంగులుగానూ, ఓ పూట తిండి కూడా దొరకని దేశాల్లో
కాకుండా అన్ని అవయవాలిచ్చి దేవుడు మనమెందుకు పుట్టించాడు?..... 233
420. నీళ్ళు త్రాగటం మంచిదేనా? ..... 234
421. గర్భిణీ స్త్రీ పెరుగెందుకు తినకూడదు? ..... 234
422. వర్షపు నీరు త్రాగితే మంచిదా? ..... 234
423. పాలను ఎవరు త్రాగాలి? ఎప్పుడు త్రాగాలి? ..... 235

424. అతి వేడి లేదా అతి చల్లని పదార్థాలు తినకూడదా? ..... 235
425. కొత్త పెళ్ళికూతురిచే అత్తవారింట అడుగుపెట్టినప్పుడు
సింహద్వారం వద్ద బియ్యాన్ని ఉంచి ఎందుకు దొర్లిస్తారు?..... 236
426. ఏ పాలు శ్రేష్ఠము? ..... 236
427. ఆహారం తీసుకునేటప్పుడు తీసుకోవాల్సిన జాగ్రత్తలు? ..... 237
428. పెరుగన్నంలో అరటిపండు ఎందుకు తినకూడదు? ..... 237
429. ఆదివారం మాంసాహారం తినకూడదా? ..... 238
430. విదియ రోజు పురాణ పరమార్థం ఏమిటి? ..... 238
431. కార్తీక ఏకాదశీ, ద్వాదశీ, పౌర్ణమిలలో చన్నీళ్ళ స్నానాలెందుకు? ..... 239
432. భగవంతుడిచ్చిన మేథస్సును ఎలా ఉపయోగించకూడదు?..... 239
433. ఏ పాలను త్రాగకూడదు? ..... 240
434. ఎవరు మాంసాహారం భుజించాలి? ..... 241
435. కార్తీక మాసములో తైలదీపాన్ని ఎందుకు వెలిగించమంటారు? ..... 241
436. పెరుగును ఎవరు తినవచ్చు? ..... 242
437. ఏ మాంసాన్ని తినాలి? ..... 242
438. అనేక పూలమాలలలో మరువం తప్పక వాడతారెందుకు?..... 243
439. కొత్తపెళ్ళికూతురు తెల్లచీర, మల్లెపూలు పెట్టుకోవటంలో
పరమార్థం? ..... 243
440. ఉసిరికాయ మీద ఆవునేతి దీపం ఎంత పుణ్యము? ..... 244
441. వినాయక చవితి పత్రిలో ఎన్ని ఆరోగ్య రహస్యాలున్నాయి?..... 244
442. పాలను ఏ పాత్రలో కాయటం ద్వారా ఎంత శ్రేష్ఠమౌతాయి? ...247
443. సంవత్సరానికొక్కసారైనా ఉసిరి తినమని ఎందుకు చెప్పారు? ..... 247
444. దాయాల్సింది వయసొక్కటే కాదు? ..... 248
445. ఎలాంటి వారికి అదృష్టము కలిసి వస్తుంది? ..... 248
446. విజయదశమి రోజు జమ్మి చెట్టునెందుకు పూజిస్తారు? ..... 249
447. ఆడపిల్ల అందంగా ఉంటే సుఖపడుతుందా? ..... 249
448. కొత్త ఇంటి ప్రవేశమప్పుడు పాలు పొంగించమనేదెందుకు?..... 250
449. చిన్నపిల్లలు బిందెలను కొడుతుంటే పెద్దలు తిట్టేదెందుకు?..... 250
450. దైవపూజలు, ధర్మకార్యాల సమయంలో ఆచమనము
చేసేటప్పుడు గుర్తుంచుకోవాల్సినవి? ..... 251
451. ఉదయాన్నే పూజకు ఉపక్రమిస్తూ గుర్తుంచుకోవాల్సినవి? ..... 251
452. పారాణి పెట్టడంలో సంప్రదాయముతో పాటు ఆరోగ్యం కూడా? ..... 252
453. ఆషాఢమాసంలో స్త్రీలను గోరింటాకు పెట్టుకోమని చెప్పేదెందుకు?..... 253
454. దానం కన్నా, అన్న దానం కన్నా గొప్ప పుణ్యకార్యం? ..... 254
455. గోకులాష్టమి రోజు అర్థరాత్రి నైవేద్యం పెట్టేదెందుకు? ..... 254
456. భగవంతుని పూజకు ఏ పూలు ఎన్ని రోజుల వరకూ
అర్పించవచ్చు? ..... 255
457. రథసప్తమినాడు జిల్లేడు ఆకులను తలపై, భుజాలపై
పెట్టుకొని ఎందుకు స్నానం చేస్తారు? ..... 255
458. గృహంలో దేవతా విగ్రహాలు రెండు అంగుళాలు
మించి ఉండకూడదా? ..... 256
459. నవగ్రహాల ప్రదక్షిణా, పూజ తర్వాత తప్పనిసరిగా
చెయ్యాల్సినవి? ..... 256
460. ఊరేగింపులూ, ఉత్సవాల సమయంలో దేవుని ఉత్సవ
విగ్రహాల ముందు బిందెతో నీళ్ళెందుకుపోస్తారు? ..... 256
461. కాళిదాసు సూక్తి ..... 257
462. శ్రీరామజననమెప్పుడు? ..... 257
463. మూడురంగుల దారాన్ని ఉపయోగించి దీపాన్ని
వెలిగించేది ఎందుకు? ..... 258
464. నైవేద్యం పెట్టేటప్పుడు ముఖ్యంగా గుర్తుంచుకోవాల్సినది? ..... 259
465. విదురుడు సూక్తి ..... 259
466. మామిడి పండును దానమిచ్చాకగానీ లేదా
గుళ్ళో ఇచ్చాకగానీ తినేదెందుకు? ..... 259
467. చాణక్యుడు సూక్తి ..... 260
468. పూజాదికాలు నిర్వహించేటప్పుడు ఏ రంగు
పట్టు బట్ట కట్టడం మంచిది? ..... 260
469. భర్తృహరి సూక్తి ..... 261

470. చండ ప్రదక్షిణము చేస్తే ముప్పయి వేల ప్రదక్షిణములు చేసిన ఫలమా? ..... 261
471. వేదవ్యాసుడు సూక్తి ..... 262
472. మహారుద్రునికి అభిషేకం చేస్తే ఏ ఫలం వస్తుంది? (రుద్రకా మ్యార్చనలో) ..... 262
473. కబీరుదాసు సూక్తి ..... 263
474. మందార పుష్పాలతో ఏ దేవతలని పూజించాలి? ..... 264
475. వేటివల్ల ప్రయోజనం ఉండదు? ..... 264
476. కాకులకెందుకు అన్నం పెడతారు? ..... 264
477. తులసీదాస్ సూక్తి ..... 265
478. తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి పాదరక్షలెందుకు అరుగుతాయి? ..... 265
479. ధ్వజస్థంభము లేదా దేవాలయపు గోపురం నీడ పడిన ప్రదేశంలో ఎందుకు కాపురం ఉండకూడదు? ..... 266
480. ఏ విధంగా నిద్రించాలి? ..... 266
481. కన్యాదానం వల్ల ఎన్ని తరాలు తరిస్తాయి? ..... 267
482. సూరదాసు సూక్తి ..... 268
483. దీపావళి టపాసుల ఆచార పరమార్థమేమిటి? ..... 268
484. తర్పణములూ, తిల తర్పణములెందుకు? ..... 269
485. ఆరతి ఇచ్చిన ఎర్రనీళ్ళను, ఇంటి ముందెందుకు చల్లుతారు? ..... 270
486. ఏకశ్లోకంలో రామాయణగాథ పుణ్యఫలమేనా? ..... 271
487. పగలెవరు నిద్రపోవచ్చు? ..... 272
488. వాల్మీకి సూక్తి ..... 272
489. నోముకీ, వ్రతానికీ తేడా? ..... 272
490. పసుపు కలిపిన అక్షింతలు వేసి ఆశీర్వదించమనేది ఎందుకు? ..... 273
491. విదురుడు సూక్తి ..... 274
492. సంగమించకూడని రోజులు? ..... 274
493. తిరువళ్ళువర్ సూక్తి ..... 275
494. మన పూర్వీకులు ఏకాదశి ఉపవాసం ఎందుకు పెట్టారు?..... 275
495. భర్తృహరి సూక్తి ..... 276
496. క్షౌరము ఏయే రోజుల్లో ఎందుకు చేయించుకోకూడదని పెద్దలు చెప్పారు? ..... 276
497. ఏ మాలధరిస్తే ఏ ఫలితం వస్తుంది? ..... 277
498. శ్రీకృష్ణ భగవానుడు సూక్తి ..... 278
499. నవ్వు నాలుగు విధాల చేటంటే? ..... 278
500. వాల్మీకి సూక్తి ..... 279
501. ముక్కోటి ఏకాదశినాడు తినే అన్నంలో రాక్షసుడున్నాడా?..... 279
502. తిరుమలలో ప్రసాదంగా లడ్డుకు ముందేమి ఇచ్చేవారు ..... 280
503. జంట అరటిపళ్ళను తినవచ్చా? ..... 280
504. తిరువళ్ళువర్ సూక్తి ..... 281
505. శివుని వక్షస్థలంపై శ్రీలలితా త్రిపురసుందరి ఎందుకుంటుంది? ..... 281
506. చాణక్యుడు సూక్తి ..... 282
507. భార్యకి ఏడవనెల వస్తే భర్త పూజలు చేయకూడదా? ..... 282
508. గురువాయూర్ దేవాలయంలో అభిషేక నూనెను రాసుకుంటే కీళ్ళనొప్పులు పోతాయా? ..... 283
509. కాళిదాసు సూక్తి ..... 283
510. తలుచుకున్నంతనే స్నానం చేసినంత ఫలాన్నిచ్చే నదులు? ..... 283
511. వేదవ్యాసుడు సూక్తి ..... 284
512. దేవతా విగ్రహాలకి ఎలా నమస్కరించాలి? ..... 284
513. పూజ కోసం పూలు కోసినా పాపమేనా? ..... 285
514. సకల అమ్మవారి దేవాలయాల్లోనూ లలితా సహస్రనామమెందుకు చదువుతారు? ..... 286
515. తిరుపతి వేంకట కవులు సూక్తి ..... 286
516. పురుషులలో పుణ్య పురుషుణ్ని ఎందుకు కోరుకుంటుంది స్త్రీ? ..... 287
517. ఎంతకోపంలో కూడా ఆడవారు చెయ్యకూడని పనులు? ..... 288
518. ఏ దిక్కు గృహం ఎవరికి మంచిది? ..... 288
519. నిర్ణయ సింధు సూక్తి ..... 289

520. గ్రహదోషాలు పోవాలంటే ఆవుకి ఏ ఆహారం అందివ్వాలి? ..... 289
521. శనీశ్వరుని పటం గృహంలో ఉండవచ్చా? ..... 290
522. ఏకాదశినాడు ఉపవాసం ఉండకుండా ఉంటే అనారోగ్యమా? ..... 290
523. ద్వాదశాదిత్యులు ఎవరు? ..... 291
524. బీజాక్షరాలంటే? ..... 291
525. మీరు ధర్మపరంలో నుండగా మిమ్మల్ని కించపరిస్తే? ..... 292
526. కాళిదాసు సూక్తి ..... 292
527. గృహంలో బిల్వవృక్షాన్ని ఎంచుకోవచ్చా? ..... 292
528. గర్భం ధరించిన తర్వాత పుంసవనము ఎప్పుడు చేయాలి? ..... 293
529. రాగిపాత్రలో తీర్థం ఎందుకు పుచ్చుకోకూడదు? ..... 294
530. చూపుడు వేలుపెట్టి ఎవరెవర్ని చూపించకూడదు? ..... 294
531. శ్రీహర్షుడు సూక్తి ..... 295
532. కనుమల రోజున ప్రయాణించకూడదా? ..... 295
533. ఏకభుక్తమంటే? ..... 295
534. తిరువళ్ళువరు సూక్తి ..... 296
535. ఎవరితో పెట్టుకోకూడదు? ..... 296
536. సంవత్సరానికొక్కసారన్నా స్వామిని ఇలా దర్శించుకోవాలి?..... 296
537. చాణక్యుడు సూక్తి ..... 297
538. సీతా, రామా, గౌరీ అని పేర్లు పెట్టుకుంటే కష్టాలొస్తాయా? ..... 297
539. అష్టదరిద్రాలంటే? ..... 297
540. దీపాన్ని ఏవైపు పెట్టి దీపారాధన చెయ్యాలి? ..... 298
541. సాష్టాంగ నమస్కారము ఎప్పుడు చేయాలి? ..... 299
542. వధూవరులతో ఒకరి కాలివేలి బొటన వ్రేలిని మరొకరి చేత ఎందుకు తొక్కిస్తారు? ..... 299
543. విదురుడు సూక్తి ..... 300
544. మహాభారతం చదవటం ద్వారా ఏ విషయాలను తెలుసుకోవచ్చు? ..... 300
545. పదకొండో ఏకాదశి తిథి ముక్కోటి ఏకాదశి ఎంత పవిత్రము? ..... 301
546. ప్రతి ఒక్కరూ ఆచారించాల్సినవి? ..... 301
547. కాళిదాసు సూక్తి ..... 302
548. జన్మనిచ్చిన వారు పోయినప్పుడు దేవాలయములోనూ, అత్తింట్లోనూ ఎందుకు నిద్ర చేస్తారు? ..... 302
549. భీష్మపితామహుడు సూక్తి ..... 303
550. దీపావళి రోజు ఎక్కడెక్కడ దీపాలు పెట్టాలి? ..... 303
551. 'ఓం'కారం శక్తి? ..... 304
552. ఏకాదశి ఎంత గొప్పది? ..... 304
553. పూజాదికాల్లో గోత్రనామా లెందుకు చెప్పుకుంటారు? ..... 305
554. నాలుగు మహామహత్తు కలిగిన పర్వదినములు? ..... 305
555. నంది కొమ్ముల మధ్య నుంచి పరమేశ్వరుని దర్శిస్తూ పఠించాల్సిన స్తోత్రము? ..... 306
556. గర్భం ధరించిన స్త్రీ ఏవి చూడకూడదు? ..... 306
557. కొబ్బరికాయ సగానికి పగలకపోతే? ..... 307
558. ఓం శాంతి శాంతి శాంతిః అనేదెందుకు? ..... 308
559. కాశీకి ఎప్పుడెళితే పుణ్యం? ..... 309
560. ఎవరి జన్మ నక్షత్రంలో వారు చేయకూడనివి? ..... 309
561. దక్షిణావర్తమైన శంఖములో తీర్థమెందుకంత శ్రేష్ఠము? ..... 310
562. శివలింగానికి తలని ఆన్చి చెవిలో చెప్పేదెందుకు? ..... 311
563. వజ్జాలగ్గమ్ సూక్తి ..... 311
564. అబద్ధాలు ఆడితే ఆడపిల్లలు పుడతారంటా రెందుకు? ..... 311
565. గర్భగుడిలో చిన్న దీపం ఎందుకు పెడతారు? ..... 312
566. కార్తీక మాసంలో ఎన్ని నోములూ, వ్రతాలున్నాయి? ..... 313
567. ఏ గ్రహశాంతికి ఎన్ని జపాలు చేయించుకోవాలి? ..... 314
568. హనుమంతుణ్ణి 'భజరంగభళీ' అని ఎందుకంటారు? ..... 314
569. ఏడుపు, కన్నీరు ఎలా వస్తుంది? ..... 315
570. దేవీ నవరాత్రుల్లో అమ్మవారికి ఏ రోజు ఏ పూలమాల వేయాలి? ..... 315
571. బృహత్సంహిత సూక్తి ..... 316
572. నవరాత్రి తొమ్మిది రోజులు పెట్టవలసిన నైవేద్యాలు ? ..... 316

573. దీపాన్ని దేనితో వెలిగించాలి? ..... 317
574. కొన్ని పుణ్యక్షేత్రాల్లో జుట్టునూ, కాలి, చేతి వేళ్ళ గోళ్ళనూ తొలగించి నదిలో వేయించేదెందుకు? ..... 317
575. శ్రీరాముడు రావణుడితో యుద్ధం చేసింది సీత కోసమే కాక నిగూఢంగా ఉన్న మరో కారణం? ..... 318
576. జపం చేసేటప్పుడు జపమాలను గోముఖ సంచిలో ఉంచేదెందుకు? ..... 318
577. మనల్ని నడిపించే మనలోని శక్తులు? ..... 319
578. ఎవరికి ఎలా దణ్ణం పెట్టాలి? ..... 319
579. మజ్జిగలో ఎన్ని రకాలున్నాయి? అవి ఏమిటి? ..... 320
580. భర్త భార్య ఎంగిలి ఎందుకు తినకూడదు? ..... 322
581. ఉమా సంహిత సూక్తి ..... 324
582. ధనమున్న వానికీ, లేనివానికీ ఎందుకా తేడా? ..... 324
583. వధూవరులు పెట్టుకునే జీలకర్ర బెల్లం పరమార్థం? ..... 324
584. మహాపాతకమైన బ్రహ్మహత్యతో సరితూగు పాపములు? ..... 325
585. కర్మేంద్రియాలూ, జ్ఞానేంద్రియాలూ ఏవి? ..... 326
586. 'వినాశకాలే విపరీత బుద్ధి' అని పెద్దలెందుకు అన్నారు? ..... 326
587. పుట్టింటివారు లక్ష్మీదేవి పటాన్నిగానీ, లక్ష్మీ విగ్రహాన్ని గానీ ఇస్తే కుబేరులవుతారా? ..... 327
588. మంథర ఎవరు? ..... 328
589. విదురుడు సూక్తి ..... 329
590. అనారోగ్యంతో వున్న వార్ని ధన్వంతరి ఆలయానికెళ్ళి దర్శనం చేసుకోమంటారెందుకు? ..... 329
591. అబ్బాయీ, అమ్మాయీ నాడీ దోషం పరిశీలించి ఎందుకు వివాహం కుదుర్చుకుంటారు? ..... 330
592. కన్యాదాత దానమంత్రం చివర 'నమమ'అని ఎందుకు పలికించరు? ..... 331
593. స్ఫటికరాయికి నల్లతాడు కట్టి సింహద్వారానికెందుకు వేలాడదీస్తారు? ..... 332
594. రాత్రి భోజనం తర్వాత ఏం చెయ్యాలి? ..... 332
595. మౌనీ అమావాస్య రోజు మౌనవ్రతాన్ని పాటించమని పెద్దలు చెప్పిందెందుకు? ..... 333
596. ఎక్కడ స్నానము చేస్తే ఏ కార్యం నెరవేరుతుంది? ..... 334
597. పేరంటంలో చిమ్మిరి ఎందుకు పెడతారు? ..... 335
598. నారాయణ పంచాయత పూజకై ఎవరిని ఏస్థానంలో ఉంచి పూజించాలి? ..... 335
599. శివపంచాయతనంలో ఎవరిని ఏ స్థానంలో ప్రతిష్ఠించాలి?..... 336
600. వినాయక పంచాయతన పూజలో ఏ దేవతలను ఏ దిక్కున ప్రతిష్ఠించాలి? ..... 336
601. సూర్యపంచాయతన పూజలో ఏ దేవతలను ఏ దిశగా ప్రతిష్ఠించుకోవాలి? ..... 337
602. మహాశక్తి అంబిక పంచాయతన పూజలో ఏ దేవతలని ఏ దిక్కున ప్రతిష్టించాలి? ..... 337
603. స్త్రీకి అతి బరువైన కార్యము? ..... 337
604. శ్రీకాళహస్తీశ్వర ఆలయంలో శివలింగం వెనుక దీపాలెందుకు కదులుతుంటాయి? ..... 338
605. శ్రీమహావిష్ణువు దశావతార జయంతులెప్పుడు? ..... 338
606. ప్రాయశ్చిత్తము లేని పాపము? ..... 339
607. ఏ వైపుగా ఉండి మంత్రాలను చదవకూడదు? ..... 340
608. తిరుమల స్వామివారికి రోజులో ఎన్నిసార్లు పూజలు చేస్తారు? ..... 340
609. నవరత్నాల్లోని రత్నాలు ఎన్ని రోజుల్లో తమ ప్రభావాన్ని చూపుతాయి? ..... 340
610. దంతాలను కొరకవద్దని ఎందుకు చెబుతారు? ..... 341
611. వేదవ్యాసులవారి సూక్తి ..... 342
612. ఆడా, మగా ఎలా స్నానం చేయాలి? ..... 342
613. పరస్త్రీలను కామంతో చూస్తే ఏ జన్మ? ..... 343
614. మహాశివుని ఏ శివలింగాన్ని పూజిస్తే ఏ ఫలమిస్తుంది? ..... 343

615. మెటికలు విరిస్తే ఎందుకు వద్దని చెబుతారు? ..... 345
616. అస్సలు చేయకూడనివి... అరిష్టాన్ని తెచ్చేవి? ..... 345
617. శ్రీహర్షుడు సూక్తి ..... 346
618. వేటిని పూర్తిగా నాశనము చేయాలి? ..... 346
619. ఎడమచేతితో దానం ఎందుకు చెయ్యకూడదు? ..... 347
620. తడిబట్టలతో ఏ కార్యం చేస్తే ఏ ఫలము? ..... 347
621. భగవంతుడు మనకేం ఇచ్చాడు? ..... 348
622. రాజుకన్నా బలవంతుడు మొండివాడెలా అయ్యాడు? ..... 348
623. గురువు ధర్మమేంటి? ..... 349
624. ఈ పుణ్య కార్యాలు చేసినా ఫలం ఉండదు! ..... 349
625. మలవిసర్జన తర్వాత మట్టితో చేతులు రుద్దుకొని ఆపై నీటితో కడుక్కోమనేదెందుకు? ..... 350
626. మనిషి జన్మని భగవంతుడిచ్చింది దేనికి? ..... 351
627. దంతధావనానికి ఏ చెట్టు వల్ల ఎంత ఆరోగ్యమొస్తుంది? ..... 351
628. పంచాంగములతో నమస్కారం దైవానికీ, గురువుకీ, పెద్దలకీ ఎలా చెయ్యాలి? ..... 352
629. దీపారాధనకి బొద్దు వత్తులనే ఎందుకువాడాలి? ..... 353
630. కర్రని ఎప్పుడు ప్రయోగించాలి? ఎవరిపై ప్రయోగించాలి?..... 353
631. మహాఋషులూ, మహాత్ములూ రచించిన అపురూప గ్రంథాలని మనమెలా పోగొట్టుకున్నాము? ..... 354
632. ఈ ప్రపంచంలో అన్నింటికంటే కష్టసాధ్యమైనది, తేలికైనది? ..... 355
633. ఏ దర్భలను ఉపయోగించాలి? ..... 355
634. హోమాధుల్లో నెయ్యి వాడటం వల్ల ఎంతటి లోకకళ్యాణము? ..... 356
635. భగవంతునికి షోడశోపచారాలు చెయ్యటం వల్ల మన శరీరానికి ఎంతటి చలువ? ..... 356
636. తినే ఆహారం కడుపులోకి ఎంతెంత చేరాలి? ..... 357
637. దేవాలయాల్లోకి వేరే దేశస్థులని రానివ్వకూడదని మన పూర్వీకులు ఎందుకు ఆచారం పెట్టారు? ..... 358
638. బందిపోట్లను కూడా అర్జునుడు ఎందుకు ఎదిరించలేకపోయాడు? ..... 358
639. పురుషుణ్ని స్త్రీ ఎంతవరకు భరిస్తుంది? ..... 359
640. శుక్లాంబరధరం పరమార్థమేమిటి? ..... 360
641. దేవునికి మ్రోగించే గంటపైన హనుమ, గరుత్మంతులు ఎందుకు ఉంటారు? ..... 360
642. కవచాన్ని పఠించడం వల్ల ఏ ఫలం వస్తుంది? ..... 360
643. ఏ తీర్థం ఏ ఫలాన్నిస్తుంది? ..... 361
644. ఎన్ని రకాల తీర్థాలున్నాయి? ..... 362
645. బావి నుంచి తెచ్చిన నీటితో అభిషేకం చెయ్యవచ్చా? ..... 362
646. శివాలయంలో ఇచ్చిన తీర్థప్రసాదాలనీ, విభూదినీ ఇంటి వద్దకు ఎందుకు తేవద్దని అంటారు? ..... 363
647. ధర్మ, అధర్మాల వైపు మనిషి ఎప్పుడు పయనిస్తాడు? ..... 363
648. ఆడపిల్లకి ఒడిబియ్యం పోస్తారెందుకు? ..... 364
649. దైవదర్శనము దొరకనప్పుడు ఏం చెయ్యాలి? ..... 364
650. నైవేద్యాలు ఎన్ని రకాలు? ..... 365
651. ఏ ఏ సమయాల్లో కాళ్ళు కడుక్కోకూడదు? ..... 366
652. మంగళసూత్రాల్ని తాళిబొట్టు అని కూడా ఎందుకంటారు?..... 366
653. నిద్రపోయే ముందు ఎవర్ని ధ్యానించాలి? ..... 367
654. అష్టాదశ పురాణాలని ఎవరు బోధించారు? ..... 367
655. ఓడిపోవటానికి కారణాలు ఎవరికైనా మూడే? ..... 368
656. రావణ కాష్టంలా ఆ సమస్య కాలుతూనే ఉంటుందనేది? ..... 369
657. శ్రీకృష్ణుని అష్ట పట్టమహిషుల పేర్లు? ..... 369
658. తేనెటీగలు తేనెపట్టుని ఏ దిక్కుపెడితే అనర్థము? ..... 370
659. కాకి తలపై వ్రాలితే అశుభమా? ..... 370
660. షోడశోపచార పూజని రోజూ చేయలేనివారు ఎలా చేసుకోవాలి? ..... 371

661. షష్టిపూర్తిని అసలెందుకు జరుపుకుంటారు? ..... 371
662. మోసం చెయ్యటం ద్వారా ఎంత పాపం అందుతుంది? ..... 372
663. నిండు నూరేళ్ళు నిండినవారు ఏ శాంతి చేయించుకోవాలి?..... 372
664. ఏ ఏ పురాణాల్లో ఎన్ని శ్లోకాలున్నాయి? ..... 372
665. కోరి వచ్చిన స్త్రీని కాదనవచ్చా? ..... 374
666. దశమహావిద్యల్లో ఏ దేవతామూర్తులని ఉపాసించాలి? ..... 374
667. 'శ్రీరాఘవం...' అర్థపరమార్థమేంటి? ..... 375
668. మహాభారతంలోని నూరుగురు కౌరవుల పేర్లు? ..... 376
669. ఎవరిని ఏ రకంగా పూజించకూడదు? ..... 378
670. మీరు ఖచ్చితమైన శాకాహారులా? అయితే ఇప్పటి
ఐసుక్రీములో ఏం ఉపయోగిస్తున్నారు? ..... 379
671. ఏ ఆవు పాలు ఎంత శ్రేష్ఠము? ..... 379
672. కుబేరునిని అంతటి ధనవంతుణ్ని చేసిందెవరు? ..... 380
673. సూర్యుని సహజరంగులు ఏ ఋతువులో ఏముంటాయి? ..... 380
674. బృహత్సంహితలో ఏ నక్షత్రం వారికి ఎలాంటి
లక్షణాలుంటాయని శెలవిచ్చారు? ..... 380
675. వ్రత సమయాల్లో హవిస్సునెందుకు భుజించమంటారు? ..... 383
676. మీ ధనం కోసం కూడా ఈ అబద్ధాలను చెప్పకూడదా? ..... 383
677. ఏనుగు కుంభస్థలం కొట్టాలంటే? ..... 384
678. దగ్గూ, జలుబూ వచ్చినప్పుడు అలా వచ్చిన
నోటిజలాన్ని ఉంచుకుని ఏ పనులు చేయకూడదు? ..... 384
679. పూర్వపు చన్నీటి స్నానము శుభకరం, మరి నేడు? ..... 385
680. నెత్తిన పాలు పోసినట్టే అని అంటారెందుకు? ..... 386
681. నమ్మి నానపోస్తే పుచ్చిపోయాయని ఎందుకంటారు? ..... 386
682. భార్యకి వంటగదిలో సాయం చెయ్యటం కంటికి
ఎంత మంచిది? ..... 387
683. జీవితంలో ఒక్కసారన్నా చెయ్యాల్సిన స్నానము? ..... 387
684. వీరినందరినీ తిరిగి చేర్చుకోకూడదు? ..... 388
685. వీరినస్సలు నమ్మవద్దు? ..... 388
686. వీళ్ళతో అస్సలు గొడవలకి దిగకూడదు? ..... 389
687. గార్భిక దోషము స్త్రీకి ఎలా పోతుంది? ..... 389
688. ఎప్పటికయినా తీర్చుకోక తప్పదా? ..... 390
689. పరిపూర్ణ విద్యావంతుడు అవ్వాలంటే? ..... 391
690. ఆకలీ, అవసరం ఎంత గొప్పవి? ..... 392
691. డప్పెందుకు మ్రోగిస్తారు? ..... 392
692. ఇవి దూరమైనప్పుడే వాటి విలువ తెలుస్తుంది? ..... 393
693. వివాహమయ్యాక వధూవరుల చేత ఇరువురి
పేర్లు చెప్పించేదెందుకు? ..... 393
694. 'భార్య' అంటే భరించేది మాత్రమే కాదు? ..... 394
695. మహాశివుడు తన సతికి అర్థశరీరం ఎప్పుడిచ్చాడు? ..... 394
696. రాత్రిపూట భోజనం చేసేటప్పుడు దీపాలారిపోతే
ఎందుకు భోజనం చెయ్యొద్దన్నారు? ..... 395
697. వీళ్ళను కావాలనుకోవటం కేవలం ఆశేనా? ..... 395
698. గృహస్థ ధర్మములంటే? ..... 396
699. ఆవేశంలో కూడా అనరానిమాటలని
ఎవరిగూర్చి అనకూడదు? ..... 396
700. ముప్పయి రెండు కళలు ఇవే? ..... 397
701. యజ్ఞంలా పని చెయ్యటమంటే? ..... 398
702. స్వీకరించటానికీ, సమర్పించటానికీ తేడా? ..... 399
703. ఓం శాంతి శాంతి శాంతిః ..... 399

☆ ☆ ☆

# తాళపత్ర గ్రంథం

## విఘ్నేశ్వరుని మూల మంత్రము

"ఓం గం స్వాహా" 108 సార్లు ధ్యానిస్తే సకల కార్యాల్లోనూ జయం.

## గకారాక్షర దేవుడు గణేశుని ఎలా పూజించాలి?

వినాయకుణ్ని పూజించటానికి తిథి, నక్షత్రము, ఉపవాస విధులేమీ లేవు. తెల్ల జిల్లేడు వేరు తెచ్చి, దానితో బొటన వ్రేలి కణుపు పరిమాణముతో పద్మాసనమునున్న గణపతిని చేయాలి. ఆ గణపతిని నాలుగు భుజములు, మూడు కన్నులు గల వానిగానూ, ఆభరణాలతోనూ, సర్ప యజ్ఞోపవీతము ధరించినట్టుగా చేయవలెను. శిఖరమున చంద్రరేఖ ధరింప చేయాలి.



ఎడమ చేతిలో దంతము, కుడిచేతిలో జపమాల, మూడవ చేతిలో గొడ్డలి, నాల్గవ చేతిలో లడ్డూ ఉంచాలి. కుంకుమ చందనములతో, వస్త్రభూషణములతో, ఎర్రని పుష్పములతో పూజించి సుగంధ ధూపమూ, ఉండ్రాళ్ళు సమర్పించాలి.

పొట్టి అతిథికి ముందుగా భోజనము పెట్టాలి. అలా పూజించిన వారికి గణేశుని సిద్ధి అపారంగా కలుగుతుంది. (భవిష్య పురాణము నుంచి)

## నదిదాటేటప్పుడు చిల్లరేస్తారెందుకు? అందులో ఏ అర్థం దాగింది ?

మన తాతముత్తాతలు రాత్రి రాగి చెంబులో నీళ్ళు పోసుకుని, ఉదయాన్నే త్రాగేవారు. అందుకే రాగంత దృఢంగా ఉండేవాళ్ళు.

ఆ రోజుల్లో రాగి నాణేలుండేవి. నదుల్నీ, కాలవలనీ దాటేటప్పుడు గంగని ప్రార్థించి ఆ రాగినాణేలను వేసేవారు.

పిల్లల చేత వేయించేవారు. అలా రాగి నాణేలున్న నదీ నీటిని తాగి అంతా ఆరోగ్యంగా, బలంగా ఉండాలని ప్రజాక్షేమం కోసం చేసేవారు. ఇప్పుడున్న మన చిల్లర నాణేలు కాదు. అవి వేసినా ఒక్కటే. వెయ్యక పోయినా ఒక్కటే.

## రామాయణ సారము

- ♠ మనస్సును ఏ విషయము నందూ విషాద స్థితి యందు ఉంచరాదు. విషాదము అన్నింటికంటే ఎక్కువ చెడు కల్గించును. కోపించిన సర్పము కాటు వేయునట్లు విషాదము మూఢుడైన పురుషుని నాశనం చేస్తుంది.
- ♠ తోటివారితో మరీ ఎక్కువ స్నేహం చేయడంకానీ, లేకపోతే అసలు స్నేహమే చేయకపోవడం కానీ, ఈ రెండూ ప్రమాద కారణాలే. కనుక సంయమనంతో మధ్యస్థంగా వుండే మార్గాన్ని అనుసరించడం శ్రేష్ఠం.
- ♠ గర్వాంధకారంలో మంచి చెడ్డలు తెలుసుకోకుండా, పెడత్రోవనపోయే పెద్దవారిని గూడ సరైన త్రోవకు రమ్మని శాశించడం తప్పు కాదు.
- ♠ ఇతరుల డబ్బు కాజేయడం, పరకాంతల పొందుకోరడం, స్నేహితులను అవమానించడం ఈ మూడు దోషాలు ఎవరినైనా నాశనం చేస్తాయి.
- ♠ వివేకం కలవారెవరైనా తమకు ఎవరి మీద అభిమానం వుంటుందో వారిని ప్రశంసించాలి. అంతే కానీ ఇతరులను నిందించడం ధర్మం కాదు.
- ♠ ఒకరి గొప్పతనాన్ని చెప్పడానికి, మరొకరి అవలక్షణాలను, క్రూరత్వాన్ని బయట పెట్టడం సక్రమ మార్గం కాదు.



## ఏకభుక్తా మహాయోగి, ద్వి భుక్తా మహాభోగి, త్రి భుక్తా మహారోగి

ప్రతిదినం ఒకసారి భోజనం చేసేవాడు మహాయోగి.

ప్రతిదినం రెండుసార్లు భోజనం చేసేవాడు మహాభోగి. ప్రతి దినం మూడుసార్లు భోజనం చేసేవాడు మహారోగి.

## శ్రీ పద్మావతీ మూలమంత్రము?

"ఓం హ్రీం నమః" దైవ పూజకి ముందు 108సార్లు ధ్యానిస్తే కళ్యాణ యోగం పడుతుంది.

## సూర్యభగవానుణ్ణి ఏ దేవతలు ఏ సమయంలో పూజిస్తారు?

ఒక నిమిషంలో వేయి యోజనములు ప్రయాణమునందు రెండేసి వందలు గరిష్ఠముగానూ, రెండు యోజనములు కనిష్ఠముగానూ సంచరించే సూర్యభగవానుణ్ణి ఉదయం ఇంద్రుడూ, యముడు మధ్యాహ్న సమయాన, వరుణుడు అస్తమిస్తున్న సమయాన పూజిస్తారు. చంద్రుడు అర్థరాత్రి సమయము వరకూ పూజిస్తాడు.

## మైల ఉన్న వార్ని తాకకూడదనేదెందుకు?

హాయిగా ప్రశాంతంగా నవ్వితే శరీరం నుంచి విడుదలయ్యేవి ఇతరులకు కీడు చేసే మలినాలు కావు. దగ్గరి వారు దూరమైనపుడు అనేక విధాలుగా వ్యథ చెందటం సహజం.

అలా ఏడ్చినప్పుడూ, రోధించినప్పుడూ ముక్కుల నుంచీ, చెవులనుంచీ, కనుల నుంచీ అనేక స్థూలసూక్ష్మమలినాలన్నీ బైటికి వస్తాయి. అలాంటప్పుడు వార్ని తాకినా, దగ్గరున్నా ఆ మలినాలు మనల్ని చేరతాయి. అందుకే వారి వస్తువులనూ, దుస్తులనూ, వార్నీ తాకొద్దని పెద్దలు చెబుతారు.

## 'వెళ్తాను' అని ఎప్పుడనాలి? 'వెళ్ళివస్తాను' అని ఎప్పుడనాలి?

మంచి లేదా చెడు మాటలు మన ధర్మ, పుణ్య శక్తులను బట్టి సత్యమవుతాయి. వాక్కుకి అంతటి శక్తి ఉంది. భవిష్యత్తును మనమే నిర్ణయించినట్టుగా అవుతుంది. అందుకే వెళ్ళివస్తాను అని అనాలి. ఒక్క మహా ప్రస్థానానికి వెళ్ళేటప్పుడు మాత్రమే 'వెళ్తాను' అనాలి.



## దుఃఖ సదా కో విశయాను రాగి

ఎవరు విషయ లాలసులు, భోగవిలాసముల యందు మునిగి ఉందురో వారే సదా దుఃఖితులు.

## శ్రీ కృష్ణ భగవానుని పూజకు పనికి రాని పూవులు?

కావిరేగు పువ్వు, అవిసి పువ్వు, ఉమ్మెత్త పువ్వు, కలిగొట్టు పువ్వు, తుమ్మిపువ్వు, పున్నాగపువ్వు, గానుగపువ్వు, తాళిపత్రి, పాలచెట్టు పువ్వు, వావిల పువ్వు, పొత్తిదుంప పువ్వు, మందార పువ్వు, మెట్టతామర పువ్వు, అశోక పువ్వు, బూరుగు పువ్వు, ఎర్రదేవ కాంచనపువ్వు, కచ్చూరాలు, కసింద పువ్వు, ఊడుగ పువ్వు, దింటెనపువ్వు, నీలంరంగు పూలు, ఒంటిరెక్కపూలు, శ్రీకృష్ణుని పూజకు పనికిరావు. మరియూ జిల్లేడిపూలు, జిల్లేడు ఆకుపైన పెట్టిన ఏ పూవులైనను పనికిరావు. అలాగే వేపపూవులు పనికిరావు.

## అన్ని ఆకులకంటే అరిటాకు భోజనం మహాశ్రేష్ఠమా?

అరిటాకు అమ్మ వంటిది. జఠరాగ్నిని పెంచటం తోపాటు కడుపులోని అనేక క్రిములను పారద్రోలు తుంది. వీర్యవృద్ధితో పాటు శరీరకాంతిని పెంచుతుంది.

ప్లాస్టిక్ ప్లేట్ల వాడకాన్ని వదలండి. అరిటాకులో ఆహారం తీసుకోవటం వల్ల ఎన్నో విధాలుగా మేలు కలుగుతుంది.

## దేవతలందరినీ వారి వారి రూపాల్లో పూజిస్తారు? మరి మహాశివుణ్ని లింగరూపంలో పూజించటానికి కారణము?

భృగు మహర్షి శాపం వల్ల లింగాకారంలో పూజింపబడుతున్నారు స్వామి. పవిత్ర శివలింగంలో ఆధార పీఠం విష్ణుస్వరూపము.

మహాశివలింగాన్ని పూజిస్తే శివవిష్ణువులను పూజించినంత పుణ్యం.

## పంచెకట్టు లేదా చీరకట్టులో ఎంత ఆరోగ్యముంది?

శరీరాన్ని నాగరికత పేరుతో బిగుతుగా కట్టి పెట్టి ఉంచడం ద్వారా రక్త ప్రసరణ జరగదు. తద్వారా అజీర్తి వంటి రోగాలు తెలియకుండా ఉద్భవిస్తాయి. దుస్తులు వదులుగా, గాలి ప్రవేశించే విధంగా ఉండేలా పంచెకట్టు ఉంటుంది. అదే విధంగా చీర. ఆ దుస్తులు ధరించినవారికి చర్మవ్యాధులన్నవి తెలియవు. తమ



అందాలు బైటపడటానికి బిగుతుగా కడితే భవిష్యత్తులో నష్టపోయేది అలా కట్టినవారే.

## పురుషార్థాలంటే ఏమిటి?

ధర్మార్థకామమోక్షాలు. అందులో అర్థ కామములు మన ఐహిక బంధములు. మోక్షం పైలోకాలకి సంబంధించినది.

అర్థ కామాలను ధర్మంగా స్వీకరిస్తే అదే మోక్షమూ, పుణ్యం.

ధర్మాన్ని తప్పి వాటిని కోరుకొని తీర్చుకుంటే పాపానికి కారణమై నరకానికి తీసుకు వెళతాయి. పుణ్యం సాధించటానికి కావలసిన నిచ్చెన ధర్మం. అందుకే ధర్మమే అన్నీ మోక్షాలకు మూలం.

## ఆడపిల్లలని ఏ వయస్సులో ఎలా పిలవాలి?

పది సంవత్సరాలవరకూ కుమారీ, కళ్యాణీ, రోహిణీ, శాంభవీ, దుర్గా అనీ.. యవ్వనకాలంలో యవ్వనా, ప్రౌఢా అనీ.. వృద్ధాప్యమున అంగనా, మగువా, మహిళా, కాంతా, నారీ అని పిలవాలి.

## ద్రౌపది కర్ణుణ్ని ఆరో భర్తగా కోరుకుందా?

లక్క ఇంటిలో ప్రమాదం ఉందని పాండవులకు చెప్పింది శ్రీకృష్ణుడు కాదు విదురుడు. అలాగే ద్రౌపది కర్ణుణ్ని ఆరో భర్తగా కోరుకుందనటంలో అర్థంలేదు. మూడు జన్మల తపస్సు ఫలంగా ద్రౌపది పాండవులను పరిణయం చేసుకుంది.

## మహాశివుడూ, పార్వతీ ఏ వర్ణము కలవారు?

మనం చూసే పటాల్లో పరమేశ్వరుడు నల్లగా పార్వతీదేవి తెల్లగా ఉంటుంది. పార్వతి శక్తి స్వరూపిణి. అన్ని వర్ణాలు ఆమెవే.

పార్వతి తపస్సు చేసి గౌర వర్ణాన్ని పొందిందని దేవీభాగవతము శెలవిస్తోంది. తమో గుణం గల శివుడు నల్లగా ఉన్నట్టు వేద ఉపనిషత్తుల్లో ఉంది.

## కురుపాండవుల వంశవృక్షం ఎక్కణ్ణించి మొదలైంది?

వశిష్ఠ మహర్షి పుత్రుడు శక్తిముని. ఆయన భార్య అదృశ్యంతి. వారి పుత్రుడు పరాశరుడు, పరాశరునికీ



సత్యవతికీ జన్మించినవాడు వ్యాసుడు. వ్యాసుని ద్వారా అంబికా, అంబాలికలకు జన్మించినవారు పాండురాజూ, ధృతరాష్ట్రుడూ.

దాసికి జన్మించినవాడు విదురుడు. పాండురాజు, ధృతరాష్ట్ర పుత్రులు కౌరవులూ, పాండవులూ.

## గుడిలో కాళ్ళు కడుక్కోగానే మూడుసార్లు నోటిని పుక్కిలించి బైటికి వదిలేదెందుకు?

శుభ్రంగా కాళ్ళు కడుక్కొని ఆపై మూడుసార్లు పుక్కిలించేది వాక్కుకు కారణమైన నాలుకా, నోరూ, చెవులూ పరిశుభ్రం చేసుకున్నామనీ, ఇకపై పదుగురికీ ఆమోదయోగ్యమైన పలుకులనే పలుకుతామనీ, వింటామనీ భగవంతునికి తెలియ చెప్పటము.

## సర్పాపదలు తొలగుటకు శ్రీకృష్ణ మూల మంత్రము ?

**'హే కృష్ణ! ద్వారకావాసిన్! క్వాసి యాదవ నందన**

**ఆపద్భిః పరభూతాం మాం త్రాయ స్వాశు జనార్దన॥'**

108సార్లు సాయంత్రస్నానం తర్వాత జపిస్తే శత్రువులు మిత్రులవుతారు.

## స్త్రీ అంటే?

ఆ శబ్దంలోనే సకార - తకార - రకారము లున్నాయి.

**సకారము:** సకారమన్న సత్యగుణము. దాని వర్ణము తెలుపు. ఆ గుణమునందు వినయమూ, త్యాగమూ, శాంతీ, శుభ్రతా, మృదుత్వమూ, సహనమూ, అణకువా, సంప్రదాయ సంస్కారమూ, ప్రేమా, హృదయ పరిపూర్ణత, ధ్యాన, వైరాగ్యములున్నాయి.

**తకారము:** దాని వర్ణము నలుపు. బద్ధకమూ, నిర్లక్ష్యమూ, అసహనమూ, మతిమరుపూ, సిగ్గూ, భయములున్నాయి.

**రకారము:** దాని వర్ణము ఎరుపు. కామమూ, క్రోధమూ, విచ్చలవిడితనమూ, ధైర్యసాహసాలూ, అహమూ, గర్వమదాలున్నాయి.

అన్ని గుణాలను కలిగిన స్త్రీని మన ప్రవర్తన ద్వార సకార గుణములో, తకార గుణములో, రకార గుణంలో ఈ మూడింటిలో ఎందులో ఉంచాలన్నది, ఉంచామన్నది మగవారి చర్యలే, ప్రవర్తనలే...

## మైలలో దేవుణ్ని ధ్యానించవచ్చా?

భగవంతుని నామస్మరణ మనసును నిర్మలం చేస్తుంది. ఆ సమయంలో మైల ఉన్నా భగవంతుని



నామస్మరణ చేయటం ద్వారా స్వామికి మైల సోకదు. నిరభ్యంతరంగా దైవస్మరణ చేసుకోవచ్చు. అయితే పూజామందిరాన్నిగానీ, సంబంధిత పాత్రలను గానీ తాకరాదు. నామస్మరణకు ఎటువంటి దోషంలేదని ధర్మశాస్త్రం శెలవిస్తోంది.

## భగవంతుడిచ్చిన ఆయువు పూర్తవ్వకుండానే ఎందుకు స్వర్గస్తులవుతున్నారు?

- ♠ నేను అనే అహంకారం వల్ల.
- ♠ బలమున్నది కదా, తెలివున్నది కదా అని తమకంటే తక్కువ వారితో వివాదములు.
- ♠ తమకి సేవ చేయించుకోవటమేగాని, ఎదుటవారికి చేసే అలవాటు లేని గుణము గల పిసినారితనం వల్ల.
- ♠ అతి కోపం.. పక్కవారి కంటే తాము తక్కువ అన్న కసితో రకరకాలుగా నోటి ద్వారా ఏదో ఒక అక్కసు వెళ్ళగక్కడం వల్ల.
- ♠ తనని ఎదుటి వారు ఎంతగా నమ్ముతారో, అంత కన్నా నమ్మకంతో వారందరినీ మోసం చేయటం ద్వారా.
- ♠ ప్రతిక్షణము 'నేనూ.. నా సుఖం ... అంతే.' అనే లక్షణాలు గల కౌరవులు మధ్యలోనే నాశన

మయ్యారు. వారి గాథ అయిన మహాభారత గాథ మనమెలా ఉండాలో, ఎలా ఉండకూడదో చెపుతుంది.

## గృహంలోకి దుష్టశక్తులు ప్రవేశించకుండా ఉండాలంటే?

- ♠ ఇల్లు శుచిగా, శుభ్రంగా ఉండాలి.
- ♠ తులసిచెట్టూ, నిమ్మచెట్టూ, వేపచెట్టూ వంటి వాటికి దూరంగా దుష్టశక్తులు పోతాయని తంత్రశాస్త్రం చెబుతోంది. కాన కనీసం అందులో ఏదో ఒక చెట్టు గృహంలో ఉండేలా చూసుకోండి.
- ♠ నిత్య దీపారాధన చేయటం వలన.
- ♠ ఇంట్లో స్త్రీలు ఆ రోజులలో దూరంగా ఉండటం వల్ల.
- ♠ పురిటి స్త్రీని విడిగా ఉంచటం వల్ల.
- ♠ గృహంలో రామాయణ, భారత, భాగవతాదులను ఉంచుకోవటం ద్వారా.

## పొగడ్తకీ, ప్రశంసకీ తేడా ఏమిటి?

మిత్రుడూ, బంధువులూ, భార్యా, పిల్లలూ అభిమానంతో చెప్పేవి పొగడ్తలు... శత్రువు మనపై అసూయతో కూడా పొగుడుతూ చేసేది ప్రశంస. అదే అసలు సిసలు ప్రశంస.



## వేద ఉపనిషత్తులు పురాణాల ప్రకారము నవగ్రహాలకి ఏ దానాలు చేయాలి? (అష్టాదశ పురాణాల నుంచి)

సూర్యునికి జిల్లేడూ, చంద్రునకు మోదుగా, అంగారకునకు చంద్రా, బుధునకు ఉత్తరేణూ, గురువునకు రావీ, శుక్రునకు మేడీ, శనికి జమ్మీ, రాహువునకు గణికా, కేతువునకు దర్భ సమిధలూ వాడాలి.

నవగ్రహ దానాల విషయానికొస్తే...

సూర్యునికి చక్కటి ఆవు(లేదా ప్రతిమ), చంద్రునకు శంఖము, అంగారకునకు ఎర్రని ఎద్దును (ప్రతిమ), బుధునకు బంగారము (ఆ వర్ణము కలది), బృహస్పతికి వస్త్రములు, శుక్రునికి తెల్ల గుర్రం (ప్రతిమ), శనీశ్వరునకు నల్లని ఆవు (ప్రతిమ), రాహువు కొరకు పాయసము, కేతువు కొరకు మేకపోతు దానమివ్వాలి.

## సర్వాభీష్టసిద్ధిప్రద మూల మంత్రము

నమః సర్వవినాశాయ సర్వశక్తి యుతాయతే, మమాభీష్టం కురుష్వాశు శరణాగత వత్సల.

108సార్లు శుచిగాఉండి జపించిన కార్యసిద్ధి కలుగును.

## ధనుర్మాసంలో నైవేద్యం ప్రత్యేకత ఏమిటి?

ఈ మాసంలో వేకువనే చేసే పూజలో ప్రసాదంగా పులగం, పాయసం, దద్యోజనం సమర్పిస్తారు. చలికాలంలో కడుపులో జఠరాగ్ని పెరిగి ఆకలి పెరుగుతుంది.

ఈ జఠరాగ్ని సాత్వికాహారం తీసుకోవటం వల్ల చల్లబడుతుంది. పాలు, పెరుగు, పెసరపప్పులలో చలువ చేసే గుణం ఉన్నందువలన ప్రసాదంగా వాటిని వినియోగించటం జరుగుతుంది.

ఆయుర్వేదం, జ్యోతిష్యం ప్రకారం ఈ ఆహారం తీసుకోవటం వలన సత్వగుణం అలవడి సత్ఫలితాలు కలుగుతాయి.

## ఇంట్లో పిచ్చికలు గూడు పెడితే ఎంత అరిష్టము?

ఐదు యజ్ఞాల్లో భూత యజ్ఞం కూడా ఒకటి. అంటే పశు పక్ష్యాదులకు ఆహారాన్ని వెయ్యటము. వాటికి ఆహారాన్ని వెయ్యటం యజ్ఞం చేసినంత ఫలం.



వాటికి నివాసము కల్పించటము పుణ్యం. వాటిని కదల్చరాదు. భంగపరచరాదు.

## తల్లి కడుపులో లింగనిర్ధారణ ఎలా జరుగుతుంది?

భార్యా భర్తల శుక్లశోణితము వల్ల గర్భం వస్తుంది. పురుషుని భాగమైన శుక్లము అధికమయినచో పుత్రుడూ, స్త్రీ శోణితము ఎక్కువైనచో స్త్రీ శిశువూ జన్మిస్తారు.

## ఈ ప్రపంచంలో తీర్చలేని బాధేమిటి?

తనకి లేదన్న చింత కంటే ఎదుటి వారికుందని ఈర్ష్యతో పడే బాధనూ, వ్యధనూ ఆ దేవదేవుడు కూడా తీర్చలేడు.

## పెద్దలు పిల్లలకి చెప్పాల్సినవి? చేయాల్సినవి?

♠ నదుల్లోనూ, కాల్వల్లోనూ తోడు లేకుండా, లోతు తెలియకుండా దిగకూడదు.

♠ కొత్తవారితో సరదా సంభాషణలు చేయకూడదు.

♠ తోడబుట్టినవారితోనైనా, ఓ వయసు వచ్చాక ఎంత దూరంలో ఉండాలో అంత దూరంలోనే ఉండాలి.

♠ ఆడపిల్లలని పదే పదే అద్దంలో తన అందాన్ని చూసుకోనీయకూడదు.

- పొద్దుపోయే దాకా నిదురపోనీకూడదు.
- ఎంతో అవసరమైతే తప్ప పక్కవార్ని ధనం అడగకూడదు.
- శుభకార్యాల్లో మరో కారాల్లోనూ ఉప్పును అడిగితేనే వడ్డించాలి.
- నోటితో మంటను ఊదకూడదు.
- తాను ధరించిన హారాన్ని తానే తీయకూడదు.
- తాత్కాలిక సుఖాలు తాత్కాలికమేనని తెలియ చెప్పాలి.
- స్నానం అయ్యాక నూనె రాసుకోకూడదు.
- వడ్డీ వ్యాపారమూ, వాస్తూ, జ్యోతిష్య వ్యాపారముల వల్ల ధనమును సంపాదించకూడదు.

## జ్యోతిష్యాన్ని ఎంత వరకు నమ్మవచ్చు?

మన పురాణ ఇతిహాసల ప్రకారం మానవుడి జన జీవన మరణ రహస్యాలు పార్వతీదేవికి మహాశివుడు చెప్పాడు. ఆ సమయంలో ఎవ్వరూ ఆ రహస్యాలను వినకూడదని తన ఢమరుకాన్ని మ్రోగించి సకల ప్రాణులను దూరంగా తరిమాడు. అయితే రెండు పావురాల గ్రుడ్లు మాత్రము శివపార్వతులున్న ప్రదేశంలోనే ఉన్నాయి. ఆ ప్రాంతమే నేటి అమర్‌నాథ్. పావురాల గ్రుడ్లలోని పిల్లలు మహాశివుని సృష్టిరహస్యాలను వినటంతో ఈ కలియుగాన తాను



చెప్పిన ఏ శాస్త్రమైనా సగమే నిజమవుతుందని శపించాడు. ఇక జ్యోతిష్యాన్ని నమ్మటం, నమ్మకపోవటం ఎవరి ఇష్టాన్ని బట్టి వారికి ఉంటుంది.

## భగవంతునికి వెలిగించే దీపాన్ని నేలపై ఎందుకుంచకూడదు?

ఆకు లేదా పత్రం క్రింద దీపం ఉంచి దీపాన్ని భగవంతునికి సమర్పించాలి. భూమికి ఆకర్షణ శక్తి ఎక్కువ. దైవధ్యాన మంత్రాలతో మనం పూజ చేసినప్పుడు మన భక్తి దీపం ద్వారా భగవంతునికి చేరుతుంది. స్వామి అనుగ్రహం దీపాన్ని చేరి, మళ్ళీ మనకి చేరేలోపు భూమి ఆకర్షణతో భూమాతలోకి చేరుతుంది. అందుకే జపించేటప్పుడూ, ధ్యానం చేసేటప్పుడూ కూడా క్రింద ఏదో ఒక గుడ్డ లేదా చాప వంటి ఆసనాన్ని వేసుకొని పూజ చేసుకోవాలని చెబుతారు.

## మహావైభోగాలను పొందే స్త్రీ హస్త లక్షణము?

సకల ఐశ్వర్యాలనూ పొంది అందించే స్త్రీ హస్తంలో శ్రీవత్సమూ, తామర, కన్నూ, ఏనుగూ, అశ్వమూ, హంసా, చక్రమూ, వజ్రమూ, కత్తీ,

పూర్ణకుంభము, అంకుశమూ, కిరీటమూ, హారమూ, శంఖమూ, పూలదండ ఇత్యాది గుర్తులుంటాయి. ఈ లక్షణ గుర్తులు హస్తసాముద్రిక శాస్త్రం తెలిసిన వారే చూసి చెప్పగలరు.

## దైవపూజ చేసేటప్పుడు తలపాగా తీసి కొలిచేదెందుకు?

పంచభూతాల్లోనివి భూమీ, ఆకాశము. ఆ భూమిపై పాదరక్షలు లేకుండా నిలిచి, తలపై ఏ అచ్ఛాదన లేకుండా ప్రార్థించేది, భగవంతుని కరుణా కటాక్షాలు సంపూర్ణంగా అందాలని. స్వామి అనుగ్రహ వలయం తలపాగాకో లేదా పాదరక్షలకో తగిలి విచ్ఛిన్నం కాకూడదని తలపాగా తీసి పూజించమని శాస్త్రాలు తెలవిస్తున్నాయి.

## రఘుకుల తిలకుడు, ధర్మమూర్తి అయిన శ్రీరామచంద్రుడు వాలిని చెట్టు చాటు నుంచి కొట్టడం ఎంత వరకు ధర్మం?

శ్రీరామచంద్రుడు క్షత్రియుడు. క్రూర మృగాల్ని చెట్టుచాటు నుంచి కొట్టడం రాజ ధర్మము. ఉమ్మడి



భార్యను ఒక్కడే పొందటమూ, సుగ్రీవుడ్ని అధికార బలమదముతో వెళ్ళగొట్టటమూ మృగ చర్యలు. అందుకే శ్రీరాముడు చెట్టు చాటు నుంచి వాలి అనే మృగాన్ని శిక్షించాడు.

## నోము నోచుకునేవారు తమకన్నా చిన్నవారికీ నమస్కరించవచ్చా?

వ్రతాలూ, నోములూ నోచుకునేవారు చిన్నాపెద్దా, కులమూ గోత్రమూ అన్న తేడా లేకుండా ఎదుటి వార్ని దేవీ రూపంగా భావించి నమస్కారం చేయాలి. ఆ సమయంలో చిన్నవారికి చేసే కాళ్ళ నమస్కారం వలన ఆయుక్షీణ దోషముండదు.

## నల్లపూసలు ధరించటంలో పరమార్థము?

పెళ్ళయిందన్న గుర్తుతో పాటు అంగరంగ వైభోగంగా జరిగిన తమ వివాహం గూర్చీ, తమ సంసారిక సుఖ జీవనాన్ని గూర్చీ నలుగురు మాట్లాడుకునేటప్పుడు వారి నోటి వెంట వచ్చిన దోషాలను అరికడుతుందని ఓ నమ్మకం. ప్రతి మాటా, చేష్టా తనదని స్త్రీ ఒప్పుకున్నందుకు నిదర్శనంగా కూడా చెబుతారు. ఏమైనా బంగారంతో చుట్టిన నల్లపూసలు

ధరించటం వల్ల ఓ ప్రత్యేక అందం స్త్రీకి వస్తుందనటంలో సందేహం లేదు.

## ఏ దేవునికి ఏమిష్టం?

శివునికి అభిషేకమూ, విష్ణువుకి అర్చనా, అమ్మవారికి అలంకరణా ప్రీతి. అటుల చేసిన వారికి ఫలం త్వరితంగా, ఎక్కువగా వస్తుంది.

## మంగళవారం భూమిని ఎందుకు త్రవ్వకూడదు?

భూపుత్రుడు కుజుడు. మంగళవారానికి అధిపతి కూడా కుజుడే. తల్లిని తొలుస్తుంటే ఏ బిడ్డయినా ఎందుకూరుకుంటాడు. ఇంకా కుజ కారకం అగ్ని తత్వం కూడా. భూమిని త్రవ్వేది నీటి కొరకే కదా. మంగళవారం భూమిని త్రవ్వటం వల్ల అగ్నితత్వం కలిగి భూమిలో నీరు పడకపోవడం జరుగుతుంది. అందుకే నీటికి సంబంధించిన ఏ పనినీ మంగళవారం ప్రారంభించరు.

## ప్రకృతి వంటి అందమైన స్త్రీ నెలలో ఆ రోజుల్లో ఎంత వ్యధ చెందుతుంది?

- ఆ సమయంలో స్త్రీ మనసు మరింత సున్నితంగా తయారవుతుంది.



- కొంతమందికి అకారణంగా విపరీతమైన దుఃఖము కలుగుతుంది.
- మరి కొంతమందికి భరించలేని కడుపునొప్పి.
- ఇంకొందరికి చల్లని నీళ్ళు తగిలితే స్రావం ఎక్కువవుతుంది. కొంతమందికి వేడినీళ్ళు తగిలినా స్రావం ఎక్కువై నీరసం వస్తుంది.
- కొందరికి గ్రంధులు నొప్పి చేస్తాయి.
- ఒళ్ళంతా పచ్చిపుండులా ఉంటుంది.
- ఆ సమయాల్లో శ్రమపడకూడదు. బరువులు ఎత్తకూడదు.
- విశ్రాంతి అవసరం లేదంటే దాని పర్యవసానంగా ముందు ముందు అనేక గర్భ, శరీర వ్యాధులు వస్తాయి.
- అన్ని బాధలను ఓర్చుకుంటుందనేమో స్త్రీకి భూదేవికున్నంత సహనం ఉందని అంటారు.

## వివాహం సకాలంలో జరుగుటకు మంత్రము?

మూలమంత్రము: ఓం మూలీ మూలీ మహామూలీ సర్వం సంక్షోభయ సంక్షోభయ ఉపద్రవేభ్యః స్వాహా.

శుక్రవారము లేదా శనివారం తలస్నానం చేసి ఇష్టదైవం ముందు 108సార్లు ధ్యానించాలి.

## ఒకప్పుడు మంత్రసాను లెక్కడుండేవారు?

మద్యపానమత్తులైన వారి గూర్చీ, కామబలంతో విర్రవీగేవారి గూర్చీ సంసార స్త్రీలను రక్షించటం కోసం వేశ్యలను ఉపేక్షించటం రాజుల కాలం నుంచీ ప్రారంభమయింది.

కుటుంబ స్త్రీల రక్షణకు ఎంతో కారణమయ్యే వేశ్యల ఇళ్ళలో, ఆ వృత్తిచేసిన వారు అందంపోయి ముసలివారై పోయి అనేక కామ రోగాలకు సాటి వేశ్యలకూ, విటులకూ మందులిచ్చి పొట్టనింపు కునేవారు. అందుకే వారిని 'సాని' మంత్రసానులు అనేవారు.

## ఎలాంటి బ్రాహ్మణుడికి నమస్కరించాలి?

బ్రాహ్మణ స్త్రీ నుంచి జన్మించిన వారంతా బ్రాహ్మణులు కారు. యజ్ఞోపవీతం ధరించిన వాడు బ్రాహ్మణుడు కాదు.

వేదాధ్యయనము నిత్యమూ చేయువాడూ, బ్రహ్మజ్ఞానము కలవాడూ, మాంసాదులనూ, మద్య, పొగాకులని ఆస్వాదించని వాడూ, సత్యశౌచములు



పాటించిన వాడు బ్రాహ్మణుడు. బ్రహ్మ నుంచి జన్మించిన వాడు బ్రాహ్మణుడు.

ఆ బ్రాహ్మణునికి మరో పేరు ప్రజాపతి. అట్టి వారితో పూజాధికాలు జరిపించుకోండి.

## వ్రతము చేసిన రోజు కలవకూడదా?

పగలంతా వ్రత నియమాలతో, పూజలతో శరీరం ఆపాదమస్తకం భక్తితో ఆ దైవ అనుభూతితో నిండి ఉంటుంది. అందుకే ఆ రోజు స్త్రీ, పురుషులు కలవరాదు.

## ఆచమనం ఎలా చెయ్యాలి?

తొలుత కాళ్ళూ చేతులూ శుభ్రపరుచుకోవాలి. చక్కటి ప్రదేశంలో తూర్పున లేదా ఉత్తరాభిముఖుడై కూర్చోవాలి.

కాళ్ళను సమంగా చేసి కూర్చొని యజ్ఞోపవీ తయుక్తులై శిఖను ముడి వేసి ఆపై ధ్యానంలో మౌనంగా ఆచమనం చేయాలి.

బుడగలున్న నీరూ, రంగు మారిన నీరూ, వేడి నీరూ, ఏమైనా కలిపిన నీరూ ఆచమనానికి పనికిరాదు. (భవిష్యపురాణం నుంచి)

## వివాహం కాని ఆడపిల్లలు ఏ పారాయణం చేయాలి ?

పెళ్ళికాని పిల్లలు, కోరికలు కలిగిన వారు తిరుప్పావై పారాయణం చేయటం వలన అవి ఫలిస్తాయని భావిస్తారు.

విష్ణుచిత్తుడి కుమార్తె అయిన గోదాదేవి మానవమాత్రులని కాక రంగనాథుడినే వివాహం చేసు కుంటానని దీక్షబూనుతుంది.

తత్కారణంగా ఆమె ధనుర్మాసంలో వేకువనే లేచి నిత్యం విష్ణుపూజ చేస్తూ తనకి కలిగిన అనుభవాన్నీ, భావాన్నీ ఒక పద్యం అనగా పాశురం రూపంలో రచించేది.

అలా 30 పాశురాలను ఆ మాసమంతా రచించి వాటిని విష్ణువుకు అంకితం చేసింది.

వెంటనే విష్ణువు ప్రత్యక్షమై ఆమెను శ్రీరంగం రమ్మని చెప్పగా ఆమె కోరికపై ఆమె తండ్రి గోదాదేవిని తీసుకుని శ్రీరంగం చేరి రంగనాథస్వామితో వివాహం జరిపిస్తాడు.

వివాహం జరిగినంతనే గోదాదేవి రంగనాథుని పాదాలచెంత వోకరిల్లి స్వామిలో కైంకర్యం అయిపోతుంది.



## ఎలాంటి ధనం ముందు తరాలకి అందదు?

- న్యాయ,ధర్మ పరంగా సంపాదించనిది.
- అబద్ధాల ద్వారా, దౌర్జన్యం ద్వారా సంపాదించింది.
- వడ్డీల మీద సంపాదించింది.
- స్త్రీలను అడ్డం పెట్టుకొని సంపాదించింది.
- ప్రాపకం ద్వారా, ఒత్తిడి ద్వారా అర్హత లేకుండా సంపాదించింది.
- ప్రక్కవారి తెలివితేటలను తమ మేధస్సుగా చూపించి సంపాదించింది.

## యక్షసత్వ స్త్రీ లక్షణములు?

కొద్దిపాటి సిగ్గు కలది. భర్తతో సంభోగ కార్యాల యందు ఎక్కువ సమయాన్ని కేటాయించునది. వేడుకలూ, వినోదాలకీ ప్రాధాన్య మిచ్చునది యక్షసత్వ.

## నెయ్యి వాడకం ముసలితనాన్ని దూరం చేస్తుందా?

నేయి ధారణశక్తి కలది. బలాన్నీ, ఆయువునూ పెంచి కనులకు చలువ చేస్తుంది. చక్కటి కంఠస్వరాన్ని ఇస్తుంది. ఆవునేతితో తలంటు ఆరోగ్యం. మన పెద్దలు

భోజనానికి ముందు నెయ్యి అన్నము మీద వేసుకొని అయిదు మెతుకులు దంతాలకి తగలకుండా తినేవారు. తద్వారా ఖాళీ కడుపులోని వాయువు ఆవిరయిపోతుంది. రెండు చిన్న గుక్కలు నీళ్ళు త్రాగి ఆపై భోజనానికి ఉపక్రమించేవారు.

ఎముకలనూ, ఎముకల్లోని మూలగలోనూ చమురునూ వృద్ధి చేస్తుంది. ఆయుర్దాయాన్ని పెంచే నెయ్యిని ఒక్కసారి మాత్రమే వేడి చేసి వాడటం ఎక్కువ ఆరోగ్యము.

## గుడిలో కెళ్ళే ముందు తలపై నీళ్ళు చల్లుకుంటారెందుకు?

మనిషి సర్వ ఆలోచనలకీ, చేష్టలకీ శిరస్సే కారణం. అలాంటి శిరస్సున నీరు చల్లుకొని పవిత్రులమయ్యామని అంతకు మించిన పవిత్రుడైన నిన్ను పూజించటానికి వస్తున్నామని భగవంతునికి చెప్పటమే పరమార్థం.

## తెలుగు సంవత్సరాలు అరవై ఎందుకున్నాయి?

మానవుని జీవితము అరవై అని, అరవై తర్వాత మళ్ళీ జన్మించినట్లేనని. అందుకే షష్ఠి పూర్తి



చేసుకుంటారు. మన కోపమూ, ఆవేశమూ, పగా, ద్వేషమూ, రోషాలూ అన్నీ అరవై లోపే. అనుభవించింది నెమరువేసుకోవటమే అరవై తర్వాత పని. మనిషిలోని విద్యుత్తు, బుద్ధిశక్తి అరవై అవగానే అడుగున పడిపోతుంది.

## గంధర్వ సత్వ స్త్రీ లక్షణములు?

ఏమన్నా తుడిచేసుకునే తత్వము కలది. శరీరంపై విపరీతమైన మమకారంతో నిత్య అలంకరణలపై వ్యామోహం కలది.

నృత్య గానాల్లో మహా ప్రావీణ్యము గలది గంధర్వ సత్వ.

## అందంగా ఉండాలంటే కంచుపాత్రలో భోజనం చెయ్యాలా?

కంచులో శరీరంలో రంగు తెచ్చే గుణం ఉంది. దానితో పాటు జఠరాగ్నినీ, జీర్ణశక్తినీ పెంచుతుంది. చర్మానికి కాంతినిస్తుంది.

పైత్యాన్ని హరింప చేస్తుంది. కంటికి కూడా ఎంతో మంచిదని వైద్యశాస్త్రాలు శెలవిస్తున్నాయి. ఈ గుణాలన్నీ శరీరం ఆపాదించుకున్న అందం దానంతటదే శరీరపరమవుతుంది.

## శ్రీకృష్ణ పంచదశాక్షర మహా మంత్రము?

మూలమంత్రము : "క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీ జనవల్లభాయ స్వాహా" అని సాయంసమయాన ధ్యానం చేస్తే ఇంటిల్లిపాది అనారోగ్యం దూరమవుతుంది.

## ఎలాంటి లక్షణాలు గల స్త్రీ తనకు తాను సుఖపడుతుంది?

♠ పొడవుగా ఉన్న క్రింద పెదవి స్త్రీలకు భోగాన్నిస్తుంది.

♠ పై పదవి తీక్షణముగానున్న కోపిష్ఠి స్త్రీ అవుతుంది.

♠ శంఖమువలే, మల్లెపూవు వలే, చంద్రుని వంటి తెల్లని పలువరుసతో నునుపుగా, పొడవుగా సందులు లేకుండా ఎత్తుగా ఉన్న దంతములుగల స్త్రీ మృష్టాన్న పానములు అధికంగా పొందుతుంది.

♠ మిక్కిలి పొడవూ, మిక్కిలి ఎత్తుగా కాక సమముగా నున్న ముక్కుగల స్త్రీ ధన్యురాలు. భర్త ద్వారా శారీరక సుఖాన్ని అధికంగా పొందుతుంది.

♠ ఒక దానితో నొకటి కలయిక ముఖములో కూర్చుండ బెట్టినట్టున్న సూక్ష్మమైన కనుబొమ్మలు గల స్త్రీ సుఖవంతురాలవుతుంది.



♠ కాటుక పిట్ట, లేడి, వరాహము వంటి కనులున్న స్త్రీ ఎంత లేని ఇంట పుట్టినా మహావైభోగాలను అందుకుంటుంది. భర్త అరచేతిలో పెట్టుకొని చూసుకుంటాడు.

## కుటుంబమంతా గుడికెళ్తే ఎక్కువ ఫలం వస్తుందా?

సకల పూజా విధానాల్లో సకల ఐశ్వర్యాలు, క్షేమాలు కుటుంబమంతటికి అని ఆశీర్వచనము ఉంటుంది. దేవాలయ పూజారుల ఆశీర్వాదాల్లో కూడా కుటుంబ పరంగానే ఆశీర్వాదం ఇస్తారు.

అనగా దైవ దర్శనానికి కుటుంబమంతా కలిసి వెళ్ళాలని అర్థం. అప్పుడే పరిపూర్ణ ఫలితం వస్తుంది. అష్టోత్తరం చేసేటప్పుడు కూడా మీరొక్కరే వెళ్ళినా భార్య పేరూ, పిల్లల పేర్లూ అడిగి అష్టోత్తర పూజ చేసేది అందుకే.

## శరీర బరువూ, క్రొవ్వూ తగ్గాలంటే?

ప్రతిరోజూ గోరు వెచ్చని ఓ గ్లాసు నీళ్ళలో ఓ చెంచా నిఖార్సయిన తేనెని, ఒక చెక్క నిమ్మరసాన్ని పిండి కలుపుకొని త్రాగితే శరీరంలోని అధిక క్రొవ్వు కరిగిపోతుంది. ఎంత పాత తేనె అయితే అంత

మంచిది. చనుపాలు తగ్గిన చనుకట్టు మీద తేనెని రాసి చూడండి. ఫలితం కనిపిస్తుంది.

## ప్రతి పూజకీ గోవుపాలే ఎందుకు వాడతారు?

గోవు సమస్త సృష్టిలోకి పవిత్రమైనది. సకల దేవతలకి నివాస స్థలము. అందుకే పూజాదికాల్లో, వ్రతాల్లో, యజ్ఞాల్లో ఆవుపాలూ, పెరుగూ, నెయ్యి వాడతారు. ఆవుపాలంటే సమస్త దేవతలనూ మన శుభకార్యానికి పిలిచినట్టే. అందుకే వారి ఆహ్వానానికి చిహ్నమే ఆవుపాల వాడకము.

## ఆధ్యాత్మిక జీవితం అంటే?

రాత్రి తొమ్మిది తర్వాత నిద్రకు ఉపక్రమించగానే రెండు లేదా మూడు నిమిషాల్లో నిద్ర రావాలి. తెల్లారే మెలుకువ రావాలి. అసూయా, ద్వేషమూ, వ్యామోహమూ, పాపపు ఆలోచనలూ లేకుండా ధర్మంగా నడవటమే ఆధ్యాత్మికము.

మనిషి మనిషిని అన్ని రకాలుగా దోచుకుంటున్న నేటి రోజుల్లో అది సాధ్యమా? అడవుల్లో, పర్వతాల మీదే సాధ్యం. పూర్వపు రోజుల్లో అదైనా అవకాశం ఉండేది. ఇప్పుడిక్కడ ఉండటం అటుంచి, వెళ్ళటం



కూడా సమస్యే... ఆధ్యాత్మిక జీవితం గడుపుతున్నామని అనుకోవడం వేరు, గడపటం వేరు.

## శివాలయానికి వెళ్ళినప్పుడు ముందుగా నవగ్రహాలని దర్శించుకోవాలా లేక శివుణ్ణా?

పరమేశ్వరుని ఆలయంలో నవగ్రహాలుంటాయి. చాలా మందికి ముందు ఎవర్ని దర్శించుకోవాలో అని ఒకింత సందిగ్ధత ఉంటుంది.

మహేశ్వరుడు ఆదిదేవుడు. పాలకుడు. కర్తవ్యాన్ని బోధించేది శివుడు. ముందుగా శివుణ్ని దర్శించుకోవాలి. లేదా నవగ్రహాల్ని దర్శించినా, శివుడి కరుణకు ఎలాంటి ఇబ్బంది ఉండదు. అలాగే శివుణ్ణి ప్రార్థించినా నవగ్రహాలు తమ స్వామిని తొలుతగా కొలిచినందుకు అనుగ్రహాన్ని ప్రసాదిస్తాయి.

## ద్రౌపది ధర్మ విజేతయా, అధర్మ విజేతయా?

ద్రౌపది గూర్చి ఈ విషయం గూర్చి చర్చ వచ్చి నప్పుడు రకరకాల వ్యాఖ్యానాలనూ వివరణ లనూ చాలా మంది ఇస్తారు.

వ్యాసుని భావార్థం ప్రకారము ముందుగా ఓడిపోయిన ధర్మరాజు బానిస. బానిస రాజు చెప్పినట్టు చెయ్యాలి.

అందుకే యజమాని చెప్పినట్టు బానిసైన ధర్మరాజు ద్రౌపదిని పణంగా పెట్టివోడాడుగాని, తనదీ, తన తమ్ములదీ అయిన ద్రౌపదిని కాదు. భార్యను గాదు. భర్తగా ద్రౌపదిని ఒడ్డి వోడలేదు. బానిస బానిస ధర్మాన్ని చేశాడంతే.

అందుకే ద్రౌపది ధృతరాష్ట్రుణ్ణి వరాలడిగినప్పుడు తనని పణంగా పెట్టి వోడలేదు కాబట్టే తన దాస్యవిముక్తిని అడుగలేదు.

## మనిషి చేసే తప్పొప్పులు శరీరానికే అయినప్పుడు ఆత్మకేదోషమూ అంటదు కదా?

నిజమే. కాని ఆత్మ ఈ శరీరాన్ని వదిలి మరో శరీరం చూసుకోవాలిగా. మనిషి తన శరీరం ద్వారా చేసే పనుల ద్వారా ఆత్మను కుళ్ళేలా చేస్తాడు.

అలా కుళ్ళిన ఆత్మ కుళ్ళిన పదార్థాలు గల శరీరంలోనే మరో జన్మ ద్వారా ప్రవేశిస్తుంది.

అంతేగాని మహోన్నతమైన మానవజన్మగా మాత్రం కాదు.



## దైవదర్శనానికి వెళ్లే ముందు కాళ్ళను చిన్న పొడ కూడాలేకుండా కడగాలని అంటారు. దేనికి?

సకల వైభోగాలతో, ధర్మ నియమాలతో ఉన్న నలమహారాజును అష్టకష్టాల పాలు చెయ్యటానికి దేవతల కోరికపై జ్యేష్ఠాదేవి ఎన్నో రకాలుగా ప్రయత్నించి, ఆవహించ లేకపోయింది. ఓసారి నలమహారాజు పరిపాలనా భాగంగా త్వరితంగా వెళ్ళే తొందరలో కాళ్ళు పూర్తిగా కడుక్కోలేదు.

ఓ చిన్న పొడ ద్వారా దేవతల ఆజ్ఞను పాటించి మహాకష్టాల పాలు చేసింది. దుష్టశక్తులు సదా మానవుడి శరీరంలోకి ప్రవేశించేందుకు అనేక మార్గాల ద్వారా ప్రయత్నిస్తూనే ఉంటాయి.

పూర్తిగా తడిచేలా కాళ్ళు కడుక్కోమని చెప్పటంలో అంత పరమార్థం దాగి ఉంది. (అన్నవరం దేవస్థాన పురోహితుడు)

## తిరుమల స్వామి సన్నిధిలోనున్న గడప ఎవ్వరు?

మహాభక్తుడైన కులశేఖరాళ్వార్. ఆయన భక్తికి మెచ్చి స్వామి వరం కోరుకోమంటే నిత్యం నిన్ను చూసే

అదృష్టాన్ని ఇమ్మంటాడు. ఆ కోరిక కారణంగానే ఆ భక్తుణ్ని 'పడి' గడపగా చేసుకుంటాడు స్వామి.

## శ్రీకృష్ణ అష్టాక్షర మహామంత్ర పరమార్థము?

**మూలమంత్రము:** "శ్రీ కృష్ణః శరణం మమ"

- ♠ శ్రీ: సౌభాగ్యమునిచ్చును. ధనమును, లోక ప్రియత్వములు కలుగచేయును.
- ♠ కృ: పాపములను నశింపచేయును.
- ♠ ష్ణ: ఆధిభౌతిక ఆధిదైవిక దుఃఖములను హరింప చేయును.
- ♠ శ : జనన మరణ దుఃఖములు లేకుండా చేయును.
- ♠ ర: భగవత్ జ్ఞానమును కలుగ చేయును
- ♠ ణ: భగవంతుని యందు దృఢమైన భక్తిని కుదుర్చును.
- ♠ మ: భగవత్ సేవను ఉపదేశము చేసే గురువు నందు ప్రీతిని కలిగించును.
- ♠ మ : సాయుజ్యము నిచ్చును. తిరిగి జన్మలేకుండా మోక్షమును ప్రసాదించును.

## పిశాచసత్వ స్త్రీ లక్షణములు?

మద్యమాంసాలను ప్రీతిగా ఇష్టపడేది. ఆలోచించకుండా భర్త, తల్లీ, తండ్రీ ధనాన్ని ఖర్చు



పెట్టేది. ఏ అవకాశం వచ్చినా కామాన్ని వెనువెంటనే తీర్చుకునేది పిశాచ సత్వ.

## నిత్య సత్యాలు తెలుసుకో (శ్రీ విద్యా ప్రకాశానంద గిరి స్వాములవారు)

- ♠ పది కోట్ల ఆస్తికి అధిపతివైనా, ఒక నిముషం ఆయువును కొనలేనని తెలుసుకో.
- ♠ కోటి కోట్లకు వారుసుడవైనా ఊపిరి పోగానే ఊరి బయట పారేస్తారని తెలుసుకో.
- ♠ లక్షాధికారైనా, భిక్షాధికారైనా శ్మశానంలో ఇద్దరూ సమానమే అని తెలుసుకో.
- ♠ వందమంది డాక్టర్లు నీ వెంటవున్నా – నీ పరలోక ప్రయాణం ఆపలేరని తెలుసుకో.
- ♠ ప్రపంచానికంతా అధిపతివైనా నీ ఆయుష్షుకు అధిపతివి కావని తెలుసుకో.
- ♠ యావత్ ప్రపంచాన్ని జయించగల్గినా – నీ మృత్యువును జయించలేవని తెలుసుకో.
- ♠ కాలం విలువైనది– రేపు అనునది రూపులేదు.
- ♠ కోట్లు – లక్షలు వున్నాయని మురిసిపోవద్దు. ఆ లక్షలు, కోట్లు నీ వెంట రావని, మృత్యువు నుండి నిన్ను తప్పించలేవని తెలుసుకో.

- ♠ కాలం చాలా విలువైనది – రేపు అను దానికి రూపులేదు. దానిని వృధా చేయకు.
- ♠ నీవు తిన్నది మట్టిపాలు. ఇతరులకు ఇచ్చినది నీ పాలేనని తెలుసుకో.
- ♠ నీవు దాచుకున్నది జారిపోతుంది. ఇతరులకు ఇచ్చినది, సహకరించినది నీ ఖాతాలో జమ అవుతుందని తెలుసుకో.

## తల్లీ తండ్రీ ఒకే కులం కాకపోతే పుట్టే బిడ్డ?

క్షేత్రము ఎవ్వరిదైనా వేసే విత్తనాన్ని బట్టే మొక్క వస్తుంది. పుట్టే శిశువు భర్త వంశానికే చెందుతాడని శాస్త్రాలు చెబుతున్నాయి.

## కడుపుతో ఉన్న స్త్రీ చీకటి పడిన తర్వాత బైటికెందుకెళ్ళకూడదు?

గర్భంతో ఉన్న స్త్రీలు సహజంగా ఒకింత ఆందోళననూ, ఉద్వేగాన్నీ కలిగి ఉంటారు. చీకటి పడిన తర్వాత బైటికెళితే వచ్చే శబ్దాలకూ, చెట్టూ పుట్టా మాటు నుంచి వచ్చే ధ్వనులకూ, అకస్మాత్తుగా పడే పిడుగులకూ, ఉరుములకూ భయ భ్రాంతురాలయి దడుచుకుంటుంది. తద్వారా పుట్టే శిశువు పిరికితనంగా



పుట్టే అవకాశము ఉండటంతో బైటికెళ్ళద్దని పెద్దలు చెబుతారు.

## తీర్థాన్ని ఎన్నిసార్లు తీసుకోవాలి?

దేవాలయాల్లో పూజారులు భక్తుల రద్దీ దృష్ట్యా ఓసారి ఇచ్చి వెళ్ళమంటారు. కానీ తీర్థం మూడుసార్లు తీసుకోవాలి. మొదటి సారి శరీర పవిత్రతకూ, రెండోసారి ధర్మ సంబంధమైన జీవనం కోసమూ, మూడోసారి పుణ్యలోకాల కోసము.

## మునులూ, స్వామీజీలూ, అయ్యప్పలూ స్నానం అయ్యాక విభూతి ధరిస్తారు. ఆధ్యాత్మిక భావనతో పాటు మరేదన్నా కారణం ఉందా?

తెల్లవారుజామునే చన్నీళ్ళ స్నానం ఆరోగ్యంతో పాటు విపరీతమైన చలిని శరీరానికి అందిస్తుంది. విభూతి రాసుకోవటం ద్వారా కొంత చలినుంచి మినహాయింపు పొందవచ్చు.

## గాజు, స్టీలు పాత్రల్లో భోజనము?

ఆ లోహాల్లో తీసుకునే ఆహారం ద్వారా ఏ మంచీ జరగదు.

అలాగే చెడూ జరగదు. కారణం వీటికి కరిగే గుణం ఉండకపోవటమే.

## ఇంద్రియ నిగ్రహంతో పాటు ముసలి ఛాయలు రాకూడదంటే?

భోజనం తర్వాత మజ్జిగ, రాత్రి పూట పాలు తీసుకున్న వారికీ, కాళ్ళు కడుక్కుని భోజనాన్ని చేసే వారికీ ముసలితనపు ఛాయలు త్వరగా దరిచేరవని బ్రహ్మ వైవర్త పురాణం శెలవిస్తోంది. అలాగే తడికాళ్ళతో నడుం వాల్చకూడదు.

## శ్రీకృష్ణ భగవానునికి ఇష్టమైన పూలు?

కలువపువ్వు, ఎర్రగన్నేరు పువ్వు, శనగపువ్వు, సంపెంగ పువ్వు, మల్లెపువ్వు, మోదుగ ఆకులు, గరికె, గుంటగలగర పువ్వులు, తులసి దళములు, ఇవి శ్రీకృష్ణునకు చాలా ఇష్టమైనవి. అన్ని పూవులలోకీ నల్ల కలువపువ్వు వెయ్యి రెట్లు ఎక్కువ యిష్టమైనది. ఎర్రతామర కంటే తెల్ల తామరపువ్వు ఇంకా వెయ్యిరెట్లు ఎక్కువ ప్రీతికరమైనది.

తెల్ల తామర పువ్వుకంటే కూడా తులసి ఇంకా వెయ్యిరెట్లు ఎక్కువ ఇష్టమైనది. తులసి పుష్పము కంటె, శివలింగ పుష్పము కంటె సౌర్యపుష్పము శ్రీకృష్ణునకు



మిక్కిలి ప్రీతికరమైనవి. ఏ పూలు దొరకని ఎడల తులసీదళములతోనైన శ్రీకృష్ణుని పూజించాలి.

తులసి దళములు కూడా దొరకని ఎడల తులసి మొక్క ఉన్న చోటులోని మట్టి తీసుకువచ్చి దానితో శ్రీకృష్ణుని పూజ భక్తి పూర్వకముగా చేయవచ్చు.

## పెసలు పొట్టు తీసి తినకూడదా?

పెసర పప్పుకంటే దానిపై పొట్టే ఎక్కువ మేలు చేస్తుంది. దాదాపు నలభై అయిదు క్రోడిగుడ్లతో సమానము పెసరపప్పు. నానబెట్టి మాత్రమే తినాలని దైవప్రసాదంగా దీన్ని ఆలయాల్లోనూ, వ్రత పూజల్లోనూ వాడతారు.

## కపిసత్వ స్త్రీ లక్షణములు?

ధనమన్న అపార కుతూహలము. ధనములేని వారి గూర్చి అప్రియంగా మాట్లాడేది. రోజుకో రుచి గల ఆహారము కోరేది. సన్నని నాజూకు శరీరంతో చిన్న విషయానికీ భయం చెందేది కపిసత్వ.

## పురుషుని వీర్యంలో బంగారపు అంశ ఉన్నదా?

ఆ కారణంగానే స్త్రీ గర్భవతి అవుతుందనీ, ఆయుర్వేద శాస్త్రం సంతానానికి అవసరమయ్యే

మందుల్లో బంగారం కూడా వాడుతుంటారని ఆయుర్వేద వైద్యులు శెలవిస్తున్నారు.

## సంతానం కోసం సేతుస్నానం ఎందుకు చేస్తారు?

పిల్లలు పుట్టనివారు సేతు స్నానము చేయటము అనగా రామేశ్వరము దగ్గర శ్రీరాముడు నిర్మించిన ధనుష్కోటి వద్ద స్నానం చేస్తారు. పెద్దలు చెప్పినవి మూఢనమ్మకాలని కొట్టిపారేసే వాళ్ళంతా విశేషాన్ని తెలుసుకోవాలి. వైద్య శాస్త్రజ్ఞులు అక్కడి నీటిలో బంగారమూ, వెండీ, పాదరసమూ, అల్యూమినియం వంటివి ఎక్కువగా ఉన్నాయని చెప్పారు. అక్కడ స్నానము చెయ్యటం ద్వారా చర్మపు రంధ్రముల నుంచి ప్రవేశించుట వల్ల గర్భం రావటానికి అవకాశం కలుగుతోందని వైద్య శాస్త్రమూ ఒప్పుకుంటోంది. ఏ నమ్మకాన్నీ, ఆచారాన్నీ తెలియక తీసిపారేయటం కంటే తెలుసుకొని ఆపై మంచీ చెడూ తెలుసుకొని వదిలెయ్యటం మంచిది.

## తేలికగా ధనలక్ష్మి వచ్చి పడాలంటే?

అదృష్టముండాలి. ఆ అదృష్టం కష్టపడటం ద్వారానే వస్తుంది. ఏమీ చెయ్యకుండా రాత్రికి రాత్రే ఏదో అవ్వాలనుకుంటే, అవటం భ్రమ. అదృష్టం రెండు రకాలు. ఒకటి పుట్టుకతోనే దండిగా కుప్పలు తెప్పలుగా ధనమున్న ఇంట్లో పుట్టడము. ఇక రెండో రకం అదృష్టం.... కష్టపడటం. గమ్యాన్ని చేరటము. అప్పుడు మీరన్న ధనంతో పాటు సకల భోగాలు మీ వాకిట వద్దే మీ ఆజ్ఞ కోసం వేచి ఉంటాయి. మొదటి అదృష్టం పూర్వ జన్మ పుణ్యపనుల వల్ల సాధ్యమవుతుంది. రెండో అదృష్టం భగవంతుడు మనకిచ్చిన జ్ఞానం. ఆ జ్ఞాన కాంతి ద్వారా మన పయనం మంచి వైపు వెళ్ళి అదృష్టవంతులుగా కీర్తి గడించాలో, చెడు వైపు వెళ్ళి కాలగర్భంలో కలసిపోవాలో ఆలోచించుకోవాల్సింది మన బుద్ధి ద్వారానే. అందుకే బుద్ధిని బట్టి కర్మ, కర్మని బట్టి బుద్ధి అన్నది.



## 400 సంవత్సరాలకు ముందు స్త్రీ జీవన విధానము ఎలా ఉండేది?

- ♠ ఇంటి ఇల్లాలు ఇంటిల్లిపాదికంటే ముందే నిద్రలేచేది.
- ♠ రాత్రి ధరించిన వస్త్రభూషణములను వదలి స్వీయకార్యాలను పూర్తి చేసుకొని, పనిచేయుటకు వీలైన వస్త్రాలను ధరించేది.

- ఆపై ఇల్లు ఊడ్చి, పేడతో కళ్ళాపి చల్లి ముగ్గులు వేసేది. అభ్యంగనస్నానం అనంతరము పూజాదికాలు పూర్తి చేసేది.
- వంట ఇంటిని శుభ్రం చేసి, కావలసిన పరికరాలన్నీ శుక్తి చూర్ణమూ, నారలతో శుభ్రపరుచుకునేది.
- పగటి ఎండలో ఎండిన కట్టెలతో వంట ప్రారంభించేది.
- నూనెలూ, మజ్జిగవంటి వాటితో వంటకములు చేసి భర్త కొరకు ఎదురు చూసేది.
- భర్తకి ఇష్టమైనవీ, ప్రీతికరమైనవీ మాత్రమే వండేది.
- వంట పూర్తయ్యాక ముఖమూ, కాళ్ళూ చేతులూ శుభ్రపరుచుకొని ఆభరణాలు ధరించి గంధము, తాంబూలములతో వినయ విధేయులతో వడ్డించేది.
- ఇంట్లో పెద్దవారి చికిత్సకి అవసరమగు ఔషధములను అందించేది.
- భర్త సోదరులు, సోదరీమణుల అవసరాన్ని గమనించి ఏర్పరిచేది.
- భోజనానంతరము కొంత విశ్రాంతి తీసుకొని, పాడి గేదెల పనులన్నీ చూసేది.
- ధనాన్నీ, సమయాన్నీ వృధా చెయ్యక రాత్రి భోజనాన్ని సిద్ధం చేసి ఆపై భర్త వద్దకు ఏకాంతముగా చేరేది.



## కలలో ఏం వస్తే ఏ ఫలితం జరుగుతుంది? (అష్టాదశ పురాణాల నుంచి)

- అగ్నిని త్రాగినట్టు వస్తే జఠరాగ్ని వృద్ధి అవుతుంది.
- తెల్లని పూలూ, వస్త్రములూ, తెల్లని పక్షులూ లాభదాయకములు.
- తలలూ, భుజములూ, హస్తములూ వస్తే ధనవృద్ధి.
- అలాగే గుర్రమూ, ఎద్దూ, తామరపువ్వూ, ఏనుగూ కనిపిస్తే ఊహించని ఐశ్వర్యము.
- సముద్రము లేదా నదిని దాటి అవతల తీరం దాటినట్టు వస్తే మీ కార్యాల్లో విజయం సాధిస్తారు.
- సుందరమైన స్త్రీ ఒడిలో ఉన్నట్టు కలవస్తే ధనలాభము.
- తామరాకులు కలలో వస్తే అష్టఐశ్వర్యాలు సిద్ధిస్తాయి. అట్టి శుభస్వప్నములు కన్నవారు మేల్కొని, ఆపై నిద్రింపక స్నానాదులతో శుచియై అయిన వారితో పంచుకుంటే మరింత త్వరితంగా ఫలితాన్ని పొందగలరు.

## మనోభీష్టములు సిద్ధించుట కొరకు?

ఓం కామ – కామప్రద – కాంత – కామపాల – హరి – ఆనంద – మాధవ నమో నమః

అని 108సార్లు శుచిగా మహావిష్ణువును జపించవలయును.

## ఆయుర్వేదంలో రొంపకు చెప్పిన అమోఘమైన వైద్యం...?

బాగా మరుగుతున్న నీటిలో ఓ ఇరవై తులసి ఆకులు వేసి, బాగా ఉడికిన తర్వాత పంచదార, పాలు పోసి మనం ఉదయం త్రాగే పానీయాలని వదలి తాగితే రొంపతో పాటు జ్వరము కూడా రాకుండా అరికడుతుందని చరకసంహిత శెలవిస్తోంది.

## స్నేహం ముసుగులో చేసే ద్రోహాలకి ఏ శిక్ష......?

చితి మీద కాలుతున్న శవాన్ని పీక్కుతినే అలాంటి వాళ్ళ గురించి చర్చించడం కూడా పాపమే. మంచి మనుష్యుల గూర్చి, విషయాల గూర్చి మాట్లాడుకుంటే మనసు బావుంటుంది. మీకు అపకారమూ, నష్టమూ చేసిన వారికి దూరంగా ఉండటవే వారికి భగవంతుడిచ్చిన పెద్దశిక్ష.

## శత్రువుపై విజయము కొరకు?

ఓం రామ - పరుశురామ - నృసింహ - విష్ణు - విక్రమ నమో నమః అని 108 సార్లు శ్రీరామ



మందిరంలో కూర్చొని జపించవలయును. అటుల ధ్యానించిన వారికి శత్రువులే మిత్రులుగా వచ్చి శరణు వేడుతారు.

## దక్షిణ దిశలోనున్న చింతచెట్టు చుట్టూ తిరిగితే వ్యాధులు నమయవుతాయా?

సూర్యభగవానుడి కిరణాలు దక్షిణ దిశగానున్న చింతచెట్టు తన దిశగా వచ్చే కిరణాలను ఆపి, తన ఆమ్లగుణాన్ని కిరణాలతో కలిపి తన పరిధిలోని ప్రదేశాన్నంతటికీ నీడనిచ్చి చల్లని గాలితో నింపేస్తుంది. ఆ గాలి శరీరానికి ఎంతో ఆరోగ్యం కనుక మన పెద్దలు అక్కడ గుడిని నిర్మింపచేసి ప్రదక్షిణలూ, పూజలూ చెయ్యమన్నారు.

## రోజుకి ఎన్నిసార్లు పుక్కిలించాలని ఆయుర్వేదం చెబుతోంది?

ఉదయాన్నే దంత ధావనము అయ్యాక పుక్కిలించిన నీరును ఎడమదిశగా వదలాలి. మూత్ర విసర్జన చేస్తే నాలుగు సార్లూ, ఆ తర్వాత కార్యక్రమం తర్వాత ఎనిమిదిసార్లూ, చక్కగా భోజనం అయ్యాక

పన్నెండు పర్యాయములూ, భార్యతో కలిసిన తర్వాత పదహారుసార్లూ పుక్కిలించాలని ఆయుర్వేదం తెలవిస్తోంది.

ఒక్కసారి పుక్కిలించగానే శరీరంలోని ఎన్నో వేల గ్రంథులు ఉత్తేజం పొందుతాయి.

## ఉసిరిక పొడిని ఒంటికే, తలకే రాసుకొని స్నానం చేస్తే?

జుట్టు వూడిపోదు. బట్టతల బాధలు లేకుండా, వెంట్రుకలు నెరవకుండా, ఎక్కువ ఆయుష్షుతో జీవిస్తారని ఆయుర్వేద శాస్త్రం తెలవిస్తోంది.

## పుట్టిన దగ్గర్నించి పోయేదాకా ఏడుపేనా?

- ♠ తల్లి గర్భం నుంచి బైటికి రావటంతోనే ఏడుపు.
- ♠ బిడ్డకు పాలు చాలక పోతే ఏడుపు.
- ♠ పాలు ఎక్కువైతే అజీర్తి ఏడుపు.
- ♠ ఆటలాడటానికి పోనీయకపోతే ఏడుపు.
- ♠ చదువులో ప్రగతి లేకపోతే ఏడుపు.
- ♠ పరీక్షల్లో తుస్ మంటే ఏడుపు.
- ♠ నెగ్గితే పక్కవానికెక్కువచ్చాయని ఏడుపు.
- ♠ ఉద్యోగం రాలేదని ఏడుపు.



- ♠ వస్తే తనకన్నా పక్కవానికి జీతమెక్కువొస్తుందని ఏడుపు.
- ♠ పెళ్ళయితే ఒక ఏడుపు, అవకపోతే మరొక ఏడుపు.
- ♠ అందంగా భార్య ఉంటే ఒక ఏడుపు, వికారంగా ఉంటే మరో ఏడుపు, గయ్యాళయితే ఇంకొక ఏడుపు.
- ♠ బిడ్డలు కలగకపోతే ఏడ్పు, కలిగితే సాకలేక ఏడుపు.
- ♠ అల్లుడు మంచివాడు కాకపోతే ఏడ్పు, కోడలిపై మరొకరకమైన ఏడుపు.
- ♠ వేరు కాపురం పెడితే ఏడుపు, ఉమ్మడిగా ఉంటే కోడలు సరిగా చూడటం లేదని ఏడుపు.
- ♠ వయసొచ్చి రోగాలొస్తే ఏడుపు.
- ♠ తీరా పోతే చివరి ఏడుపు.

ఇదీ మానవజీవిత ఏడుపుల గాథ.

## అరటిబోదెలో దీపం వెలిగించి వదిలితే మంచి భర్త లభిస్తాడా?

పెళ్ళి కాని వారూ, అయిన వారూ, అరటి చెట్టు బోదెలో దీపం వెలిగించి కోనేరు, నదుల్లో దీపాలు వదులుతారు. పెళ్ళయిన వారు భర్త క్షేమం కోసమూ, పెళ్ళికాని వారు మంచి భర్త లభిస్తాడని అరటి బోదెలో వెలిగించిన దీపాన్ని ఉంచి వదలమంటారు పెద్దలు.

తెల్లవారుజామున లేవటము వల్ల, ఎంతో దూరం వెళ్ళి ప్రశాంతంగా దీపాలు వదలటం ద్వారా పెళ్ళయిన వారికి ఆ సమయంలో ప్రశాంతమైన గాలి శరీరంలోకి ప్రవేశించి మరింత మెరుపుని వచ్చి తద్వారా భర్త ప్రేమను అందుకుంటుంది. పెళ్ళికాని పిల్ల నలుగురు అమ్మలక్కల దృష్టిలో పడి త్వరగా వివాహం అయ్యే అవకాశం ఉంటుంది. భక్తితో పాటు మానవ కళ్యాణాలకు అవసరమైన పద్ధతులే పెట్టారు మన పెద్దలు.

## విద్యాభివృద్ధి కొరకు?

ఓం పురుషోత్తమ నమో నమః అని 108సార్లు సరస్వతిదేవి గూర్చి జపించాలి. అలా చేసినవారికి వాక్ శుద్ధితోపాటు జ్ఞాపకశక్తి పెరిగి విద్యాభివృద్ధి జరుగుతుంది.

## తినే అన్నం పళ్ళెం విసిరేస్తే భగవంతుణ్ని విసిరేసినట్టేనా?

కోపంతో, ఆవేశంతో అలా చెయ్యటమూ, తినే కంచంలో చేయి కడుక్కోవటమూ భగవంతునికి చేసే అపరాథమే అవుతుంది. అన్నం పరబ్రహ్మస్వరూపం, అన్నపూర్ణాదేవి ప్రసాదము. మనం తినే ఆహారము



స్థూలభాగం మలంగా, మధ్యభాగము రక్తంగా మారుతుంది.

సూక్ష్మ భాగం మనస్సుకి హాయిని చేకూరుస్తుంది. శరీరానికి ఎంతో ఆరోగ్యాన్ని చేకూర్చే ఆహారాన్ని అవమానించటం దైవాపరాథమే అవుతుంది.

## మనిషి తాను తప్పనిసరిగా తీర్చాల్సిన ఋణాలు?

పరిపూర్ణమైన ఆలోచనలతో ధర్మసంబంధిత, గృహసంబంధిత సుఖాలకై మానవ జన్మ ఇచ్చినందుకు తొలుత దేవ ఋణాన్ని పూజలూ, యాగాల ద్వారా తీర్చాలి.

యజ్ఞ యాగాదులు చేయటం ద్వారా దేవ ఋణం తీరటంతోపాటు పరిసరాల్లోని అనేక క్రిముల వల్ల వ్యాపించే అంటు రోగాలు సహితము దూరమవుతాయి.

ఆ తర్వాత నవమాసాలు మోసి లాలించి, పెంచి పెద్ద చేసిన తల్లి ఋణాన్నీ, విద్యాబుద్ధులు నేర్పించి, వివాహాదికార్యాలను చేసి మీ ఇష్టానుసారంగా బ్రతికే స్వేచ్ఛ ఇచ్చిన తండ్రి ఋణాన్నీ అనగా తల్లీ, తండ్రీ ఋణాన్ని వయసు మళ్ళినప్పుడు వారు ఏ పనీ చేసుకోలేని స్థితికి వచ్చినప్పుడు అన్నీ తానే అయి తీర్చుకోవాలి.

ఆపై ఆచార్య ఋణము అనగా సమస్త జ్ఞానాన్నీ, సభ్యతా సంస్కారములు నేర్పించిన గురువులూ... ఆచార్యదేవులను ధనము ద్వారా, వినయం ద్వారా సేవించాచి తీర్చుకోవాలి.

## రావిచెట్టూ, వేపచెట్టూ కలిసున్న దగ్గర ప్రదక్షిణలు చేస్తే గర్భం ధరిస్తారా?

పిల్లలు సరయిన సమయంలో కలగకపోతే ఇరవై ఎనిమిదిసార్లు ఆ చెట్ల చుట్టూ ప్రదక్షిణం చెయ్యటం చాలా చోట్ల బహుకాలం నుంచి ఉన్నదే. దానికి వైద్య కారణం వెదికితే చిరంజీవి వంటి రావిచెట్టు పురుష అంశ కలది. వేపచెట్టు స్త్రీ అంశ కలది. ఈ రెండూ కలిసిన ప్రదేశం వద్ద ప్రదక్షిణలు చేయటం వల్ల శరీరం వాటి నుంచి ఆమ్లజనితము గ్రహిస్తుంది. గర్భదోషాలను అరికడుతుంది. ఎక్కువ సేపు, ఎక్కువ రోజులు ప్రదక్షిణలు చేయటం ద్వారా వాటిపై నుంచి పడిన సూర్యకిరణముల వల్ల గర్భకోశ శక్తి పెరిగి సంతానవంతులయ్యే అవకాశం అధికంగా ఉంది.

## కర్ణాభరణాలు ధరించేది ఎందుకు?

దిద్దులన్నా, లోలాకులన్నా, కమ్మలన్నా కర్ణాభరణాలే. సాంప్రదాయంగా అయితే కోడలు



అత్తగారికిస్తుంది. తన కొడుకైన ఆమె భర్త గూర్చి నలుగురూ చెప్పే మాటలు వినకూడదనీ, తనని అపార్థం చేసుకోకూడదని ఎంత పెద్దవి వీలయితే అంత పెద్దవి పెడతారు. ఎంత బంగారంతో పెట్టుకుంటే అంత సౌభాగ్యమని నమ్మే స్త్రీలు అలా ధరించటం వల్ల చెవుల ప్రాంతాల్లోని అనేక నరాలకు వ్యాయామము కలగటంతోపాటు గాలీ, ధూళీ వంటివి బంగారపు వాసనకు దరిచేరవు. మీ ఇంటి ఇల్లాలు వంటి మీద ఎంత బంగారముంటే అంత ఆరోగ్యము మీకూ, మీ కుటుంబానికీ కూడా.

## భగవంతునికి పెట్టే నైవేద్యం ఎందులో పెట్టాలి ?

బంగారము, వెండి, రాగి, ఇత్తడి, అలాగే మోదుగ ఆకులోగానీ, అరటి ఆకులోగానీ, తామరాకులో గానీ అదీ కుదరకపోతే మట్టి పాత్రలోనైనాగానీ నైవేద్యం పెట్టాలి. స్టీలూ, గాజు వంటి వాటిల్లో భగవంతునికి నైవేద్యం పెట్టడం తగదు.

## అల్యూమినియం పాత్రల్లో భోజనం ఎంతవరకు మంచిది?

ఆరోగ్యమైన శాస్త్రాలూ, ముఖ్యంగా ఆయుర్వేదం అల్యూమినియం పాత్రల్లో భోజనం చెయొద్దని

చెబుతుంది. అనారోగ్యాన్ని కలుగ చేసే అవకాశం ఎక్కువగా ఉంది.

## యజ్ఞోపవీతమును ఎప్పుడు మార్చాలి?

పురుడు, మైల, చనిపోయినవారి స్పర్శ, అట్లే మూత్ర విసర్జన చేయునప్పుడు యజ్ఞోపవీతమును చెవికి చేర్చుకోపోవుట మరిచిన, కొత్త యజ్ఞోపవీతమును ధరించాలి. క్షౌరము చేయించుకున్నా తీసివేయాలి. జీర్ణమైన జంధ్యము నదిలో లేదా రావి చెట్టు మీదనే వేయాలి.

## సంధ్యా కాలమంటే?

నక్షత్రములూ, సూర్యుడూ ప్రకాశించని కాలం సంధ్యకాలం. అనగా చంద్రుడు అస్తమించిన తర్వాత సూర్యుడు ఉదయించక ముందు ఉండే మధ్యకాలం సంధ్యాకాలం. అలాగే సూర్యుడు అస్తమించాక, చంద్రుడు ఉదయించటానికి ముందు కాలమైన పవిత్రమైన సంధ్యాకాలంలో జపం, తపం, గాయత్రీ మంత్రం మహోన్నతమైన ఫలాన్నీ, శక్తినీ ఇస్తుంది.

## బంధ విముక్తి కొరకు?

ఓం దామెదర నమో నమః అని జపించ వలయును. ఈ మూల మంత్రాన్ని 108సార్లు



జపించటం ద్వారా చుట్టుముట్టిన సమస్యలు మంత్రం వేసినట్టు మాయమౌతాయి.

## నవ్వే బుద్ధుడు బొమ్మను బహుమతిగా తీసుకుంటే మంచి జరుగుతుందా?

వందల సంవత్సరాల నాటి బౌద్ధ భిక్షువు బొమ్మను గృహంలో, వ్యాపార సంస్థల్లో ఉంచుకుంటే ఎంతో ఉన్నతి సాధించగలమన్న నమ్మకాన్ని ఎంతోమంది విశ్వసిస్తారు. లావు పొట్టతో చూడగానే మనలో సన్నని దరహాసం తెప్పించే నవ్వే బుద్ధా తన తపఃశక్తితో చేతిలోని భిక్ష పాత్ర ద్వారా అనేక మంది ఆకలిని తీర్చాడని ప్రపంచవ్యాప్తంగా ఉన్న నమ్మకమైన నిజం.

## సాలగ్రామము ఎలా తయారవుతుంది?

విష్ణుప్రీతి గల పవిత్ర సాలగ్రామము పురుగునుంచి ముత్యం తయారయినట్టే ఓ పురుగు నుంచి తయారవుతుంది. వేయి సంవత్సరాల తర్వాత గట్టిగా శిలగా మారుతుంది. రుద్రాక్ష ఎంత పెద్దదైతే అంత మంచిది. సాలగ్రామము ఎంత చిన్నదైతే అంత మంచిది.

## ఇంటిలో తప్పనిసరిగా వాస్తు ప్రకారం పెట్టుకోవాల్సినవి?

గృహం ఈశాన్యములో దైవ మందిరాన్ని పెట్టుకోవాలి. మీ అవకాశాన్ని బట్టి తూర్పు ఈశాన్యమైనా, ఉత్తర ఈశాన్యమైనా పర్వాలేదు.

అలాగే చీపుళ్ళూ, ఇంటిని ఊడ్చగా వచ్చిన చెత్తనీ నైఋతి మూలలో ఉంచాలి.

## సంగీతము వ్యాధులను దూరం చేస్తుందా?

చక్కని సంగీతము ఎముకల్లో కదలికలను తెస్తుంది. తద్వారా పటుత్వం పెరుగుతుంది. చలికాలంలో వచ్చే దగ్గును భైరవరాగము తగ్గిస్తుంది.

హృదయ సంబంధిత రోగాలను గాంధారము దూరం చేస్తుంది. సంగీతం ద్వారా మెదడులోని ఎన్నో భాగాలు ఉత్తేజం పొంది ఉత్సాహవంతులుగా, ఆరోగ్యవంతులుగా ఉంటారని ఆయుర్వేదం శెలవిస్తోంది.

ఒక యోగి కథ చదివిన వారికి మాల్కోసు రాగం ద్వారా శీతాకాలంలో శౌర్యం పెంపొందించిన భాగము గుర్తుండే ఉంటుంది.



## నేత్ర వ్యాధులు హరించుటకు?

ఓం కేశవ - పుండరీకాక్ష నమో నమః. సాయంత్రపు ఎండలో కనులు మూసుకుని ఏకాంతప్రదేశంలో ధ్యానించుట ద్వారా కనులకి శక్తీ, దృష్టీ పెరిగి ఆనందం స్వంతమవుతుంది.

## అపమృత్యు భయం పోవాలంటే?

గంధము, అక్షితలు, పుష్పములు వంటి పూజాద్రవ్యములతో భరణీ నక్షత్రమునాడు యముణ్ని పూజిస్తే అపమృత్యు భయం తొలగుతుంది.

## వంట ఇంటికే, గృహానికే పరిమితమైతే మీ ఆయుష్షు పదేళ్ళు తగ్గినట్టే?

ముఖ్యంగా భారత దేశంలో మహిళలు పై రెంటికే పరిమితమవుతుంటారు. పూర్వకాలంలో గృహం పెద్ద ఆవరణలో ఉండేది. దానితో వారు ఆ ఆవరణలో ఇంటి పనులకు తిరగటం వల్ల సూర్య కిరణాల నుండి వచ్చే 'డి' విటమిన్ అందేది. చర్మముపైనున్న అనేక క్రిములు నశించిపోయేవి.

రాజపుత్ర స్త్రీలూ, ఇంకొంత మంది స్త్రీలు ఘోష పద్ధతి వల్ల అనారోగ్యం పాలవుతారు. కేవలం నీడపట్టునే ఉండటం వల్ల భయంకరమైన టి.బి కూడా వచ్చే అవకాశము ఉంది. సూర్యరశ్మి శరీరానికి తగలకపోతే ఆయుర్వేద వైద్య రీత్యా రోగాల పాలవ్వక తప్పదు.

## నాగులచవితికి పుట్టలో పాలుపోస్తే సంతానం కలుగుతుందా?

కార్తీక శుద్ధ చవితినాడు వచ్చే నాగపంచమి రోజు సంతానం కోసం నానపెట్టి మొలకెత్తిన ధాన్యములతోనూ, పాలతోనూ నాగపుట్టను పూజించి పాలు పోస్తారు. ఇలా చెయ్యటం భక్తితో పాటు సంతానవంతులయ్యే విశేషం కూడా ఉంది. కొత్త ధాన్యముల ప్రసాదాన్ని స్వీకరించటం వల్లా, పుట్ట వద్ద పూజ చేస్తూ స్పందించటం వల్ల స్త్రీలలో నాడీమండలం ఉత్తేజం చెంది సంతానవంతులయ్యే అవకాశం కలిగిస్తుంది.

## ముక్కుపుడక కుట్టించుకోవటంలోని ఆరోగ్యము?

వివాహ సమయంలో ఏడు అడుగులు వేసి ఒకరికి ఇల్లాలైన ఆమెని పార్వతీ దేవితో సమానంగా భావించి



ముక్కుపుడకను అందివ్వటం మన సంప్రదాయం. పెళ్ళి అయిన వారు ధరించటంలో అర్థం... భర్త ఆయురారోగ్యాలతో, సకల ధనాలతో సంతోషంగా ఉండాలని లక్ష్మీదేవిని ప్రార్థిస్తూ ధరించటము. ముక్కుకి రంధ్రం చేయటం ద్వారా ఆక్యుపంక్చర్ వైద్య విధానం ద్వారా రక్తపోటు నివారణమవుతుంది.

## గృహస్థు తామరాకు, మోదుగ ఆకుల్లో భోజనం చేయరాదు. ఎందువలన?

ఆ రెండు ఆకుల్లో భోజనము మునులూ, ఋషులూ, సన్యాసులూ మాత్రమే తినాలి. ఆ ఆకుల్లో భుజించటం వల్ల సత్వగుణం అలవడుతుంది. ఆ కారణంగానే గృహస్థు జీవితం గడుపుతున్నవారు ఆ ఆకుల్లో తినరాదు. అయితే మోదుగ ఆకుల్లో ఆహారం తీసుకోవటం వల్ల కంటి సంబంధిత అనేక వ్యాధులు తగ్గుతాయి.

## అకాల భయము తొలగిపోవుటకు?

ఓం హృషీకేశ నమో నమః అని జపించ వలయును.రాత్రి స్నానము అయ్యాక, ఇష్ట దైవాన్ని

తలుచుకొని 108సార్లు జపిస్తే భయపీడలు తొలగిపోతాయి.

## ఆడ, మగ తేడా లేకుండా చెవులు కుట్టించటం ఎందుకు?

చెవి మధ్య భాగంలో ఆజ్ఞాచక్రం ఉంటుంది. అది మెదడుకి అనుసంధానం కలిగి ఉంటుంది. ఎప్పుడైతే ఆజ్ఞా చక్రం వద్ద ఒత్తిడి తెస్తామో మెదడులో ఉన్న జ్ఞాననేత్రం వికసించి బుద్ధి వికసిస్తుంది. ఈ కార్యాన్ని బంగారంతో చేయడం వల్ల మంచి ఫలితం ఉంటుంది. అందువలననే బంగారు పోగులు ధరించలేని వారికి సైతం చెవి కుట్టే సమయంలో బంగారు తీగతోనే రంధ్రం ఏర్పరచటం జరుగుతుంది.

పూర్వం చెవులు కుట్టించటం ఉపనయనం సమయంలో చేసేవారు. కానీ ఈ కాలంలో మూడు సంవత్సరాల వయస్సులోనే మగ, ఆడ బేధం లేకుండా చెవులు కుట్టించటం జరుగుతుంది.

విద్యాభ్యాసం చేసేటప్పుడు గురువులకూ, పెద్దలకూ చెవులను తమ్మె వద్ద పట్టుకుని శిష్యులు తమ గోత్రనామాలను చెప్పుకొనేవారు.

ఈ విధానంలో అంతరార్థం ఆజ్ఞాచక్రంపై ఒత్తిడి తేవటం కొరకే.



## స్త్రీ పిచ్చి ఎంతటి వాడ్నయినా అధముడ్ని చేస్తుందా?

పులస్త్య బ్రహ్మ పుత్రుడు రావణుడు సకల ధర్మాలూ తెలిసినవాడు. స్త్రీ వ్యామోహంతో నాశనమయ్యాడు. మహాబలవంతుడు కీచకుడు. ఆ పిచ్చితోనే అంతమయ్యాడు. ఎంతటి వేదపండితుడైనా, మహాభక్తుడైనా, ఆడదాని పిచ్చిలో పడితే అధముడవుతాడు. మద్య, జూదాల కన్నా భయంకరమైనది స్త్రీ వ్యసనము.

## ధనుర్మాసంలో వివాహాలు ఎందుకు చేయరు?

రవి ధనూరాశిలో ప్రవేశించి మకరంలోకి వెళ్ళే సమయమే ధనుర్మాసం. ధనస్సు, మీనంలో రవి ఉన్నప్పుడు రవిరాశి అయిన బృహస్పతిలో ఉన్నప్పుడు ఏ శుభకార్యం జరపకూడదు. కేవలం పండుగ వాతావరణంతో అంతా సంతోషంగా, ప్రశాంతంగా ఉండగలుగుతారు.

ఈ మాసంలో ముఖ్యంగా సూర్య పూజలు చేస్తారు. ఇంకా విష్ణుమూర్తిని నిత్యం వేకువనే పూజిస్తారు.

## ఇంటిల్లిపాది భోజనానికి కూర్చున్నప్పుడు భిక్షగాడు వస్తే?

తప్పనిసరిగా లేచి అయినా భిక్ష వేయాలి. ఆకలితో అలమటించే వారు ఆ సమయంలో భగవత్స్వరూపులు.

అనగా ప్రతివారిలో ఉండే భగవంతుని ఆత్మ ఆకలికై ఆరాటపడుతుంది. ఆత్మని బాధపెట్టకుండా భిక్ష వేయాలి.

## ఏ సమయంలో భిక్ష వెయ్యకూడదు?

అలా వడ్డించకూడని సందర్భం ఒక్కటే. పితృకార్యాలప్పుడు సకల విధులు పూర్తయ్యేవరకూ గృహస్థుడు ఎవ్వరికీ భిక్ష ఇవ్వరాదు.

## నవగ్రహ శాంతులున్నప్పుడు స్త్రీలు ఏ నగలు ఎవరి కోసం ధరించాలి?

- ♠ శనివారము శనీశ్వరుని కొరకు నీలమణితో ఉన్న నగలను పెట్టుకోవాలి.
- ♠ శుక్రవారము శుక్రుని కొరకు వజ్రాభరణాలను అలంకరించుకోవాలి.



- ♠ గురువారం బృహస్పతి కోసం పుష్యరాగాల కమ్మలు ధరించాలి.
- ♠ బుధవారము బుధుని కొరకు పచ్చలపతకాలు పెట్టుకోవాలి.
- ♠ మంగళవారం కుజుని ప్రీతికై పగడాల నగలు ధరించాలి.
- ♠ సోమవారం చంద్రునికై ముత్యాలతో చేసిన నగలను ధరించాలి.
- ♠ ఆదివారము సూర్యునికై కెంపులు పొదిగిన ఆభరణాలను ధరించాలి.

## రుద్రాక్ష ఎంత పవిత్రమైనది?

- ♠ స్మరించినంతనే పదిగోవులు దానమిచ్చిన ఫలము.
- ♠ దర్శనము వంద గోవులు దానమిచ్చిన పుణ్యము.
- ♠ తాకినంతనే వెయ్యి గోదానాల ఫలితము.
- ♠ పూజించినంతనే లక్ష గోవుల దాన పుణ్యఫలం లభిస్తుంది.

## మగబిడ్డ లేదా ఆడబిడ్డ పుట్టాలంటే?

ఋగ్వేదంలో మగశిశువు కోసం చాంద్రమాసంలో పౌర్ణమినాడు భర్తతో సంభోగిస్తే నిండు చంద్రుడు వంటి పుత్రుడు జన్మిస్తాడనీ, అదే అమావాస్య రోజు కలిస్తే ఆడబిడ్డ జన్మిస్తుందనీ చెప్పబడింది. అయితే ఎక్కువ

శాతం బేసి సంఖ్యలో కలిస్తే ఆడబిడ్డా, సరి సంఖ్యలో కలిస్తే మగబిడ్డా జన్మిస్తారని సుశ్రితుడు శెలవిచ్చారు. సుశ్రితుడు చెప్పిందే చాలా మంది ప్రస్తుతం ఆచరిస్తున్నారు.

## భగవంతునికి కొట్టిన కొబ్బరికాయను ఎలా పెట్టాలి?

స్వామికి నివేదించిన కొబ్బరి చిప్పలను మనకి కొబ్బరి కనపడకుండా స్వామికి కనపడేలా స్వామి వైపుకి ఉంచాలి. అదే కొబ్బరి కనపడే విధంగా నుంచో బెడితే అశుభం. కొన్ని ప్రాంతాల్లో కొబ్బరి చిప్పను కొబ్బరి కనపడే విధంగా నుంచో బెట్టి నూనెవేసి చనిపోయిన వారి దగ్గర వెలిగిస్తారు.

## శీఘ్ర రోగ నివారణకు?

ఓం నమో అచ్యుత - అమృత నమో నమః అని 108సార్లు సూర్య భగవానుణ్ణి జపించాలి.

## పాపిట బిళ్ళ పరమార్థం ?

అందంతో పాటు హృదయానికీ, బుద్ధి వికాశానికీ మంచిది. బంగారు పాపిట బిళ్ళను ధరించటంలో పరమార్థం ఎంతో ఉంది. శిరోమధ్యమున పాపిట బిళ్ళను ధరించే ప్రదేశంలో బ్రహ్మ రంధ్రం ఉంటుంది.



బ్రహ్మరంధ్రంపై బంగారం సోకటం వల్ల మెదడుకి ఉత్తేజాన్ని ఇస్తుంది.

## ఆయుష్షుని తగ్గించేవీ, అనారోగ్యాన్ని పెంచేవి?

- ఉదయకాలపు ఎండతో చలికాచుకొనుట
- స్మశాన పొగను పీల్చడం వల్ల
- తన కన్నా పెద్ద స్త్రీతో కలియటం వల్ల
- ఆకులు మరిగిన నీటిని త్రాగటం వల్ల
- రాత్రిపూట పెరుగన్నం భోజనం చేయటం వల్ల

## త్రిమధుర ప్రసాదమంటే?

కొబ్బరీ, అరటిపండూ, బెల్లమూ వీటిని త్రిమధురము లంటారు. ఆయుర్వేదపరంగా శరీరానికి ఈ ప్రసాదం ఎంతో మేలు చేస్తుంది. అల్సర్ వంటి వాటికి అమృతములా పనిచేస్తుంది. అందుకే మన పెద్దలు అలాంటి ఆచారాన్ని ఆధ్యాత్మికంలో కలిపారు.

## కార్యములందు విజయము కలుగుటకు?

ఓం అపరాజిత నమో నమః అని 108సార్లు బ్రహ్మముహూర్త సమయంలో ఇష్ట దైవం ముందు జపించాలి.

## జ్వరమూ, నీరసమూ, దగ్గు ఉన్నప్పుడు దిష్టి తియ్యగానే ఒకింత ఉపశమనం ఎలా కలుగుతుంది?

నిప్పులు పళ్ళెంలో పోసి ముఖానికి దగ్గరగా పెట్టి మూడుసార్లు మిరపకాయలతో, ఉప్పుతో దిష్టి తీసి నిప్పుల మీద వేస్తారు. అలా వేసిన తర్వాత వచ్చే పొగను పీల్చటం వల్ల... అనగా సోడియం క్లోరైడ్ విడిపోయి సోడియం పెరాక్సైడ్‌గా, క్లోరిన్‌గా మారిన వాటిని పీల్చటం వల్ల ముక్కు రంధ్రాల గుండా తీక్షణమైన ఆ వాయువు శరీరంలో ప్రవేశించటంతో శ్వాస మండలం రిలాక్స్ అవుతుంది. దానితో ఏదో తెలియని శాంతి కలుగుతుంది.

పెద్దలు పెట్టిన ఏ ఆచారములోనైనా, సాంప్రదాయములోనైనా ఎంతో జ్ఞానముంది. చాదస్తమని కొట్టి పారేస్తే మనల్ని చాదస్తుల క్రింద లెక్క కట్టవచ్చు.

## ఆత్మ ఎలా ఉంటుంది?

తామర మొగ్గ ఆకారంలో వుండే మన హృదయంలో వరి కంకి గింజంత చిన్నదిగా, సన్నగా దివ్యకాంతితో పసుపు పచ్చ వర్ణంతో అణువంతగా



మహోజ్వలంగా వెలిగిపోతుందని మంత్ర పుష్పంలోని శ్లోకం ఆధారంగా తెలుస్తోంది.

## దేవాలయాలను పర్వతాలూ, గుట్టల మీద ఎందుకు నిర్మించారు?

మనిషికి తన శక్తేమిటో తెలుసు. ప్రకృతి ప్రళయమూ తెలుసు.

దాని నుంచి రక్షణకొరకై భగవంతుని ధ్యానించి, ఆ రూపాన్ని కొండల మీదా, గుట్టలమీదా కట్టి అవసరార్థం బట్టి, మహాతుఫానులప్పుడూ ఆ దైవసన్నిధిలోకెళ్ళి తమను తాము కాపాడుకోవటానికే ఆయా ప్రాంతాల్లో నిర్మించారు.

## అర్థాంగి అని ఎందుకంటారు?

భర్త చేసే నాలుగు పురుషార్థాల్లోనే కాదు, భర్త చేసే సకల క్రియలకి భార్యకి భాగం ఉంది.

అలాగే భార్య చేసే అన్ని పనులకీ భర్తే బాధ్యత వహించాలి.

కీర్తి ప్రతిష్ఠల విషయంలో, కుటుంబ పరువు విషయంలో నీకూ సగపాలుంది.

నీ భర్తకి నీవు అర్థాంగివి. నీ పరువుపోతే నీ భర్త పరువూ పోయినట్లే అని చెప్పటమే ఆ పిలుపులోని ఉద్దేశ్యము.

## భార్య లేకపోతే భర్త పుణ్యకార్యాలకి అర్హుడు కాడా?

ధర్మ, అర్థ, కామ, మోక్షాలలో సదా పక్కనుంచుకొని సాగుతానని పెళ్ళిలో ప్రమాణం చేస్తాడు భర్త. ఆ వ్రతం ప్రకారము రెండో వివాహం చేసుకో కూడదు.

ధర్మమోక్షాలకి సంబంధించిన దైవకార్యాలకు భార్యలేని వారు అర్హులు కారు.

## రావిచెట్టు చుట్టూ తిరిగితే ఆరోగ్యవంతమైన పిల్లలు పుడతారా?

పిల్లలు పుట్టని వారు రావిచెట్టు చుట్టూ ప్రదక్షిణలు చేస్తారు. అలా చెయ్యమని పెద్దలు చెప్పటానికి కారణం భక్తిపరంగా, ఆరోగ్యపరంగా ఎంతో పరమార్థం ఉంది. రావిచెట్టు ఆకుల్లో విద్యుదయస్కాంత శక్తి ఉంటుంది.

రావిచెట్టు చుట్టూ తిరిగే సమయంలో విద్యుదయస్కాంతములు అధిక ఆక్సిజన్‌తో కలిసి శరీరాన్ని ఆవహిస్తాయి. దాని ద్వారా సంతానోత్పత్తికి



అవసరమయ్యే పరిణామాలు స్త్రీ అండంలో కలుగుతాయి. అంతటి ఆరోగ్య రహస్యాన్ని ఋషులు ఎన్నో వేల సంవత్సరాల క్రితమే గ్రహించి ఆధ్యాత్మిక పరంగా మనకి తెలియచెప్పారు.

## కంచు పాత్రల్లో ఎవరు భోజనం చెయ్యకూడదు?

ఆ పాత్రల్లో మఠాధిపతులు, మతప్రచారకులూ, సన్యాసులూ, దీక్ష తీసుకున్న వారూ తినకూడదు. కంచు అధికంగా శరీర పటుత్వాన్ని పెంచుతుంది. తత్కారణంగా ఐహికమైన విషయాలపై ఆసక్తిని పెంచుతుంది.

## శరీరాన్ని అనారోగ్యం ఎలా ఆవహిస్తుంది?

ఆహారం జీర్ణం కాక ముందే మళ్ళీ మళ్ళీ ఆత్రంగా తినటం ద్వారా, పుల్లటి పదార్థాలను మితానికి మించి తినటం ద్వారా, చలిమిడి తినటం ద్వారా, శరీరానికి పని ఇవ్వకుండా ఉండటం ద్వారా, పగటి పూట నిద్రపోవటం ద్వారా, పాలూ, చేపలూ ఏకకాలంలో ఆహారంగా తీసుకోవటం ద్వారా. ఇటువంటి వాటిని తీసుకోవటం ద్వారా విషక్రిములు

ఉదయించి శరీరానికి మనస్థాపాన్ని కలుగచేస్తాయి. తద్వారా మంచానికే పరిమితమవ్వవల్సి వుంటుంది.

## ఏ దిక్కున వెళుతూ ఏమి జపిస్తే కార్యము సిద్ధించును?

- ♠ తూర్పు దిక్కున ఓం చక్రి నమో నమః అని జపించవలయును.
- ♠ దక్షిణ దిక్కున ఓం గదీ నమో నమః అని జపించవలయును.
- ♠ పడమటి దిక్కున ఓం శార్ఙ్గీ నమో నమః అని జపించవలయును.
- ♠ ఉత్తర దిక్కున ఓం ఖడ్గీ నమో నమః అని జపించవలయును.

## ప్రతి ఒక్కరి కనీస ధర్మాలు?

- ♠ భర్త కష్టార్జితాన్ని గృహావసరాలకి పొదుపుగా వాడటం గృహధర్మం.
- ♠ తమ సుఖాలకి గుర్తులుగా పుట్టిన బిడ్డలను విద్యావంతులుగా, గృహస్థులుగా చెయ్యటం తల్లీ, తండ్రీ ధర్మం.
- ♠ తల్లీ, తండ్రిని సేవించటమూ, సోదరీ సోదరుల మంచి చెడ్డలు చూడటం పెద్దకొడుకు ధర్మము.



- ♠ చేసే పనిని గౌరవించి, ఆరాధించి, ప్రేమించటం ధర్మము.
- ♠ తన సంపాదన తనవారికీ, పుత్రులకీ ఖర్చు పెట్టడం ధర్మము. అవి అయ్యాకే ధర్మాలూ, దానాలూ చెయ్యటము ధర్మము.
- ♠ ఆపదలో ఉన్నవారిని కాపాడటము మానవతా ధర్మము.
- ♠ ఇచ్చినమాటకు కట్టుబడటము సత్య ధర్మము.
- ♠ దైవసాక్షిగా పెళ్ళి చేసుకున్న భార్యకు ద్రోహం చేసి మరోస్త్రీ వెంట పడటము ధర్మం తప్పినట్టే.
- ♠ భర్త అసమర్ధుడైనా, అందవిహీనుడైనా వాణ్ని వదలటం, ద్రోహ, కోరికల బుద్ధితో పెడద్రోవన పట్టడం స్త్రీ ధర్మాన్ని కాలరాచినట్టే.

## ఆయుర్వేదం అధర్వణ వేదానికి ఉపవేదమా?

క్షీరసాగరమధనములో ధన్వంతరి జనన మరణా లకి తావులేని దివ్య ఔషధాన్ని దేవతలకిచ్చాడు.

పంచమ వేదమైన ఆయుర్వేదాన్ని బ్రహ్మదేవుని కిచ్చాడు.

బ్రహ్మ నుంచి దక్షప్రజాపతికీ, వాని నుంచి అశ్వినీ పుత్రులకీ వచ్చింది.

ఆ తర్వాత భరద్వాజ ఋషి దేవలోకంలో ఆయుర్వేదాన్ని పఠించి, ఆత్రేయ మహర్షికి ఆ రహస్యాలను బోధించాడు. ఆయన వద్దే అగ్నివేశుడు అభ్యసించి 'అగ్నివేశ'మను ఆయుర్వేద గ్రంథాన్ని రచించాడు. అందునుంచి వచ్చినవే ఆయుర్వేద మహామహతి గ్రంథాలు.

## తులసి ఇంట్లో ఉంటే పాములూ, తేళ్లూ ఎందుకు రావు?

తులసిలో మహోన్నతమైన శక్తి దాగి ఉంది. వాటి వాసనకు విషక్రిములేవీ దరిదాపులలోకి రాలేవు. ఎంతో దూరం అంతర్లీనంగా ప్రవహించే తులసి సువాసన మానవునికి ఆరోగ్యాన్ని కలుగచేసే వాయువులను మాత్రమే గృహంలోకి రానిస్తుంది. విషవాయువులను నిస్తేజం చేస్తుంది. అందుకే తులసి ఉన్న ఇల్లు సర్వశుభప్రదం.

## దేవాలయంలో మర్రిచెట్టుకి ప్రదక్షిణలు చేసేదెందుకు?

మర్రిచెట్టుకి ఉదయం సాయం సంధ్యలలో ప్రదక్షిణలు చేయటం ద్వారా, ఆయా సమయాల్లో సూర్యకిరణాలు మర్రిచెట్టుపై నుంచి మన మీద పడటం



ద్వారా ఆరోగ్యకరమైన ధాతువులు మన శరీరాన్ని ఆశ్రయిస్తాయి. తద్వారా అనేక రుగ్మతలు దూరమవుతాయి.

## భువిపై తప్పనిసరిగా దర్శించాల్సిన దివ్యక్షేత్రాలు ఏవి?

శ్రీరంగమూ, ప్రభాసతీర్థమూ, కంచీ, పుష్కరతీర్థమూ, భూతేశ్వర క్షేత్రము. ఈ క్షేత్రాల్లో దర్శన నివాసాలు స్వర్గప్రాప్తిని కలిగిస్తాయి. ఎంతటి పాపాలు చేసిన వారికైనా ఈ క్షేత్రాల్లో మరణం పుణ్యలోకాలను చేరుస్తుంది.

## ఏ సమయంలో ఎలాంటి తాంబూలాన్ని వేసుకోవాలి?

ఉదయం పూట వక్క ఎక్కువగా వేసుకొని, అదే మధ్యాహ్నం సున్నమెక్కువగా వేసుకొని, రాత్రిపూట ఆకులెక్కువతో తాంబూలాన్ని సేవించాలి.

## శ్రీరామచంద్రుడు సీతను విడిచింది ఎందుకు?

భార్య మీద ప్రేమలేక కాదు. వివాహ బంధాన్ని తప్పి కాదు. ఎవరో అన్నందుకు అసలే కాదు. ధర్మం

కోసం... రాజధర్మం కోసం. పరిపాలించేవాడిలో స్పష్టత లేకుంటే ప్రజలు అరాచకానికి అలవాటు పడతారు. ధర్మం గాడి తప్పుతుంది.

ఆ ధర్మం కోసం .. ప్రజల కోసం... వారి జీవన విధానము ధర్మ, దైవ, న్యాయ పద్ధతుల్లో సాగటానికి శ్రీరాముడు భార్యని వదిలి రమ్మన్నాడు.

అలా వదిలేసిన వాడైతే బంగారు సీతను పెట్టుకొని యాగం చెయ్యడు.

## పర్వత ప్రాంతాల్లో, ఎత్తు ప్రాంతాల్లో వారు కిటికీలు తీసి ఉంచాలని చెప్పేదెందుకు?

పర్వతాల మీదా, బాగా ఎత్తైన ప్రదేశాల మీదా మహాచలితో పాటు ఆక్సిజన్ తక్కువగా ఉంటుంది. వయసులో ఉన్నవారు కూడా అనేక రుగ్మతలు పడే అవకాశం ఉంది.

అందుకే పర్వతాల మీదా, గుట్టల మీదా ఉన్న వారు కిటికీలు తెరవకుండా నిద్రిస్తే భూతప్రేతాలు వచ్చేదారే గాని వెళ్ళేదారి ఉండదని చెప్పి ఆ విధంగా చేయిస్తారు పెద్దలు.

కేదార్‌నాథ్ లాంటి మహాపుణ్యక్షేత్రాలను దర్శించిన వారికి పై విషయం అనుభవంలో ఉంటుంది.



## వ్యవహార సాఫల్యత కొరకు?

ఓం అజిత - అధిప- సర్వ - సర్వేశ్వర నమో నమః అని 108సార్లు వినాయకుణ్ణి జపించవలయును.

## ఎర్ర నీళ్ళ దిష్టి ఎలా తీస్తారు?

మనిషి కంటి చూపుకి మహాశక్తి ఉంది. కొత్త వాహనానికి నిమ్మకాయలు కట్టడమూ, ఇంటి గుమ్మానికి గుమ్మడి కాయను కట్టడం... ఇవన్నీ దిష్టిలో భాగాలే. నిజంగా దిష్టి ఉంటుందా అంటే ఉంటుందనే చెప్పాలి.

మీరు బాగా చేసే వంట ఒక్కోసారి భయంకరంగా తయారవుతుంది. తీరా తరచి చూసుకుంటే ఆ సమయంలో వచ్చినవారు చేస్తున్న వంట గూర్చి మాట్లాడినట్టు గుర్తుకువస్తుంది. ఆ వంట మీరు ఎంతో బాగా చేస్తారన్నట్టూ గుర్తుకు వస్తుంది. అదే దిష్టి. అన్నిసార్లు బాగా వచ్చిన వంట ఎందుకలా అయిందో మీకు బోధపడుతుంది. మనిషి కనుల నుంచి అద్భుతమైన విద్యుత్ ప్రసరిస్తుంది. కొంతమంది మంచి దృష్టితో చూస్తే మరికొంతమంది ద్వేష దృష్టితో చూస్తారు. ఫలితమే ఇది.

అటువంటి సమయాల్లోనూ, పదిమంది నోట్లో మీ పేరు నానినప్పుడూ... సున్నమూ, పసుపూ కలిపిన ఎర్రనీళ్ళతో దిష్టి తీసి దూరంగా పోయాలి.

పక్కవారికి ఇబ్బంది లేకుండా చేసే ఏ చర్య అయినా, నమ్మకమైనా మంచిదే.

## ఆయుష్షుని పెంచేవీ, ఆరోగ్యాన్ని కలిగించేవీ?

- సాయంకాలం ఎండను ఆస్వాదించటము.
- యజ్ఞ, హోమాదుల పొగను పీల్చటం ద్వారా.
- తనకన్నా చిన్నదానితో సంగమించటం వల్ల.
- ఎక్కువ నీరు త్రాగటం వల్ల.
- రాత్రి పూట క్షీరాన్నమును భుజించటం వల్ల.
- నిత్యం వ్యాయామం చేయటం వల్ల.
- అన్నింటికీ మించి తృప్తి. మీకున్నపాటి వనరులు లక్షల మందికి కాదు కోట్లాది మందికి లేవని తెలుసుకోండి. ఆ రకంగా ఎంతమంది కంటే మీరు అదృష్టవంతులో తెలుసుకోండి.

## నవగ్రహాలకి ఏ నైవేద్యాలను నివేదించాలి?

సూర్య భగవానునికి గుడాన్నము, చంద్రునకు నేతితో వండిన పాయసము, కుజునకు హవిష్యాన్నము, బుధునకు క్షీరాన్నము, బృహస్పతికి పెరుగూ, శుక్రునకు ఘృతాన్నము, శనీశ్వరునకు నూవుల పిండీ,మినుములు,



రాహువుకి మాంసము, కేతువుకి చిత్రాన్నమూ, రేగిపండ్లూ, పచ్చితామర గింజలు. నవగ్రహాలకి ప్రీతిగల ఈ పదార్థములను తయారు చేసిన వారికి కూడా వారికేర్పడిన సకల సర్వదోషాలు పోతాయని గుర్తుంచుకోండి. (భవిష్య పురాణం నుంచి)

## మగవారికి పాతివ్రత్య నియమం ఎందుకు పెట్టలేదు?

తప్పు ఎవరు చేసినా తప్పే. మగవాడు చేసిన దానికి శిక్షలు నరకలోకంలో శిక్ష స్త్రీతో పాటే. అయితే పతివ్రత్యాన్ని పెట్టకపోవటానికి కారణము, పురుషుడు తప్పు చేస్తే వంశం చెడదు. అదే స్త్రీ తప్పు చేస్తే ఆ వంశమే కకావికలమైపోతుంది. పితృ దేవతలు వంశకళంకముతో విలవిలలాడిపోతారు. స్త్రీ తప్పు చేస్తే భర్త ముందు తరాలందరి వారికి ద్రోహం చేసినట్టే.

## ఏ దిక్కుగా తిరిగి జపం చేయాలి?

పడమర దక్షిణములవైపు కూర్చొని జపం చేయటం తగదు. ఫలితముండదు. తూర్పు వైపు తిరిగి కూర్చొని జపించటం ఉత్తమం. అలాగే ఉత్తర దిక్కు కూడా. భూప్రాంతాన్ని బట్టి ఉత్తర దక్షిణ ధ్రువాలు వెన్నుముకలో చైతన్యాన్ని పుట్టిస్తాయి. అందుకనే

అనుకూలమైన ఆరోగ్యకరమైన దిక్కులవైపు కూర్చొని జపించుకోవాలి.

## గ్రహ, నక్షత్ర, అపశకున దోషములు తొలగుటకు ?

ఓం నారాయణ నమో నమః అని మీ దైవ మందిరం ముందు భక్తిగా నిష్ఠగా 108సార్లు జపించవలయును.

## ఆయుర్వేద శాస్త్రం నాలుకను ఎలా గీచుకోవాలని చెబుతుంది?

స్టీలు బద్ధలతో కాకుండా బంగారమూ లేదా వెండి, రాగితో చేసిన నాలుక బద్ధలతో గీసుకోవడం ద్వారా సకల క్రిములకు నిలయమైన నాలుక పరిశుభ్రమవుతుంది. లేదా వేపబద్ధతో గానీ, తాటి ఆకుతో గానీ నాలుక గీసుకుంటే ఆరోగ్యం... తినే ఆహారం రుచికరం.

## శివ విష్ణువుల పంచామృత ప్రసాదంలో ఎంత ఆరోగ్యం దాగుంది?

♠ ఆవు పాలల్లో అణుకోశములను వృద్ధి చేసే శక్తి వుంది. అనేక దోషాలను నివారిస్తుంది. వీర్యవృద్ధిని



కలిగిస్తుంది. ఈ పాలతో పాటు నెయ్యి, తేనె చేర్చి సేవిస్తే నీరసం తగ్గుతుంది. వాత పిత్త రోగాలని హరిస్తుంది.

♠ ప్రాణవాయువును శరీరం తేలికగా గ్రహించే శక్తిని ఆవు పెరుగు ఇస్తుంది. ఆమ్లమును కలిగిన ఈ దధి వాతమును పోగొడుతుంది. పొటాషియం అనేక జ్వరాలను దూరం చేస్తుంది. ఈ పెరుగును పెసరపప్పుతో తినిన అనారోగ్యము. ఈ పెరుగుతో అరటి పండు చేర్చి తినకూడదు.

♠ ఆవు నెయ్యి కంటికి ఎంతో మంచిది. శరీరానికి కాంతినిస్తుంది. వయస్సుని వెనక్కి నెట్టే స్వభావము కలిగి ఉంటుంది. అందాన్ని పెంచి, తెలివి తేటలను వృద్ధి చేస్తుంది.

♠ తేనె దేహారోగ్యాన్ని పెంచే భూమిమీది అమృతము. నేత్ర వ్యాధులను దూరం చేస్తుంది. ఎక్కిళ్ళను పోగొడుతుంది. శారీరక శ్రమను పోగొట్టి ఉత్తేజాన్ని కలుగచేస్తుంది.

♠ పంచామృతంలో కలిపే మరొకటి చక్కెర. ఇది దేహాన్ని మధురంగా ఉంచుతుంది.

♠ అమోఘమైన ఔషధాలుగల పండు అరటిపండు. అతి దాహాన్ని నివారిస్తుంది. అన్నింటికి మించి భయంకరమైన క్యాన్సర్ వంటి వ్యాధులను శరీరం

దరి చేరకుండా ఉంచుతుంది. ఈ పేదవాడి పండైన అరటి పండు రోజూ రెండు తింటే రక్తపోటు స్థిరంగా ఉంటుంది.

- ♠ ప్రకృతి ప్రసాదించిన అపూర్వ పానీయము కొబ్బరి నీరు. లేత కొబ్బరి నీరు త్రాగటం వల్ల అనేక వ్యాధులు మాయమవుతాయి. అధికంగా పొటాషియము ఉన్న ఈ కొబ్బరి నీరు అనేక క్యాన్సర్ వ్యాధులను తగ్గిస్తుంది.
- ♠ అటువంటి కొబ్బరి నీరును అప్పుడప్పుడన్నా తీసుకుంటారో లేదో అన్న సందేహంతోనే మన పెద్దలు తీర్థమనే ఆచారంలో శాస్త్రీయతను కలిపి అందించారు.
- ♠ ఇంతటి అమూల్యమైన వాటితో చేసేదే పంచామృతము. భగవంతునికి నైవేద్యం పెట్టినదని భక్తి అనే నమ్మకంతో తీసుకోవటం వల్ల ఈ ప్రసాదం సంజీవినిగా మారి శరీరాన్ని అత్యంత శక్తివంతంగా చేస్తుంది.

## పుత్రుడు లేకపోతే?

అనేక కార్యాలకి అర్హులు పుత్రిక బిడ్డలవుతారు. అయితే వివాహ సమయంలోనే ఆ ఒప్పందం అనగా దత్తతగా స్వీకరించాలి. మహాభారతంలో బభ్రువాహనుడు పెట్టిన ఇలాంటిఒప్పందం కారణంగానే



అర్జునుడు మామగారికి తన బిడ్డను అర్పించాడు. అప్పుడే శాస్త్రసమ్మతము.

## ముక్తినిచ్చేవి ఏవి?

శ్రీమహావిష్ణువూ, ఏకాదశివ్రతమూ, గంగానదీ, తులసీ, వేదపూజాదికాలు చేయించిన బ్రాహ్మణుడూ, గోవులూ ఇవే ముక్తినిచ్చేవి.

## ఇవన్నీ అసత్యదోషాలు కావు

- ♠ తల్లి బిడ్డకు బువ్వ పెట్టేటప్పుడు బూచోడొస్తున్నాడని చెప్పటము.
- ♠ నువ్వు చాలా అందంగా ఉన్నావని భార్యకి భర్త చెప్పడం.
- ♠ బ్రాహ్మణునికి దానమిచ్చేటప్పుడు 'గోవు'ను కలిపి దానమంత్రాలను చదువుతారు. అది మనకి సంబంధించిన అసత్య దోషమవ్వదు.
- ♠ అవతల వారు బాధపడే నిజం చెప్పినా అది అసత్య దోషమే.
- ♠ అపకారం కలిగించే సత్యంకన్నా, మంచి జరిగే అసత్యం చెప్పటమే ధర్మము.

## కుక్కనెందుకు కొట్టరాదు?

కుక్క మన జీవన విధానంలో భాగము. అనేక జంతువుల నుంచీ, చోరుల నుంచీ, మన శత్రువుల

నుంచీ కుక్క మనల్ని కాపాడుతుంది. ఎన్నోమైళ్ళ దూరంలోనున్న గాలీ, ధూళీ కూడా కుక్క గ్రహిస్తుంది. అందుకే వేదాల్లో, ధర్మాల్లో, కుక్కని కొట్టగూడదని నియమము.

మహాయాగాలు జరుగుతున్నప్పుడు కుక్క వస్తే సంయమనం పాటించాలి.

కుక్క దాని బంధువు అయిన నక్క మాంసం తినిపించటము నరకలోకంలో మహాపాపాత్ములకి విధించే శిక్ష.

## తుమ్ము దోషము పోవుటకు ?

"ఓంనారాయణ నమో నమః" అని ధ్యానిస్తే ఏక తుమ్ము దోషం పోతుంది. నెత్తిననీళ్ళు చల్లుకున్నా సరిపోతుంది.

## సౌందర్యవతియైన భార్య కావాలనుకుంటే ?

**కామ దేవం త్రయోదశ్యాం సురూపో జాయతే ధ్రువమ్ ఇష్టాం రూపవతీం భార్యాం లభేత్కామాంశ్చ పుష్కలాన్**

త్రయోదశినాడు మన్మథుని పూజించి సంతృప్తి పరిస్తే మంచి సుందర రూపంతో పాటు అద్భుతమైన సొగసూ, లావణ్యంగల గుణవతి అయిన భార్యను పొంది సుఖించగలడు.



## స్త్రీలు రుద్రాక్షను ధరించవచ్చా?

ప్రకృతి పరంగా స్త్రీ ఇబ్బందిపడే ఆ అయిదు రోజులు నిషిద్ధము.

అలాగే ఇరవైఒక్కరోజుల పురుటి సూతకము అప్పుడూ నిషిద్ధం.

అలాగే అశౌచదినాలు... ఇక తప్పని సరిగా ధరించాలంటే మహిళలు గళసీమలో ధరించాలి. అయితే ఇన్ని అవరోధాలను అధిగమించి మహిళలు రుద్రాక్షను ధరించి పవిత్రంగా ఉంచలేరు కాబట్టి స్త్రీలు రుద్రాక్షను ధరించకూడదని చెప్పారు.

## ధ్వజస్థంభ పరమార్థమేమిటి?

సూర్యుని కాంతి కిరణములు నలభై అయిదు డిగ్రీల కోణములో పరావర్తనము చెందుతాయి. ఆ దిశగా ధ్వజస్థంభాన్ని ప్రతిష్ఠిస్తారు.

దక్షిణం వైపు నుంచి వచ్చే కుజగ్రహ కిరణాలు గోపుర కలశము మీదుగా ధ్వజస్థంభంపైనుంచి స్వామి భూమధ్యకి చేరతాయి.

అందుకే ధ్వజస్థంభమునకు స్వామి మధ్యన నుల్చుని నమస్కరించాలి.

అప్పుడే గ్రహశక్తితోపాటు స్వామి శక్తీ మనల్ని చేరుతుంది.

## ఏ తిథినాడు ఏ ఆహారం తీసుకుంటే పాపం కాదు?

- ♠ పాడ్యమినాడు తప్పనిసరిగా పాలు త్రాగాలి.
- ♠ విదియనాడు ఉప్పు లేకుండా భుజించాలి.
- ♠ తదియనాడు నువ్వుల అన్నాన్ని తినాలి.
- ♠ చవితినాడు పాలతో చేసిన పదార్థాలను భుజించాలి.
- ♠ పంచమినాడు ఫలములు ఆరగించాలి.
- ♠ షష్ఠినాడు శాకములు.
- ♠ సప్తమినాడు మారేడు.
- ♠ అష్టమినాడు పిండి పదార్థములు.
- ♠ నవమినాడు అగ్నితో పక్వము చేసిన పదార్థములు.
- ♠ దశమీ, ఏకాదశిలనాడు నేతివస్తువులు.
- ♠ ద్వాదశినాడు పాయసము.
- ♠ త్రయోదశినాడు గోమూత్రము.
- ♠ చతుర్దశినాడు యువాన్నము.
- ♠ పూర్ణిమనాడు కుశోదకము.
- ♠ అమావాస్యనాడు హవిష్యాన్నమును భుజించాలి. ఇలా ఆహారాన్ని తీసుకున్నవారు అశ్వమేధయాగ ఫలంతో పాటు, అనంతమైన ఆరోగ్యవంలవుతారని మహాపురాణాలలో శెలవిస్తున్నారు.



## అష్టదిక్చక్రమమునకు అధిపతులెవ్వరు?

- ♠ తూర్పునకు అధిపతి సూర్యుడు.
- ♠ ఆగ్నేయాధిపతి శుక్రగ్రహము.
- ♠ దక్షిణానికి కుజుడు.
- ♠ నైఋతికి అధినాయకుడు రాహువు.
- ♠ పశ్చిమానికి శనీశ్వరుడు.
- ♠ వాయువ్యమునకు అధిపతి చంద్రుడు.
- ♠ ఉత్తరానికి అధిపతి బుధుడు.
- ♠ ఈశాన్యమునకు అధిపతులు కేతువూ, గురువు.

## శత్రువుల భయము తొలగిపోవుటకు?

ఓం నారసింహ నమో నమః అని 108సార్లు శుక్ర లేదా శని వారాల్లో విష్ణు సంబంధిత దేవాలయాల్లో 108సార్లు జపించాలి.

## మహానిందితుడెవ్వడు?

- ♠ బిడ్డలకు సకాలంలో వివాహం చెయ్యనివాడు.
- ♠ ఋతుకాలమందు భార్యతో సంగమించనివాడు.
- ♠ తల్లి తండ్రి మంచిచెడులను చూడనివాడు.

## పుణ్యం తరిగిపోతే ఇక నాశనమేనా?

దశకంఠుడు రావణుడు శివభక్తుడు. మహా విద్వాంసుడు. సకల శాస్త్రాలనూ ఎరిింగిన వాడు. ఆ పుణ్య ప్రభావం వల్లనే ఎన్ని అరాచకాలు చేసినా భగవంతుడు ఉపేక్షించాడు. పాపం పండింది. సకల పుణ్యమూ పాపపు పనుల వల్ల హరించుకు పోయింది. అందువల్లే శ్రీరాముడంటాడు.. 'నీ పుణ్యం తీరింది.. ఇక మిగిలింది నీ నాశనమే' అని.

## అగ్నిప్రమాదములు దరి చేరకుండుటకు?

'ఓం జలశాయి నమో నమః' అని నదీ తీరప్రాంత మందు సముద్ర తీరప్రాంత మందు 108సార్లు జపించవలయును.వాయు దేవుడు ప్రీతి చెంది సకల సుఖాలను అందిస్తాడు.

## దక్షిణాయనమంటే?

సూర్యభగవానుడు కర్కాటక రాశిలో ప్రవేశించిన సమయం నుంచి మకరరాశిని చేరేవరకు మధ్యనున్న సమయమే దక్షిణాయనము. ఆ సమయంలో సూర్యుడు భూమధ్యరేఖకు దక్షిణంగా సంచరిస్తాడు.



## తల్లి నుంచి ఏ అవయవాలు, తండ్రి నుంచి ఏ అవయవాలు శిశువుకి వస్తాయి?

తల్లి నుంచి చర్మమూ, రక్తమూ, మాంసమూ, నాభి, హృదయమూ, చిన్నప్రేవూ, పెద్దప్రేవూ ఇత్యాదులు. తండ్రి శుక్ల బలము వలన జుట్టూ, కనులూ, గోళ్ళూ, దంతములూ, ఎముకలూ, శిరలూ, ధమనులూ ఇత్యాదులు... అందుకే వృద్ధాప్యమున వారికి అన్ని అవయవములూ మీరే అయి ఇరువురికి సేవ చేయాలని కౌమాభృత్యము శెలవిస్తోంది.

## ఈ కలియుగాన ఏమేమి జరుగుతాయి?

- ♠ ధర్మం ఒక్కకాలితో నడుస్తుంది.
- ♠ న్యాయానికి రోజులు కావు, అధర్మానికే రోజులు.
- ♠ మద్యపానం చాలా మామూలు విషయం.
- ♠ ధనమూ, స్త్రీ కోసం ఏమైనా చేస్తారు.
- ♠ ఓ స్త్రీకి ఎంతోమంది పురుషులూ, ఒక పురుషునకు ఎంతోమంది స్త్రీలు.
- ♠ బిడ్డల వివాహాలపై తల్లీ తండ్రీ హక్కును కోల్పోతారు.

- తల్లీ, తండ్రినీ ఎవరూ పట్టించుకోరు.
- ప్రకృతి మనుష్యులను ముప్పు తిప్పలు పెడుతుంది.
- వర్షాకాలంలో ఎండలూ, ఎండాకాలంలో వర్షాలూ.
- పురుషుడు లేకుండానే స్త్రీ బిడ్డకు తల్లవుతుంది.
- కొత్త దేవుళ్ళు పుట్టుకొస్తారు.
- వేదాలకీ, శృంగార గీతాలకీ తేడా ఉండదు.
- మనిషి ఆయువు సగం క్రిందకి పడిపోతుంది.
- గడిచే కొద్దీ మానవుని జీవనానికి అవసరమయ్యే జీవులు ఒక్కొక్కటిగా నశిస్తుంటాయి.
- పురుషుల్లో సంతాన శక్తి తగ్గిపోతుంది.
- ఒక్కోసారి భార్యను కూడా నమ్మలేని స్థితి వస్తుంది.

## ఉత్తరాయణ కాలమంటే?

సూర్యదేవుడు మకరరాశి ప్రారంభసమయం నుంచి, కర్కాటక రాశి ప్రవేశము వరకూ ఉండే సమయం.

ఈ సమయాన సూర్యుడు భూమధ్యరేఖకు ఉత్తరంగా సాగుతుంటాడు.

## సర్పభయ నివారణకు?

'ఓం గరుడధ్వజ నమో నమః' అని 108 సార్లు దేవాలయంలో జపించవలయును. తద్వార సర్పభయం తొలగిపోతుంది.



## దైవమందిరం పట్ల ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి?

- పూజామందిరం పైన అరల్లో పనికిరానివీ, విరిగినవీ వంటి వస్తువులను ఉంచి స్వామి తల భారం పెంచకూడదు.
- ఎండిన, మిగిలిన పుష్పాలనూ, కుంకుమ, పసుపు, అక్షితలను గృహంలో ఉంచరాదు.
- ప్రాకే పిల్లలనూ, చిన్నపిల్లలను పూజా మందిరానికి దూరంగా ఉంచాలి.
- దైవమందిరంలో గానీ, పక్కన గానీ మీకిష్టమైన సిద్ధ పురుషులు లేదా మీ వంశ పురుషుల చిత్రాలు ఉంచరాదు.
- భగవంతుడిపై అప్పుడే మీరు ఏకాగ్రతను నిలపగలుగుతారు. అనేక దేవతల విగ్రహాలూ, చిత్రాలూ ఉంచి పూజ చేయుట తగదు. అది రాక్షస పూజ అవుతుంది.

## అనామిక వేలికి తప్పక ఉంగరం ధరించాలా?

స్త్రీ పురుషుల ఉంగరపు వేలు... జీవనాడుల్లోని ఓ ముఖ్యనాడి ఈ ఉంగరం వేలు వరకూ ఉంటుంది.

ఆ నాడికి వత్తిడి కావాలి. ధనముతో సంబంధం లేకుండా బంగారమూ, వెండీ, ఇత్తడీ, రాగి.. ఏదో ఒక ఉంగరాన్ని ఉంగరపు వేలికి ధరించమని వట్టిగా ఉండకూడదని పెద్దలూ, శాస్త్రాలూ శెలవిస్తున్నాయి.

## ప్రాణాయామంలో ఉన్న చిదంబర రహస్యం?

బ్రహ్మ మనందరికీ ఒకే ఆయువు నిర్ణయించి భువిపై జన్మించేలా చేశాడు. కొంతమంది ముందూ, వెనకా కావటానికి కారణం మన ప్రవర్తనా, విధానాలే. ప్రతి మానవునికి రోజుకి ఇరవై ఒక్క వేల ఆరువందలు శ్వాసలు తీసుకునే విధంగా... అలా కొన్ని కోట్ల శ్వాసలు తీసుకునేలా నిర్ణయించి పంపాడు. శ్వాసలు పూర్తి అయితే మనుజుడు పైలోకాలకి చేరవల్సిందే. కోపంతోనూ, ఆవేశంతోనూ, స్వార్థంతోనూ, కుళ్ళుతోనూ, భయంతోనూ విపరీతంగా శ్వాసలు పీల్చి, కోటా పూర్తి చేసుకుంటున్నాము. అందుకే ప్రాణాయామం ద్వారా శ్వాసలు తక్కువ చేసుకోవటానికి ఆయుష్షు పెంచుకోవటానికి చేసేది ప్రాణాయామం.

## స్త్రీ పక్కదారి పట్టడానికి కారణాలు?

- ♠ మద్యపానము.
- ♠ భర్తకు దూరంగా అనేక కారణాల వల్ల ఉండటము.



- ♠ ఎప్పుడూ అటూ, ఇటూ తిరుగుతూ ఉండటము.
- ♠ విపరీతమైన నిద్ర.
- ♠ పలుసార్లు ఇరుగుపొరుగు ఇళ్ళకి వెళ్తుండటము.
- ♠ ప్రవర్తన సరిగా లేనివారితో కలిసిమెలిసి ఉండటము.

ఈ ఆరు కారణాలలో ఏవి ఉన్నా స్త్రీ చెడిపోవటానికి అవకాశము ఉందని మనువు శెలవిచ్చాడు.

## తిరుమల స్వామిని దర్శించేటప్పుడు బ్రహ్మనాడినీ దర్శించండి?

సప్తగిరి వాసుని దర్శనానికి వెళ్ళినప్పుడు కనులు మూసుకొని ధ్యానించకుండా చూడగలిగినంత సేపు స్వామినే చూస్తూ కదలండి. స్వామి విగ్రహ నొసటి కుడి పక్కన నామం క్రింద సూర్యనాడి, ఎడమ పక్కనున్న నామం క్రింద బ్రహ్మనాడి, మధ్యనుండే ఎర్రని నామమే బ్రహ్మనాడి. ఈ బ్రహ్మనాడి యందే పరమాత్ముడున్నాడు.

## స్నానము, దేవపూజ, ప్రదక్షిణ నమస్కారముల సమయాన చేయవలసిన జపము?

'ఓం వాసుదేవ నమో నమః' అని జపించిన ఫలితము వచ్చును. శరీరానికి ప్రశాంతత అవరించును.

## ప్రపంచంలోనే అతి పెద్ద మరకతము ఎక్కడుంది?

ఇంకెక్కడ.. ఏడుకొండలవాసుడు, తిరుమలగిరి నాయకుడు, ఆరుద్వారాల తర్వాత ఏడో ద్వారం తర్వాత దర్శనమిచ్చే అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకుడి ఖజనాలోనే అతి మేలైన 'మేరుపచ్చ' ఉంది.

## నరకలోకంలో ఏ పాపాలకి ఏ శిక్షలు...?

- ♠ అమాయకులని బాధిస్తే కాల్చిన చువ్వలతో వాతలు పెట్టడం శిక్ష.
- ♠ స్త్రీ ధనాన్ని ఆశిస్తే మహాముళ్ళతో నిండిన అడవుల్లో కళ్ళు పోగొట్టి పడవేయటము.
- ♠ కుటుంబం కోసం సంపాదించిన, లేదా సంపాదించినది ఒక్కడే అనుభవిస్తే పచ్చి మాంసాన్ని పీక్కుతినే వారు పీక్కు తింటారు.
- ♠ డబ్బు మదంతో అందర్నీ అవమానపరిచి హింసిస్తే, వాడి అయిన సూదులతో గుచ్చి గుచ్చి చిత్రహింస.
- ♠ ధర్మాన్నీ, వేదాల్నీ అవహేళన చేస్తే సకల అవయవాలను ఒక్కొక్కటిగా కోస్తారు.
- ♠ ధర్మపత్నితో వీర్యపానము చేయిస్తే (ముఖరతి) అదే వీర్యరసాన్ని పరులది త్రాగిస్తారు.



- ♠ పరుల ధన, మాన ఆస్తులను దౌర్జన్యంతోనూ, బలంతోనూ దోచుకుంటే వజ్రాలను కూడా ఖండించగలిగే వాడియైన కోరలు గల వందలాది కుక్కలతో కరిపిస్తాడు యముడు.
- ♠ అబద్ధాలను చెప్పిన వారికి వందలాది యోజనములు ఎత్తున ఉండే పర్వతాల మీద నుంచి రాతి బండల మీద పడేలా విసిరేయటము ద్వారా జీవుడికి శిక్ష విధిస్తాడు సమవర్తి.

## ఏ దేవాలయాలు ఏ దిశగా ఉంటాయి?

పరమేశ్వరుని ఆలయం ఈశాన్యదిశలోనూ, వైకుంఠవాసుడు శ్రీమహావిష్ణువు దేవాలయం పశ్చిమదిశలోనూ, సకల జీవకోటికి అన్న ప్రదాత సూర్యభగవానుడి ఆలయం తూర్పు దిశగా, దుర్గాదేవి అమ్మవారి ఆలయం ఉత్తరం వైపుగా, అదే బ్రహ్మ ఆలయం నిర్మిస్తే నగర మధ్య భాగంలో ఉంటుంది.

## ధనధాన్యములు నిలువ చేయు సమయాన?

'ఓం అనంతా, అచ్యుతా నమో నమః' అని జపించిన వృద్ధి చెందగలవు.

## భార్య ఎంత సేవ చేస్తుంది? మరి మీరు?

- ♠ ఎక్కడో పుట్టి పెరిగి, మీ నీడకొస్తుంది.
- ♠ మీ వంశాన్ని నిలబెడుతుంది.
- ♠ సంసారాన్ని నిత్యసాగు చేసి ఫలాన్ని తెచ్చి పెడుతుంది.
- ♠ రాత్రి సుఖాలను అందిస్తుంది.
- ♠ గృహాన్ని సైనికునిలా కాపాడుతుంది.
- ♠ భర్త కీర్తి ప్రతిష్ఠలను పెంచేలా ప్రవర్తిస్తుంది.
- ♠ ఆఖరున వృద్ధాప్యంలో కూడా చేతనయినంత సేవ చేస్తుంది సాధ్వీమణి.

భార్య నుంచి అన్నీ పొందాడు కాబట్టే పరమ శివుడు మొదటి భార్యకు అర్ధశరీరాన్నీ, రెండవ భార్యను శిరస్సునందూ అలాగే శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవిని వక్షః స్థలమందూ, బ్రహ్మ చదువుల తల్లి సరస్వతికి ముఖము నందు స్థానమేర్పరిచి తమ ప్రేమను చాటుకున్నారు. మరి మీరు?

## సీమంతం చేసే పండుగలో గాజులు తొడిగేదెందుకు?

ఏ శుభకార్యంలో లేని విధంగా సీమంతము సమయంలో గర్భిణీ స్త్రీకి అందరూ గాజులు తొడుగు



తారు. అయిదోతనంతో పాటు పండంటి బిడ్డను కనాలని ఆశీర్వదిస్తారు. అలా గాజులు తొడిగే కార్యక్రమంలో చక్కని పరమార్థం దాగి ఉంది. గర్భం ధరించిన స్త్రీ గర్భకోసం మీద కావలిసినంత జీవనాడుల వొత్తిడి కావాలి.

అందుకే ఏడోనెలలో శుభకార్యం చేస్తూ అయిన వాళ్ళంతా గాజులు తొడుగుతారు. చేతుల్లో నరాలకీ గర్భకోశానికీ అవినాభావ సంబంధం ఉంది. అలా ఎక్కువ గాజులు తొడిగించుకోవటం ద్వారా గర్భకోశముపై సరైన ఒత్తిడి వచ్చి సుఖ ప్రసవము జరుగుతుంది.

## తన భార్యను తాను, తన భార్య తననూ నగ్నంగా చూడాలనుకుంటే?

ఆరోగ్య, కోరికలను దృష్టిలో పెట్టుకొని శాస్త్రాలు వద్దనే చెబుతున్నాయి. తన ఆస్తి తాను చూసుకోకపోతే ఎలా అనుకునేవారూ, చిన్న దీపం కాంతిలో మాత్రమే చూడాలని వాత్సాయన శాస్త్రం చెబుతోంది.

అయితే తన భర్తను నగ్నంగా చూడటం వల్ల స్త్రీకి భర్త మీద ప్రేమా, కోరికా ఎక్కువవతాయే గాని తగ్గవు.

## కుంతి ముగ్గురు పుత్రులు జన్మించగానే ఇక వద్దు అని ఎందుకన్నది?

ముగ్గురు పుత్రులను ముగ్గురు పురుషుల ద్వారా పొందిన స్త్రీ ధర్మశాస్త్రాల ప్రకారం మళ్ళీ సంతానవంతురాలైతే స్వైరిణి అవుతుంది. అదే అయిదుగురు పుత్రులను అయిదుగురు పురుషుల ద్వారా పొందితే వేశ్య అవుతుంది. అందుకే మాద్రి ఒకే మంత్రంతో ఆశ్వనీ దేవతలను ప్రార్థించి తను స్వైరిణి కాకుండా ఒకేసారి నకుల సహదేవులకు జన్మనిచ్చింది.

## రుద్రాక్షలో ఎంతటి ఔషధశక్తి దాగి ఉంది?

- రుద్రాక్షను ధరించటం వల్ల అధిక రక్తపోటు తగ్గుతుంది.
- వీర్యవృద్ధి కలుగుతుంది. సంతానవంతులవుతారు.
- భోజనానికి ముందు రుద్రాక్ష రసంలో చిటికెడు తేనె కలిపి సేవిస్తే మలబద్ధకము తొలగుతుంది.
- రుద్రాక్షను పాలల్లో వేసి ఓ గంట తర్వాత ఆ పాలను త్రాగితే పిల్లలకు జ్ఞాపకశక్తి పెరుగుతుందని ఆయుర్వేద మహాశాస్త్రాల్లో వక్కాణించారు.



## తిరుమల శ్రీవేంకటేశ్వరునికి నివేదించేదీ, అతిపురాతనమైనదీ, ఆలయానికే పరిమితమయ్యే ప్రసాదం?

'తిరుక్కనమాద్రై' లేదా అక్కలి అంటారు. ఈ ప్రసాదం కేవలం ఆలయము వారికి చేసే అతి తక్కువ ప్రసాదం.

## విత్తనం ఒకటేస్తే మొక్క మరొకటి మొలవదు కదా?

చక్కని సుగుణాలున్న స్త్రీ పూజాదికాలతో, ధర్మనిష్ఠలతో పురాణ ప్రవచనాలతో ఎంత గృహస్థ జీవితాన్ని గడుపుతున్నా భర్త నీచుడూ, దుర్మార్గుడూ, కాముకుడూ అయితే వారికి పుట్టే బిడ్డలు అలానే అవుతారు. క్షేత్రములో ఏ విత్తనం చల్లితే ఆ మొక్కే వస్తుంది. అది క్షేత్రము ధర్మము. విత్తనమే ముఖ్యం.

## హోమాదుల నిర్వహించు సమయాన?

'ఓం వాసుదేవ నమో నమః' అని జపించ వలయును.

## ఏ తిథిలో ప్రయాణము చేస్తే ఏ ఫలితము వస్తుంది?

- ♠ దశమి రోజు ప్రయాణము ధనలాభము.
- ♠ విదియరోజు కార్యసిద్ధి జరుగుతుంది.
- ♠ శుక్లపాడ్యమి దుఃఖాన్ని కలిగించే సంఘటనలు జరుగుతాయి.
- ♠ నవమిరోజు నష్టములతో పాటు అనేక వ్యథలు కలుగుతాయి.
- ♠ తదియనాడు ప్రయాణము సకల కార్యాలనూ సిద్ధించేలా చేస్తుంది.
- ♠ పంచమినాడు శుభము.
- ♠ చవితినాడు ఆపదలను తెచ్చే అవకాశము.
- ♠ షష్ఠినాడు అకాలవైరాలను తెస్తుంది.
- ♠ అష్టమినాడు అష్టకష్టాలే.
- ♠ సప్తమినాడు ఆత్మారాముడు సంతృప్తి చెందేలా అతిథి మర్యాదలు ఎక్కడికెళ్ళినా జరుగుతాయి.
- ♠ ఏకాదశి కన్యలాభమంత సౌఖ్యము.
- ♠ అమావాస్య మహా ఆపదలు సంభవించవచ్చు.
- ♠ ద్వాదశి మహానష్టాలను తెచ్చిపెడుతుంది.
- ♠ త్రయోదశి శుభాలను తెచ్చే తిథి.
- ♠ బహుళ చతుర్థీ ఎంతో కీడును కలిగిస్తుంది.



- ♠ శుక్ల పూర్ణిమ నాడు పనులైనట్టే ఉంటాయి. కాని అవ్వవు.
- ♠ శుక్ల చతుర్దశి ఏ పనీ పూర్తిగా పూర్తి అవదు.

## ఈ కలియుగంలో ఏ కార్యం అనంతమైన ఫలితాన్నిస్తుంది?

కృతయుగంలో తపస్సు, త్రేతాయుగంలో వేదజ్ఞానము, ద్వాపర యుగంలో యజ్ఞయాగాదులు.

అదే ఈ కలియుగంలో దానాలకి మించిన సత్కర్మలేదని శాస్త్రాలు తెలవిస్తున్నాయి. అర్హత కలవానికే దానం చెయ్యమని భజగోవిందంలో శంకరాచార్యులు పదే పదే తెలవిచ్చారు.

## దుఃస్వప్న దోషములు హరించిపోవుటకు?

'ఓం నారాయణ, శ్రీధర, పురుషోత్తమ, వామన, శంఖీ నమో నమః' అని నిద్రకు ముందూ, లేచిన తర్వాత జపించవలయును. అలా జపించినవారికి దోష కలలు రావు. అంతకు ముందు వచ్చిన కలల దోషాలు తీరిపోతాయి.

## కన్యాదానమంటే? కొన్ని విషయాల వరకే వరునికి హక్కు?

వివాహ సమయంలో తన పుత్రికను వరునకు కన్యాదాన మిచ్చే తండ్రి, ఈ కన్యను ధర్మమునకూ, అర్థమునకూ, కామమునకూ మాత్రమే దానమిస్తున్నానని చెబుతాడు. ఆ మూడు పురుషార్థములు కొరకు మాత్రమే దాన మిచ్చిన కన్యను, అనగా తన భార్యను కొట్టుటకూ, హింసించుటకూ, గాయపర్చుటకూ, అమ్ముటకూ, తార్చుటకూ అర్హత లేదు. అట్టి వాణ్ని వదిలినా తప్పు లేదని ధర్మశాస్త్రాలు శెలవిస్తున్నాయి.

## పురుషులకి పరాయి స్త్రీలపై మోజెందుకు?

ధనస్వేచ్ఛా, సంపాదన స్వేచ్ఛా గలవాడు పురుషుడు. తన తెలివి తేటల ద్వారాగానీ, శ్రమతో గానీ సంపాదించినదాన్ని తన కోసం, తన వారి కోసం మాత్రమే ఖర్చు పెట్టాలనుకుంటాడు. తన ఆనందం కోసం తన దగ్గరున్న ప్రతిభ ద్వారా ఆనందాన్ని కొనాలనుకుంటాడు. ఆ ప్రయత్నంలో భాగమే కంటికి నచ్చిన స్త్రీ అనే శరీరాన్నించి కామాన్ని ప్రయత్నిం



చటము. ధనం చూపించి, మంచి మాటలతో ముందుకు సాగుతాడు. కానీ స్త్రీ ప్రేమను కోరుతుంది. మగాడికి కావల్సింది కేవలం ఆ క్షణం కామం. ఆ ప్రయత్నంలో ఒక్కోసారి కొంతమంది స్త్రీలు లొంగిపోతుంటారు. ఆ తర్వాత వాళ్ళిద్దరూ మరో ఇద్దర్ని చూసుకుంటారు. ఆ తర్వాత స్త్రీకి అది పెద్ద విషయం అన్పించదు. పురుషునికి తన మీద తనకు నమ్మకం పెరుగుతుంది.

## కంకణాన్ని ఎందుకు కట్టుకుంటారు?

గౌరీ పూజా, సత్యనారాయణ వ్రత సమయాల్లోనూ, వివాహాది కార్యాల్లోనూ, యజ్ఞ సమయాల్లోనూ కంకణం చేతికి కట్టుకుంటారు. చేసిన పూజ ఫలమూ, భావనా తొలగిపోకుండా ఆ కంకణము ఉన్నంత వరకూ అదే భావనతో ప్రశాంతతతో ఉండాలని నూలుకి పసుపు రాసి కట్టుకుంటారు. దానితో పాటు శరీరంలోని జీవనాడుల్లో ముఖ్య నాడి చేతుల మణికట్టు భాగం వరకూ ఉంటుంది. కంకణము కట్టుకోవటం వల్ల, వత్తిడి వల్ల రక్త ప్రసరణలతో పాటు హృదయ స్పందన సరళ రీతిలోకి ప్రయాణిస్తుంది. అక్కడున్న నాడి గర్భాశయం వరకూ ఉంటుంది. అందుకే నాడి పట్టుకొని చూసి కూడా స్త్రీ గర్భవతి అని చెప్పగలరు వైద్యులు. అంతటి విశిష్ఠ స్థానము ఆ

ప్రదేశము గాన ఎంతో కొంత వ్యాయామం కొరకు పెద్దలు పూజా, వ్రతాది సమయాల్లో కంకణము ధరించే ఆచారం పెట్టారు.

## ప్రయాణానికీ, తీర్థయాత్రలకీ ఏ రోజు మంచిది?

- ఆదివారము కష్టాలను తెచ్చిపెడుతుంది.
- సోమవారం సకల శుభాన్నీ, విజయాన్నీ, సంతోషాన్నీ తెచ్చిపెడుతుంది.
- మంగళవారం ప్రయాణం చేస్తే మీ ధనాన్ని అత్యంత జాగ్రత్తగా కాపాడుకోండి.
- బుధవారము ప్రయాణిస్తే ఖర్చు తక్కువతో ధనలాభం కలుగుతుంది. -ఇక గురువారం ప్రయాణము ఆరోగ్యానికి మంచిది. -శుక్రవారము ప్రయాణము లక్ష్మీ ప్రాప్తి (స్త్రీలకు కాదు).
- శనివారం ప్రయాణము ప్రారంభించకుండా ఉంటేనే మంచిది.

## శరీరంలో ఏ భాగం అదిరితే ఎలాంటి ఫలం?

- మగవారికి కుడిభాగము. స్త్రీలకు ఎడమభాగము అదిరితే శుభం. అలాగే పురుషులకు ఎడమ భాగమూ, స్త్రీలకు కుడిభాగము అదిరితే అశుభఫలం.



- నుదురు - ఊహించని ధనప్రాప్తి
- కనుబొమ్మ - మిత్రలాభము
- కంటి క్రింద - విజయము
- చెక్కిళ్ళు - రతిసంతృప్తి
- చెవులు - ప్రియ వాక్కులు వింటారు
- భుజము - వైభోగాలను పొందుతారు
- రొమ్ము - విజయము
- వీపు - పరాజయము
- యోని - సంతానము కలుగుతుంది
- పిక్కలు - కష్టాలు

## దానవసత్వ స్త్రీ లక్షణములు?

సకల విషయాలను అర్థం చేసుకునేది. తెలియనిదాన్ని తెలుసుకుని నేర్చుకునేది. ఉత్తేజంతో ముందుకు ఉరికేది.

దైవపూజ పట్టనిది. ఏ పనైనా ఒక్కతే చెయ్య గలనన్న ధీమా కలది. చాతనయినంతగా అందర్నీ బాధించునది దానవసత్వ.

## సకల కార్యాల్లోనూ, గృహస్థుడిగానూ విజయుడవ్వాలంటే?

**దుర్గాం సంపూజ్య దుర్గాణి నవమ్యాం తరతీచ్ఛయా సంగ్రామే వ్యవహారేచ సదా విజయ మశ్నుతే**

నవమినాడు మహాదుర్గాపూజను పుష్పముల తోనూ, ప్రీతికరమైన నైవేద్యాలతోనూ పూజ చేసిన వారు మహాదుర్గమమైన సంసారమునందూ, వృత్తిపర కార్యాల్లోనూ జయాన్నీ, సుఖాన్నీ పొందగలరు.

## నీటి ప్రయాణములో అపశృతి జరగకుండుటకు?

'ఓం పర్యంకశాయీ నమో నమః' అని జపము చేసిన సురక్షితముగా గృహాన్ని చేరగలరు.

## భగవంతునికి అర్పించే టెంకాయలో మరో పరమార్థం?

పూర్వం జంతుబలి విశేషంగా ఉన్న సమయంలో బౌద్ధులు, అహింసా మార్గ దర్శకులు జంతు బలి నిషేధించారు. ఆ స్థానంలో వచ్చిందే కొబ్బరికాయ. భగవంతుణ్ని ప్రార్థించి, పీచు పట్టుకొని కొట్టడమంటే.... పీచు అనగా మన జుట్టు. మనల్ని మనం అర్పిస్తున్నాము అన్న భావనే టెంకాయ కొట్టడం.

## వధూవరుల వివాహంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు?

- ♠ గోత్రములు అనగా మూల పురుషులవి విచారించాలి.



- ♠ ఏక గోత్రము అనగా ఒకే ఇంటిపేరుగల వాళ్ళు వివాహానికి పనికిరారు.
- ♠ తండ్రి వంశమున ఏడుతరాల వరకూ తల్లి వంశమునకు అయిదుతరాల వరకూ వివాహం చేయరాదు.
- ♠ మేనత్త, మేనమామ బిడ్డల వివాహము వల్ల అనర్థములు.
- ♠ గురువు పుత్రికను వివాహమాడరాదు.
- ♠ వరునికన్నా వధువు చిన్నగా ఉండాలి.
- ♠ అక్కకి పెళ్ళి చెయ్యకుండా చెల్లికి పెళ్ళి చెయ్యరాదు.
- ♠ సవతి తల్లి ఉంటే ఆమె వైపు కూడా విచారించి వివాహాన్ని నిశ్చయించాలి.
- ♠ ఒకర్ని ప్రేమించిన యువతిని పురుషుడు వివాహం చేసుకొనరాదు.
- ♠ తల్లీ, తండ్రీ వంశ పారంపర్య వ్యాధులున్నచో వివాహం చేసుకొనుట వల్ల ఆర్థిక, ఆనంద నాశనములు.
- ♠ వివాహం చేసుకునే వధువులో పురుషుడు చూడాల్సింది కులము కాదు గుణము.
- ♠ అదే విధంగా పురుషుడు విషయంలో వధువు చూడాల్సింది సంపద కాదు గుణమూ, సమర్థత.

## ఒకరి దుస్తులు మరొకరు ధరించవచ్చా?

ఈ అలవాటు ఎక్కువగా ఆడవాళ్ళలో ఉంటుంది. సౌందర్య సామగ్రి నుంచి బట్టలూ, నగలూ ఇలా ఎన్నో మార్చుకుంటుంటారు. అలా మార్చుకుంటున్నది కేవలం నగలూ, చీరలూ మాత్రమే కాదు వ్యాధులు కూడా. వారు ధరించిన వస్తువులకి వారికి సంబంధించిన వ్యాధుల క్రిములు ఎన్నో కొన్ని ఆ వస్తువులకి అంటి పెట్టుకొని ఉంటాయి. నగల విషయానికొస్తే తెలియకుండా రంధ్రాల్లో వారి శరీరం తాలూకు మట్టి క్రిములు నిక్షిప్తమై ఉంటాయి. మిగతా వారు ధరించినప్పుడు వారిని చేరతాయి. బట్టల విషయాని కొస్తే ఎంత ఉతికినవి అయినా వారి శరీరతత్వాన్ని అవహించుకునే వుంటాయి. మీరు ధరించగానే ఆనందంగా తమ పని తాము చేసుకుపోయి మీకు వ్యాధులను బహూకరిస్తాయి.

## పిల్లలు పుట్టని దంపతులు 'గాయత్రి' జపిస్తే సంతానం కలుగుతుందా?

గాయత్రీ మంత్రములోని ఇరవైనాలుగు అక్షరాలు శరీరంలో ఇరవై నాలుగు ప్రధాన అవయవాలను ఉత్తేజపరుస్తుంది. అందు అక్షరము 'ణ్య' వృషణమునకు



సంబంధించినది. 'ణ్య' అని పలికినప్పుడు వృషణాలు కదలి, ఉత్తేజం పొంది గర్భకోశ గ్రంథులు మరింత శక్తివంతమై సంతానవంతులయ్యే అవకాశం ఎక్కువగా ఉంది.

## గృహస్థాశ్రమమంటే?

చక్కటి పరిశుభ్రమైన నివాసం. సత్ప్రవర్తన కలిగిన పుత్రులూ, పుత్రికలూ...చక్కటి మృదుమధురమైన నెమ్మది పలుకులు పలికే భార్య. సదా క్షేమం కోరే మిత్రుడు. ధర్మమార్గంలో మాత్రమే సంపాదించే ధనంతో అతిథులనూ, సేవకులనూ మెప్పిస్తూ, మధురమైన పదార్థాలనూ, పానీయాలనూ భుజిస్తూ, సేవిస్తూ నిత్యదైవపూజను చేస్తూ పై అందరితో గడిపేదే గృహస్థాశ్రమము.

## ఈ పుత్రుడ్ని కూడా కొడుకుగానే పరిగణించాలి?

ధర్మార్థ కామ మోక్షాలకు బాసటగా ఉన్న తాళికట్టిన భార్యకు జన్మించిన వాడు పుత్రుడు.

- ♠ తన గోత్రపు వారినుంచి వచ్చినవాడు క్షేత్రజ్ఞ పుత్రుడు.
- ♠ తమకి సంతానం లేకపోవటం వల్ల ఇంకొక దంపతుల నుంచి స్వీకరించినవాడు దత్తపుత్రుడు.

♠ తన భార్యకి తన నుంచి కాకుండా, బలాత్కారమువల్లా, భయపెట్టి లొంగదీసుకున్న స్త్రీకి పుట్టినవాడు గూఢోత్పన్న పుత్రుడు.
♠ ఒళ్ళు క్రొవ్వెక్కి కని రోడ్డు మీద వదిలేసిన వాడ్ని పెంచుకుంటే, ఆపద్ధర్మ పుత్రుడు.
♠ వివాహానికి ముందు పుట్టినవాడు క్షేత్రజ కుమారుడు.

## వివాదములు తొలగి విజయము చేకూరుటకు?

'ఓం బలభద్ర నమో నమః' అని కార్యానికి ముందు జపించిన విజయము కల్గును.

## జ్యేష్ఠాదేవి ఆవహిస్తే వచ్చే లక్షణాలు?

పగలు నిద్రపోవటమూ, ఆడవాళ్ళ వ్యామోహమూ, స్త్రీలకు పురుషుల వ్యామోహమూ, మాంసాలను భుజించాలనుకోవటమూ, ఆటపాటలతో గడపాలనుకోవటమూ, వూరికే తిరగటమూ, మధుపానమూ, అసత్యాలను ప్రచారం చెయ్యటమూ ఇవన్నీ దరిద్రుని లక్షణాలు.

## కొత్తగా పెళ్ళయిందా?

వెంటనే కాకపోయినా, కొంతకాలం తర్వాతయినా సంతానం కోరుకోవటం తప్పదు. పుట్టేవారు వీరులూ,



సూరులూ, ధనవంతులూ కావాలని ఎవరైనా ఆశిస్తారు. అయితే మీ ఇష్టానుసారంగా ఉండేలా పిల్లలు ప్రవర్తించాలంటే మీరు కలిసినప్పుడు ఎలాంటి పుత్రుడు కావాలనుకుంటారో స్మరించుకోండి. గర్భాదాన కాలమందు మీ ఇరువురి యోచన విధంగానే జన్మించే శిశువుపై ఆ ప్రభావాలు పడతాయి.

## నిద్రలేవగానే చూడాల్సిన వస్తువులేమిటి?

బంగారము.... సూర్యుడు.... ఎర్రచందనము... సముద్రము... గోపురము... పర్వతము... దూడతో ఉన్న ఆవు... కుడిచేయి... తన ధర్మపత్ని... శుభము. చూడకూడనివి విరబోసుకుని ఉన్న భార్యనూ, బొట్టులేని ఆడపిల్లనూ, ఇల్లు ఊడ్వని ప్రదేశాలనూ చూచుట వల్ల ఆ రోజు అనేక నష్టాలు.

## మహాశివుడు లింగరూపంలో ఎందుకుంటాడు?

భృగుమహర్షి శాపం వల్ల పరమేశ్వరుడు లింగరూపంలో ఉంటాడు. లింగానికి పూజిస్తేనే ఫలమెక్కువ. శివలింగానికి మడీ, ఆచారమూ, శుద్ధీ ఉండవు. అందుకే శివసన్నిధికి ఎలా అయినా వెళ్ళచ్చు. విష్ణు ఆలయానికి మాత్రం అత్యంత శుభ్రంగా వెళ్ళాలి.

లేదంటే శ్రీమహావిష్ణువు ఊరుకున్నా లక్ష్మీదేవి సహించదు.

## పురాతన కాలంలో దేవదాసిల ధర్మాలు?

పున్నములప్పుడూ, విశేషదినాలప్పుడూ దైవిక కార్యక్రమాల్లో నృత్యం చేసేవారు. కొంతమంది రాజులు వార్ని తమ గూఢచారులుగా కూడా నియమించుకునేవారు. వారి పని దేవుణ్ని భర్తగా కొలిచి దేవస్థాన కార్యక్రమాల్ని చూడటముతో పాటు ధర్మకార్యాల్లో పాలుపంచుకోవటము. నృత్యగానాల వల్ల వారు ధనాన్ని పొందేవారు. అంతేగాని మరొకలా కాదు.

## దేవాలయ వాతావరణంలో నూతన శక్తి మనలో ఎందుకొస్తుంది?

గుడిగంటలూ, శంఖనినాదాలూ, మంత్రాలూ మనిషిలో వినికిడి శక్తిని ఉద్ధృతం చేస్తాయి. భగవంతునికి అర్పించే పుష్పాల్లోని సువాసనలు ఘ్రాణశక్తిని తట్టిలేపుతాయి. స్వామి ప్రసాదంలో రోజు వారి మనం వాడనివి ఉదాహరణకు పచ్చకర్పూరం వంటివి వేస్తారు. మనిషి ఆలోచనలను పెంచి ధర్మ మార్గం వైపు తీసుకెళ్ళే శక్తి ప్రసాదంలో ఉంది. నుదుటున పెట్టుకొనే చందనపు



బొట్టూ, చెవిలో పెట్టుకొనే తులసి వల్ల రక్త ప్రసరణ పెరిగి శరీరం ఆరోగ్యవంతమవుతుంది.

## సంతానవంతులగుటకు చేయ వలసిన జపము?

'ఓం జగత్పతి నమో నమః' అని ఇరువురు శుచియై పడుకోవటానికి ముందు మూడుసార్లు ధ్యానించిన త్వరగా సంతానవంతులవుతారు.

## ఎలాంటి స్త్రీ వేశ్యక్రింద వస్తుంది?

- ♠ భర్త మీద కోపంతో, ద్వేషంతో మరో మగవాడి వద్దకు చేరేది.
- ♠ ఐహిక సుఖాల మీద, అంద చందాల మెరుగుల కోసం, ధన కాంక్షతో చెడు మార్గంలో నడిచేది.
- ♠ బాగా చూసుకునే భర్త ఉన్నా, ధనమున్నా ఒళ్ళు క్రొవ్వెక్కి ప్రవర్తించేది.
- ♠ చూపుల ద్వారా, మాటల ద్వారా, ప్రవర్తన ద్వారా కొద్ది పాటి చనువుకి మాత్రమే ఆస్కారం కలిగించి ధనాన్ని పొందేది వేశ్యకన్నా నీచురాలు.

## రాక్షససత్వ స్త్రీ లక్షణము?

తనకన్నా ఏ విషయంలో జ్ఞానవంతులనైనా అకారణంగా తిట్టేది. అహంకారంతో ప్రవర్తించునది.

మాంసాదులతో ఇష్టంగా భోజనాన్ని స్వీకరించేది. సూటి పోటి మాటలతో ఎదుటివార్ని బాధించేదీ, భయమన్నది తెలియనిది, శరీరం కంటే స్తనద్వయం అతి పెద్దది గలది రాక్షససత్వ.

## కులాలెందుకు ఏర్పరిచారు?

రక్తానికి కులం లేదు. దేహానికి కులం లేదు. ఆత్మకూ, శరీరంలోని అవయవాలకీ కులం లేదు. మర్మాంగాలకీ కులం లేదు. మానవ జీవన విధానము నడుచుకొనుటకు వృత్తి నిమిత్తము పెట్టిన పేర్లే నేటి కులములని శుక్లయజుర్వేదము చెబుతోంది.

## తల్లీ, తండ్రీ వివాహం గూర్చి పట్టించుకోకపోతే?

♠ వివాహ వయస్సు దాటి మూడు సంవత్సరాలు గడిచినా, ఆ ప్రసక్తి ఎత్తకపోతే ఆ యవ్వనవతి స్వయంగా వివాహం చేసుకొనవచ్చును.

♠ సరయిన కాలంలో వివాహ క్రియ జరగనప్పుడు ఆ కన్య తను ఇష్టపడిన వ్యక్తిని వివాహం చేసుకొనవచ్చునని యాజ్ఞవల్కుడు శెలవిచ్చాడు.

♠ తననే కావాలని కోరినవాడూ, అందగాడూ, నెమ్మది స్వభావము కలవాడూ, చదువుకున్నవాడూ,



దోషములు లేనివాడూ అయిన పురుషుణ్ని చేసుకున్న స్త్రీ సుఖపడుతుంది.

♠ కన్యకు వివాహం చేయునపుడు వరుడు పురుషుడో కాడో విచారించవలెను. మాటలు, చూపుల ద్వారా తెలియును.

♠ మాటల ద్వారా నిర్ణయించుకున్నా వరుడు దోషములున్నవాడు అని తెలిసిన ఆ వివాహం మానిన అధర్మం కాదు.

♠ నిశ్చితార్థమైన తర్వాత ఏం జరిగినా, తెలిసినా, వివాహం ఇరువురికీ తప్పదు. అదే వధూవరులలో ఎవరికి ఇష్టం లేకపోయినా వివాహం ఆపిన అధర్మం కాదు.

♠ తండ్రి కన్యాదానము చేయలేని స్థితిలోనున్నప్పుడు సోదరుడూ, మేనమామా లేదా స్వకులస్థులూ చేయవచ్చును. తల్లికి కూడా కన్యాదానము చేయు అర్హత కలదు.

## విశ్వామిత్రుడు హరిశ్చంద్రుడ్ని అడిగిన ధనమెంత?

ఓ బలమైన మనిషి ఏనుగును ఎక్కి ఓ రత్నాన్ని ఎంత పైకి విసురుతాడో అంత ఎత్తున నాకు వరహాలు కావాలి.

నా తపోబలంతో పైకి ఎగిరిన రత్నం అక్కడే నిలిచి ఉంటుంది అని అడిగాడు.

## ఈ సమస్త సృష్టిలో తొలిపెళ్ళికూతురు, తొలి ముత్తైదువ ఎవరు?

తొలి దంపతులు పార్వతీ పరమేశ్వరులు. మన వివాహ శుభ దైవ కార్యక్రమాల్లో పెళ్ళి కూతురిచేత గౌరీ పూజ అనగా పార్వతీ దేవికి పూజ చేయిస్తారు. శ్రీమహాలక్ష్మీ, సరస్వతీ దేవిల పూజ చేయించనిది ఎందుకంటే తొలి వధువూ, తొలి ముత్తైదువ పార్వతీదేవి అని.

## జపం తర్వాత ఎంత నిగ్రహంగా ఉండాలి?

జపవిధి అయ్యాక, వారిలో ఓ అపూర్వ శక్తి వస్తుంది. వాక్కు సత్యమవుతుంది. జపానంతరం పలికే మాటలను ఎంతో వివేకంతో పలకితే మంచిది. చెడు పలకటం ద్వారా వచ్చిన జపసిద్ధి పోవటమే కాక పలికిన చెడు మాటలు భవిష్యత్తులో యదార్థాలు అవుతాయి. మంచిమాటలు మాట్లాడితే మనసు మంచిగా ఉండటమే కాకుండా మంచి జరుగుతుంది.



## సర్వకార్యసిద్ధి కొరకు?

'ఓం శ్రీశా నమో నమః' అని 108సార్లు అమ్మవారి ఆలయంలో ప్రార్థించినా, జపించినా కార్యములు జయప్రదమగును.

## కొబ్బరి కల్లు త్రాగితే సుందరమైన బిడ్డలు పుడతారా?

పుడతారనే ఆయుర్వేద శాస్త్రం చెబుతుంది. అవకాశం ఉన్నవారు గర్భం ధరించిన తర్వాత తమ నల్లరంగూ, చామన ఛాయ బిడ్డలకు రాకూడదని కొన్ని ప్రాంతాల్లో కొబ్బరి కల్లు త్రాగుతుంటారు. అలా తాగటం వల్ల మంచి రంగుతో బిడ్డలు కలుగుతారని చరకసంహిత శెలవిస్తోంది.

## శివాలయంలో ప్రదక్షిణ చేసేటప్పుడు చేయాల్సిన ముఖ్య విధి?

పరమేశ్వరుని ఆలయంలో చేసే అభిషేకాల పవిత్ర గంగ చిన్న కాలువ ద్వారా బైటికి వెళ్తుంది. ప్రదక్షిణలు చేసేవారు స్వామి ధ్యానంలో ఆ విషయం పట్టించుకోక ఆ కాలువ దాటుతుంటారు. గంగను అలా దాటినట్టే. అందుకే ఆ విషయం గమనంలో పెట్టుకొని పాపనాశనములైన ప్రదక్షిణలు మాత్రమే చేయాలి.

## భోజనము చేస్తున్నప్పుడు ఎన్ని నీళ్ళు త్రాగాలి?

ఈ విషయమున ఆయుర్వేదం నిక్కచ్చిగా చెప్పింది. భోజనము ప్రారంభించిన దగ్గర్నించి పూర్తి అయ్యేవరకూ అరగ్లాసు మాత్రమే త్రాగాలి. భోజనము అయ్యాక ఓ గంట తర్వాత ఓ గ్లాసు ఆపై త్రాగాలి. ముద్ద ముద్దకి గ్లాసు నీరు త్రాగితే శరీరంలోకి వెళ్ళిన ఆహారం సాంబరులో తేలే ముక్కల్లా జీర్ణం కాక మలబద్ధక సమస్యలూ, ఉదర వ్యాధులూ వస్తాయి.

## స్త్రీ లక్షణాల బట్టి ఏ జాతికి చెందినదవుతుంది?

♠ నిత్యము రెండు పూటలా స్నానము చేయునది, పరిమళముగలది. ప్రియ సంభాషణలు గలది. తక్కువ భుజించి అంతే తక్కువగా మాట్లాడేది 'దేవత'.

♠ భర్తకు తెలియకుండా పాపములు చేసేది, చేసినవి తనపై పడకుండా జాగ్రత్తపడేది. అర్థంకాని విధముగా ప్రవర్తించేది 'మార్జాలం' (పిల్లి).

♠ అతిగా నవ్వుతూ, ఆటపాటల మాటలతో వ్యవహరిస్తూ, ఊహించని విధంగా కోపం



తెచ్చుకొని మరుక్షణంలోనే ప్రసన్నురాలయ్యేది 'రాసభి' (గాడిద).

♠ భర్తకూ, బంధువులకూ అనుకూలకార్యములను చేస్తూ ఏకాంతమున భర్త వద్ద అంగవిన్యాస రూప శృంగార చేష్టలు చేసేది 'అసురి'.

♠ విపరీతంగా తినుట, పూరికే అతిగా మాట్లాడుతూ, ఎవ్వరినో ఒకర్ని దూషిస్తూ భర్తకు ఎదురు చెప్పే స్త్రీ 'రాక్షసి'.

♠ శుచి ఆకారము లేకుండా విసుగు తెచ్చే రూపంతో, చెమటతో, మాలిన్యంతో నిరంతరమూ కన్పించే స్త్రీ 'పిశాచి'.

♠ నిత్యస్నాతయై సువాసనలుగల పూలను ధరించి పదార్థములను ఇష్టంగా భుజించి భర్తకు ఆనందం కలిగించేలా అతనితో ఉద్యానవనాల్లో విహరించే స్త్రీ 'గాంధర్వి'.

♠ చాపల్యము గలదీ, ఎల్లప్పుడూ దిక్కులు చూసేదీ, పిసినారీ, తిరిగే గుణముకలదీ 'వానరి'.

♠ చంద్రబింబము వంటి ముఖముతో పొందికైన అవయవాలతో మదించిన ఏనుగువలే నడిచేదీ, ఎర్రని వన్నెతో మెరిసే గోళ్ళు కలదీ 'విద్యాధరి'.

♠ వీణ వంటి సంగీత ధ్వనులను చేయగలిగేదీ, పాటలూ, వేణుగానమూ, పుష్పములూ,

సుగంధ ద్రవ్యములన్న ఆసక్తి గల స్త్రీ కూడా 'గాంధర్వే'.

## ఆడపిల్లను శుక్రవారమూ, కోడలిని శనివారమూ పంపకూడదా?

లక్ష్మీదేవి వంటి ఇంటి ఆడపడుచును శుక్రవారం పంపరు. అదే కోడలిని శనివారం పుట్టింటికి పంపకపోవటానికి కారణం ... ఆ రోజులు పూజాదికాలు, హోమాలకు శుభప్రదమైన రోజు. ఇంటి బాధ్యత గల కోడలికి కుటుంబపరమైన దైవకార్యాలప్పుడు తగిన ప్రాధాన్యత ఇవ్వటం కోసమే శుక్ర, శనివారములు పంపరు.

## తిరుమల లడ్డు ఎప్పట్నించి ప్రసాదంగా వస్తోంది?

అనేక శాసనాలు, గత చరిత్రలూ చూస్తే మనం ఎంతో అపురూపంగా భక్తి భావంతో చెప్పుకునే తిరుమల లడ్డు నూటయాభై సంవత్సరాల నుంచి వస్తోంది.

## ఎలాంటప్పుడు అబద్ధం ఆడాలి? ఏ సమయంలో అబద్ధం ఆడకూడదు?

**ప్రాణహానియునైన బంధుహానియునైన విత్తహానియునైన వినుముకడకు**



**మానహానియైన మరియేమి అయినను। బొంకకుండు వాడు పుణ్యతముడు॥**

**వారిజాక్షులందు । వైవాహికములందు । ప్రాణ విత్తమాన భంగమందు।**

**చకితగోకులాగ్ర జన్మరక్షణ మందు। బొంకవచ్చు నఘము బొందదధిప॥**

## పూర్వ కాలంలో తుఫానువంటి ఉపద్రవాలొస్తున్నాయని ఎలా కనిపెట్టేవారు?

- ♠ తేనెపట్టులోని తేనెటీగలు బైటికొచ్చి ఝీం పెడుతుంటాయి.
- ♠ పావురాలు గమ్యము లేకుండా తిరుగుతూ అలజడిగా అరుస్తుంటాయి.
- ♠ కుక్కలు చెవులు విప్పార్చి ఒకింత భయంతో తుఫాన్ దిశగా చూస్తాయి.
- ♠ అడవిలోని ఏనుగులు గుంపులు గుంపులుగా పరిగెడుతుంటాయి.
- ♠ కొన్ని జంతువులు ఆహారం కోసం బైటికి రాకుండా లోపలే ఉండిపోతాయి.
- ♠ ఆవులూ, మేకలూ వర్షపు రాకను పసిగట్టి ఎప్పటిలా కాకుండా విరుద్ధంగా అరుస్తాయి.

## సర్వారిష్టములు తొలగుటకు?

'ఓం విశోకా నమో నమః' అని 108సార్లు మీ ఇష్టదైవాన్ని తొలుత తలచుకొని జపించవలయును.

## హీరవాయువు ఏ సమయంలో వీస్తుంది?

బ్రహ్మ ముహూర్తకాలంలో అనగా సూర్యుడు ఉదయించక ముందు నాలుగు, అయిదుగంటలు సమయం. ఆ సమయంలో వీచే గాలి అమృతం వంటిది. దాన్నే ఋషులు హీర వాయువు సమయమంటారు. ఆ ముహూర్తంలో లేచిన వారికి బుద్ధి వికసిస్తుంది. ఆయుష్షు వృద్ధి చెందుతుంది. ఏ పని చేసినా విజయవంతమవుతుంది.

## ఆయుర్వేదమున అనారోగ్యకాలంగా చెప్పిన రోజులు?

సంధికాలము లేదా యమ దంష్ట్రా కాలమంటారు. కార్తీక మాసంలో మిగిలిన పదిహేను రోజులూ, మార్గశిర మాసములోని పదిహేనురోజులు. ఈ సమయం ఋతుసంధి కాలం. విపరీతమైన చలి. స్త్రీలలో విపరీతమైన కామాన్ని పెంచే కాలం. సూర్య భగవానుడు



తన తీక్షణ కిరణాలను ప్రసరించే సమయం. కాన ఆరోగ్యానికి మంచిది కాదు. అందుకనే ఆ రోజులు అయ్యప్ప, భవానీ దీక్షలతో తమ శక్తిని కాపాడుకుంటూ వ్రత దీక్షలు చేస్తారు. స్త్రీలు పూజాదికాలలో నిమగ్నులై ఉండేటట్లు పెద్దలు అనేక పండుగలనూ, ఆచారాలనూ ప్రవేశపెట్టారు.

## పదిమంది మీ వద్దకు వచ్చినప్పుడు ఎలా మాట్లాడాలి?

♠ ముందుగా వృద్ధుడిని పలకరించాలి.
♠ తర్వాత అందులో జ్ఞానమున్న వార్నీ, చదువుకున్న వార్నీ పలకరించాలి.
♠ ఆ తర్వాత దూరపు బంధువూ, ధనవంతుడినీ పలకరించాలని గౌతమ మహర్షి శెలవిచ్చారు.

## ఆయుర్వేద, ధర్మశాస్త్రాల్లో చెప్పినవి?

♠ మిమ్మల్ని మెచ్చి మెడలో వేసిన మాలను వెంటనే తీయరాదు.
♠ తినే ఆహార పదార్థాలను వాసన చూడకూడదు. అలా చేస్తే ముక్కులోని క్రిములు ఆహారంపై పడి ఆహారం రోగక్రిములమయమవుతుంది.
♠ చతుర్దశినాడు మంగలి వాని వద్దకు వెళ్ళరాదు.
♠ అమావాస్య రోజు స్త్రీ వద్దకు వెళ్ళకూడదు.

- ♠ పగలు వెలగ చెట్టు నీడలో, రాత్రి రావి చెట్టు క్రింద పడుకోరాదు.
- ♠ మంగళవారం అప్పు తీరిస్తే మళ్ళీ చేయాల్సిన అవసరం రాదు.
- ♠ ప్రతిరోజు ఏదో ఒక సమయం ఎంచుకొని మౌనం పాటించాలి.
- ♠ మీ పడకగదిలో దీపాలని మీ సహధర్మచారిణి మాత్రమే ఆర్పాలి.

## భోజనాన్ని ఎలా తినాలి?

ఎత్తయిన ప్రదేశంలో నోటికి దగ్గరిగా కూర్చొని తినటం ద్వారా విపరీతమైన పొట్ట వచ్చి అందం పోతుంది. క్రొవ్వు పెరిగి ఆరోగ్యం పోతుంది. భారతీయ ఋషి సంప్రదాయం ప్రకారం కటిక నేలమీద కూర్చోకుండా చాప, పట్టా వంటిది వేసుకుని, ఇంటిల్లిపాదీ గుండ్రంగా కూర్చొని మధ్యలో ఆహార పదార్థాలు పెట్టుకొని భోజనం చేస్తే కనీసం యాభై శాతం వ్యాధులను అరికట్టవచ్చు.

## శ్రీకృష్ణుడిలో చూడాల్సింది చిలిపితనమే కాదు?

ధర్మరాజు రాజసూయయాగం చేస్తూ పార్థునికి వచ్చిన వారికి సకలమర్యాదలూ చేసే బాధ్యతనూ,



వాయుపుత్రునికి వంటపనులనూ, సుయోధన సార్వభౌమునకు రాజాధిరాజులు ఇచ్చే కానుకలను స్వీకరించటమూ, సహజ కవచ కుండలాలు గల కర్ణుని దాన ధర్మాలను ఇచ్చేందుకు పురమాయించాడు. నకుల సహదేవులను వారికి సహాయంగా ఉంచాడు. పరమాత్ముడు శ్రీకృష్ణుడు తనకీ ఓ పని చెప్పమన్నాడు. ధర్మరాజు కృష్ణుని పూజించి వద్దొన్నాడు. కానీ తన ఆత్మీయుల ఇంట్లో శుభకార్యం జరుగుతుండటంతో శ్రీకృష్ణుడంతటి వాడు వచ్చిన రాజర్షులకు సేవలు చేశాడు. వినయభూషణుడు కూడా శ్రీకృష్ణుడు.

## ధనుర్మాసంలో గొబ్బెమ్మలు ఎందుకు పెడతారు?

ఇంటిముందు ముగ్గు వేసి గొబ్బెమ్మలు పెట్టి వాటిని బియ్యంపిండి, పసుపు, కుంకుమ, పూలతో అలంకరించి పూజిస్తారు. లక్ష్మీ రూపంలో ఉన్న గొబ్బెమ్మలను ఈ విధానం వలన పూజించటం జరుగుతుంది. నిత్యం ముగ్గులు వేయడం వలన స్త్రీలకు మంచి వ్యాయామం కూడా కలుగుతుంది.

## కొత్తబిచ్చగాడు పొద్దెరగడంటే?

ఇందులో ఆధ్యాత్మికం కంటే శృంగార సంబంధిత పాళ్ళే ఎక్కువ.

కొత్తగా పెళ్ళయిన వాడు సాయంత్రం అయిదుగంటలకే తలుపేసుకుంటే వచ్చిన తంటా!

## కలియుగములో మానవులు చేసే ఎట్టి పాపములైనను తొలగుటకు?

'ఓం గోవిందా నమో నమః' అని జపించవలయును. గోవింద నామస్మరణ చేసినంతనే కలియుగములో మానవులు చేసిన పాపములు తొలగిపోవును.

## ఏ శివాలయంలో పూజ చేస్తే ఏ ఫలం?

శిథిలమవనున్న శివాలయంలో అభిషేకం చేస్తే, మహామహిమాన్వితమైన జ్యోతిర్లింగంలో చేసిన అభిషేకానికి పదిరెట్లు ఫలం లభిస్తుంది.

## ఏ నక్షత్రములో ఇచ్చిన సంపదలు తిరిగిరావు?

ఉత్తర, ఉత్తరాషాఢ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, రోహిణి, విశాఖ, మఘ, కృత్తిక, భరణి, మూలా నక్షత్రాల్లో ఇచ్చిన ధనమూ, భూమీ, వస్తువులూ తిరిగి రావు.



## గంగాజలములో అంతటి శక్తి ఉండటానికి కారణమేమిటి?

హిమాలయాల్లో పుట్టిన జలము గంగ. గంగ ప్రవహించే చాలా ప్రాంతం భూభాగంలో రేడియం ఉండటం వల్ల ఆ నీటిలో చైతన్య శక్తి నిచ్చే శక్తి దాగి ఉంటుంది. కలరా, అంటువ్యాధుల వంటి క్రిములు గంగాజలంలో బ్రతకలేవు. గంగాజలము సమస్త వ్యాధులను పోగొట్టే అమృతప్రవాహమని చరక మహర్షి శెలవిచ్చారు.

## పాపమంటే రోగము.... పుణ్యమంటే ఆరోగ్యము!

ధర్మమైన ఆలోచనలతో జీవనం సాగిస్తే ఆరోగ్యమనే మహాఐశ్వర్యం కలుగుతుంది.

అధర్మ ఆలోచనలతో జీవనం సాగిస్తే మనకి వచ్చే ధనరాసులు కుమ్మరించినా మాన్పలేని రోగాలు.

## నవరత్నాల ఉంగరాన్ని ధరించమని శాస్త్రాలెందుకు చెప్పాయి?

మనిషి శరీరంలో తొమ్మిది ధాతువులున్నాయి. వాటి పరమార్థాన్ని చెప్పేవే నవరత్నాలు. రక్తము

పగడానికీ, ఎముకలు ముత్యానికీ, పుష్యరాగము మాంసానికీ, శిరోజాలు నీలానికీ, వైఢూర్యానికి క్రొవ్వూ, గోమేధికానికి బలమూ, కెంపునకు వీర్యమూ, వజ్రానికి వెన్నుపూసా, పచ్చకు గోళ్ళూ సూచికలు. కానీ ప్రస్తుతం పెట్టుకునే వారు నవరత్నాలు ధరిస్తున్నామనుకుంటు న్నారు. నిజానికి అసలైన నవరత్నాలను ధరించట మన్నది ఎంత డబ్బున్న వారికి కూడా సాధ్యం కాదు.

## ఏ రోజు పాపాలు ఆ రోజే ఎలా పోతాయి?

సూర్యునితో కూడినది ప్రాతఃసంధ్య. ప్రాతః సంధ్యలో నిల్చుని జపిస్తే రాత్రి పాపములు తొలగిపోతాయి. అలాగే సాయంకాల సంధ్యా వందనమునకు కూర్చొని జపించటం వల్ల ఆ రోజు పాపాలు తొలగిపోతాయి. సాయం సంధ్యా సమయమున నక్షత్రములు ప్రకాశించే వరకూ గాయత్రిని జపము చేయవలెను.

## నదులు, సముద్రములు దాటుతున్నప్పుడు?

'ఓం కూర్మ, వరాహ, మత్స్య నమో నమః' అని జపించిన నీటి ఆపదలు తొలగును.



## పుణ్యం కొద్ది పురుషుడూ, దానం కొద్ది బిడ్డలూ అంటే?

అనాదిగా వస్తున్న ఈ వాక్యాల్లో ఎంతో పరమార్థం దాగి ఉంది. పుణ్యమంటే పూజ....శ్రేష్ఠమైన పువ్వులతో పూజ చేస్తే మంచి పురుషుడు భర్తగా లభిస్తాడనీ, దానమనే పుణ్యం వల్ల మంచి సంతానం కలుగుతుందనీ పరమార్థం.

## పెళ్ళాం వండి పెట్టిన దానికన్నా, బైట... రుచెందుకు ఉంటుంది?

ఆహారంలో వుండాల్సిన వాటికన్నా ఎక్కువుంటే రుచి వస్తుంది. దానికి తోడు ఇడ్లీల్లో రాత్రి అన్నము కలపటమూ, సోడా ఉప్పు ఎక్కు వెయ్యటమూ, బాగా ఉడికించి ఉప్పు, కారమూ అధిక మోతాదులో సరిపాళ్ళలో వెయ్యటం వల్లా, రుచి కోసం కొన్ని కలపకూడనివి కలపటం ద్వారా రుచి వస్తుంది. దానికి తోడు ఇంట్లో అయితే డబ్బు కట్టక్కర్లేదు. అక్కడయితే కట్టాలి. అందుకే రుచి.

## నిద్రపోయే వార్ని ఎలా లేపాలి?

- ♠ పెద్దగా అరిచి లేపకూడదు.
- ♠ పడుకున్న వాడ్ని కుదిపి కుదిపి లేపకూడదు.

♠ ముందు మెల్లగా పిలిచి, ఆపై స్వరం పెంచి, నెమ్మదిగా చేయివేసి కదిపి లేపాలి.

♠ ఒంటరిగా నిద్రపోతున్నవారి విషయంలో మరింత జాగురూకత వహించాలి.

♠ మనుష్యుడు నిద్రిస్తున్నప్పుడు ఆత్మలోని అంశాలు కొన్ని బైటికెళ్తుంటాయి అంటారు. అందుకే అనర్థాలు జరిగే అవకాశం ఉండటం వల్ల నిద్రలేపే విషయంలో, అదీ అనారోగ్యంగా, పెద్ద వయసున్న వారి విషయంలో ఎంతో మెళుకువను చూపాలి.

## కలబంద నివాస, వ్యాపార సంస్థలకి కట్టేదెందుకు?

కలబంద కలిమిని తెచ్చిపెడుతుంది. దుష్టశక్తులనూ, నరదిష్టినీ ఆవి తనే ఆవహించుకుంటుంది. ఎన్ని సంవత్సరాలైనా పాడవ్వదు. ఎండి రాలిపోదు. ఎంత త్వరగా ఎండి పాడైతే అంత దిష్టి ఉన్నట్టు.

## భవిష్యపురాణంలో తెలిపిన సుఖము నిచ్చు స్త్రీ లక్షణములు ఏమిటి?

♠ ఎర్ర తామర వంటి కాంతి కలది.

♠ నేలమీద చక్కగా పాదములు ఆన్చినది.



♠ నరములు కనపడని బాణపు కర్రలు గల గుండ్రమైన పిక్కలు గలది.

♠ ఏనుగు వంటి నడకతో, హంసగమనము కలిగినటువంటిది.

♠ నాభి ఉవ్వెత్తున లేకుండా చిన్న రోమములున్న పిక్కలు గలది.

♠ గోరోజనము వంటి వర్ణము కలది.

♠ ఏనుగుల తొండములవలే, అరటి స్థంభములవలే, మనిబంధము నుంచి కనిష్ఠిక పర్యంతమైన హస్త భాగముల వలే తొడలు గల స్త్రీ ఎక్కువ మన్మథ సుఖాన్నిస్తుంది.

♠ సంధ్యా వర్ణమున సమముగా, అందంగా, సూక్ష్మరోమములతోనున్న నడుము గల స్త్రీ మహా ప్రశస్తమైనది.

♠ రావి ఆకును బోలియుండేది, తాబేలు వీపును బోలి ఎత్తుగా నుండేది, చంద్రబింబము వలే, కలశాకారము గల స్త్రీని వివాహం చేసుకున్న వాడు మహా సుఖాలను అనుభవించగలడు.

♠ విపులమూ, సుకుమారమూ అయిన కడుపుకలది.

♠ గుండ్రములై, ఎత్తుగా నుండి, బలిసినవై, దూరములేకుండా ఉండిన స్తన యుగ్మములు ప్రశస్తములు.

## నాగసత్వ స్త్రీ లక్షణము?

నిద్రే జీవితంగా గడిపేది. అటూ, ఇటూ నిత్యం హడావుడిగా తిరుగుతుండేది. ఎప్పుడూ ఆవలిస్తూ ఉండేది. శ్యామ వర్ణము గలది నాగసత్వ.

## ప్రొద్దున లేవగానే ఎవరి మొహం చూసావంటే...?

మనిషి శరీరం ఓ విద్యుత్ కేంద్రం. రాత్రంతా నిద్రపోయి మెలకువ రాగానే కనులు తెరిచినప్పుడు దేహంలోని విద్యుత్ శక్తి కనుల ద్వారా బైటికొస్తుంది. మనకెదురైన మనిషిలో దేహశక్తి ఎక్కువైతే ఆ ప్రభావం మన మీద పడుతుంది. అదే వారి దేహశక్తి తక్కువైతే మన ప్రభావం వారి మీద పడుతుంది. శరీరమూ, మనస్సూ బ్యాలెన్స్ తప్పి చేయకూడని కార్యాలు చేసి ఊహించని సమస్యను తెచ్చుకుంటారు. అలా కాకూడదని లేవగానే అరచేతులు రుద్దుకొని కళ్ళకద్దుకుని ఆపై లేచి భగవంతుని పటాన్ని చూడమంటారు.

## శృంగారంలో వెనకపడితే?

పనస ఆకుల్లో భోజనం చెయ్యటం, అలాగే పనస ఆకుల్లో ఆవిరి కుడుములు చేయించుకుని తింటే వీర్యవృద్ధితో పాటు జఠరాగ్ని పెరుగుతుంది.



## నెమలి కన్నులుగల పింఛము శివునికెందుకు సమర్పిస్తారు?

నెమలి పింఛము శుభమైనది. మంగళకరమైనది. సృష్టిలో నెమలి అంత పవిత్రమైన జీవి లేదు. నెమలిపింఛమునకు గాలిలో విష ధూళులను దూరంగా ఉంచే శక్తి ఉంది. మహాశివునికి నెమలి వింజామరను సమర్పించటం వల్ల శివానుగ్రహం అపారంగా కలుగుతుంది. దోషములు పోతాయి.

## నిండు నూరేళ్ళు ఆరోగ్యంగా బ్రతకాలంటే?

ఉదయం యువరాజులా తినాలి. మధ్యాహ్నం మహారాజులా భుజించాలి. రాత్రి చక్రవర్తిలా ఆరగించాలి. భోజనం తక్కువ పెట్టుకోవాలి కూర ఎక్కువ పెట్టుకోవాలి. ఎక్కువ సేపు నమలాలి.

## లేవగానే చేతులు రుద్ది కళ్ళకు అద్దుకునేది దేనికి?

అలా చెబితే చాదస్తంగా కొట్టి పారేస్తారు. కానీ అందులో ఎంతో ఆరోగ్యం, ఉత్సాహం దాగి ఉంది. నిద్రలేవగానే రెండు చేతులూ రుద్దుకొని కళ్ళకు

అద్దుకుంటే చేతుల్లోని ఉష్ణశక్తి కనులద్వారా శరీరానికి వ్యాపించి మొత్తం శరీరాన్నే ఉత్తేజం కలిగిస్తుంది. చేతులు రుద్దుకునేటప్పుడు బ్రహ్మ రాసిన చేతి గీతలు అనుకోకుండా చూడటం ద్వారా బ్రహ్మను పూజించినంత ఫలం కూడా.

## చెప్పులను బైట వదలి రావాలని ఎందుకంటారు?

రకరకాల సమస్యలూ, ఆలోచనలూ... వాటి ప్రభావం మనసు మీద పడుతుంది. అందుకనే దేవాలయాల్లోనూ, గృహాల్లోనూ చెప్పులు బైటవదలి, అనగా అహాన్నీ, కోపాన్నీ, సమస్యలనీ వదలి లోపలికి వెళ్ళాలని పరమార్థం. దానికి తోడు చెప్పులు లోపలికి తేవటం ద్వారా వందలాది సూక్ష్మక్రిములు ఆ పరిసరాల్లో స్థిర నివాసము ఏర్పరుచుకొని అనారోగ్యం కలిగిస్తాయని కూడా.

## మన శరీరంలో విశుద్ధి చక్రం ఎక్కడుంది?

మెడయందు విశుద్ధిచక్రం ఉంటుంది. అక్కడ రెండు దళాలుంటాయి. గంధం మెడపై వ్రాయటం వల్ల అక్కడి వేడిని గంధం గ్రహించి విశుద్ధి చక్రాన్ని సక్రమంగా నడిపిస్తుంది.



శుభకార్యాల్లో రాసే గంధం వెనుక ఆధ్యాత్మికతో పాటు అనంతమైన ఆరోగ్యం దాగి ఉంది. గంధం చెమటని హరిస్తుంది. చెమట పొక్కులు రాకుండా నిరోధిస్తుంది.

## నరసత్వ స్త్రీ లక్షణము?

అతిథులయందు ఆదరాభిమానాలు గలది. వ్రతాలూ, ఉపవాసములూ దైవ సమయంలో గడుపునది నరసత్వ.

## తులసిలో మహోన్నతమైన ఆరోగ్యం దాగి ఉందా?

- ♠ తులసి రసాన్ని సేవిస్తే కఫం తగ్గుతుంది.
- ♠ రోజు రెండు ఆకులు తింటే క్యాన్సర్ రాకుండా అరికట్టవచ్చు.
- ♠ బాగా జలుబుతో ఉన్నవారు తులసి రసాన్ని నాసికారంధ్రంలో రెండు చుక్కలు వేసుకుంటే జలుబు తగ్గుతుంది. సేవిస్తే దగ్గు కూడా మాయమవుతుంది.
- ♠ ప్రాణం పోయే సమయంలో కూడా తులసి తీర్థం ఇచ్చేది శ్వాసలో బలం పెంచి పోతున్న ప్రాణం నిలబడుతుందనే.

♠ విష్ణుప్రీతికరమైన తులసిలో ఆధ్యాత్మికమూ, భక్తీ, ఆరోగ్యమూ దాగి ఉన్నాయి.

## ప్రతినెలా ఓ సంవత్సరం మీ వయస్సు వెనక్కి వెళ్ళాలంటే?

మూడు పూటలా కేవలం పళ్ళు మాత్రమే తినాలి. అలా నెలలో మూడు రోజులు దీక్షలా తీసుకుంటే శరీరంలోని సకల మలినాలు తొలగిపోతాయి. అలాగే మీ శక్తికి మించి ఓ మహాకార్యం భుజాన వేసుకుంటే కేవలం పళ్ళే తీసుకోండి. ఎంత అద్భుతం జరుగుతుందో చూడమని మహా ఆయుర్వేద శాస్త్ర పితామహుడు చరకుడు శెలవిచ్చాడు. పండ్లు దేవతల ఆహారం.

## నిత్యకళ్యాణము పచ్చతోరణ మంటారెందుకు?

పండుగలూ, శుభకార్యాలప్పుడు పచ్చని మామిడి ఆకులని కడతాము. రకరకాల పూలమాలలతో అలంకరిస్తాము. పచ్చని ఆకులు బొగ్గు పులుసు గాలిని పీల్చి ప్రాణవాయువును వదులుతాయి. పరిసరాలు పరిశుద్ధమవుతాయి. కంటికి ఆకుపచ్చ రంగు మేలు కూడా చేస్తుంది. మామిడి ఆకులే కాక మారేడు కూడా అందుబాటులో ఉంటే కట్టవచ్చు. ఆకులు



ఎండిపోయేంత వరకూ ఆ చుట్టుపక్కల వాయువు శుద్ధమవుతూనే ఉంటుంది.

## కార్యసిద్ధి మంత్రము

'శ్రీరామ జయరామ జయ జయ రామ' అను ఈ రామమంత్రమును 108 సార్లు పఠించిన కార్యము సిద్ధించును. శ్రీరాముడు స్వయంగా హనుమంతునికే ఆజ్ఞాపించి కార్యం సకల శుభం చేయమని ఆజ్ఞాపిస్తాడు.

## జనన లోపాల నివారణ మర్రి ఆకు భోజనము!

పుట్టుకతో వచ్చే జనన లోపాలను సరిదిద్దే శక్తి మర్రి ఆకులలో ఉంది. గర్భిణీ స్త్రీలు ఆ ఆకుల్లో భోజనం చెయ్యటం మంచిది.

## శుభలేఖలకి నలువైపులా పసుపు ఎందుకు రాస్తారు?

శ్రీమహాలక్ష్మీదేవికీ, ఆమె అక్క జ్యేష్ఠాదేవికీ ఎవరెక్కడ ఉండాలన్న విషయమై చర్చ వచ్చింది. లక్ష్మీదేవి సముద్రంలోకి వెళ్ళి దాక్కోవటంతో ఆమెని బైటికి రమ్మని జ్యేష్ఠాదేవి కోరింది. ఆ సమస్య కొలిక్కి వచ్చిన సమయంలో లక్ష్మీదేవి తానెక్కడుంటుందో

చెప్పింది. వాటిలో పసుపు ఒకటి. అందువలననే వివాహ శుభలేఖలకీ, కొత్త వ్యాపార లెక్కల పుస్తకాలకీ పసుపు రాసి శ్రీ మహాలక్ష్మికి ఆహ్వానం పలుకుతారు. ఆమెను ఆ విధంగా స్మరించుకోవటం వల్ల ఆమె కృప అన్ని వేళలా వారిపై ఉంటుందని పురాణాలు శెలవిస్తున్నాయి. చెల్లి మాటపై జ్యేష్ఠాదేవి ఆ పరిసరాల్లోకి రాదు.

## మంగళసూత్రాల్లో గుబ్బ ఎందుకుంటుంది?

ఆ ప్రదేశంలో వాయువు చేరుతుంది. ఊపిరితిత్తులూ, గర్భకోసము కలిసే నరాల వద్ద ఆ మంగళసూత్రాలు తాకుతాయి. అలా బంగారు సూత్రాలు తాకినప్పుడు గుబ్బలోని వాయువులు ఆమెకి పుట్టబోయే బిడ్డలకు మంచి చేస్తాయి.

## సముద్రస్నానం ఎలా చేయాలి?

పర్వదినాల్లో సముద్రస్నానమునకు ముందు తొలుత చన్నీటితో స్నానం చేసి ఆపై సముద్రస్నానం పూర్తి చేసి మళ్ళీ చన్నీటిస్నానము చేయాలి. సముద్రపు ఉప్పు ఎక్కువ సేపు శరీరానికి తలిగితే రోగదాయకమవుతుంది. ఎక్కువసేపు సముద్రస్నానం చేస్తే ఆరోగ్య రీత్యా మంచిదికాదు.



## మనుజుడు రోజును ఎలా ప్రారంభించి, ఎలా పూర్తి చేయాలి?

నాలుగూ, అయిదూ మధ్య నిద్రలేవాలి. ఆపై కర దర్శనము, ఉదయపు స్మరణ. శిష్టాంజలి, భూదేవికి నమస్కారము. ఉషఃపానము. మలమూత్ర విసర్జనలు. పళ్ళు తోముకోవటము. చక్కటి చన్నీరుతో అభ్యంగస్నానము.

శుభ్రమైన దుస్తులు ధరించి తిలకధారణ చేసుకొని భగవంతుణ్ని స్మరించి తమ తమ వృత్తి ధర్మాల్లో నిమగ్నమవ్వాలి.

రాత్రి ఏడు తర్వాత భగవంతుణ్ని ధ్యానించి, భోజనం చేసిన అరగంట తర్వాత నిద్రకుపక్రమించాలి.

## జ్వరం, తలనొప్పి తగ్గుముఖం పట్టుటకు?

'ఓం గరుడధ్వజ నమో నమః' అని జపించవలయును. అలా జపించటం వల్ల ఆ మంత్రాక్షారం ధ్యానం వల్ల శరీరంలోని నాడులు శక్తి కలిగి ప్రశాంతతను కలుగచేస్తాయి.

## మన పెద్దలు మడితో భోజనము చెయ్యమన్నదెందుకు?

అనేక వ్యవహారాల మీద అక్కడా, ఇక్కడా తిరగటం వల్ల శరీరానికీ, మనుసుకీ ఆ రెంటితో పాటు దుస్తులకూ అనేక కనిపించని మలినాలు చేరతాయి. అందుకే భోజనానికి ముందు 'మడి' అనగా ముందు కట్టిన దుస్తులను వదలి ఉతికిన బట్ట ధరించమని... ఈ కాలమున కాళ్ళూ, చేతులు కడుక్కొని ఉతికిన లుంగీ ధరించి భోజనానికి కూర్చుంటే కొంతవరకు నయం.

## ఋషులూ, మునులూ నియమిత వేళలో సూర్యనమస్కారం చేసేదెందుకు?

వారేకాదు మనమూ ప్రతినిత్యం సూర్య నమస్కారాలు చేయటం ద్వారా ఆ సమయంలో పడే కిరణాల వల్ల శరీరంలో అనేక మలినాలు మాయమవుతాయి.

రాత్రంతా చీకటి వెలుగుల్లో మన శరీరానికి అనేక సూక్ష్మ క్రిములు అంటిపెట్టుకుని ఉంటాయి. అవన్నీ తొలగేందుకే నమస్కార ప్రియుడైన సూర్యునికి సూర్యనమస్కారాలు చేయమనేది.



## దేవసత్వ స్త్రీ లక్షణములు

అడుగుదూరంలోనే సువాసన తగులును. నిట్టూర్పుల శరీరతత్వము కలది. ప్రశాంత ముఖంతో ఎప్పుడూ నిండుకుండలా కనిపించే స్త్రీ దేవసత్వ.

## సంఖ్యా శాస్త్రం ప్రకారం పిల్లలకి పేర్లెలా పెట్టాలి?

ఆడపిల్లలకు బేసి సంఖ్యతో వచ్చే నామాలను ఏర్పరచాలి. మగపిల్లలకి సరిసంఖ్యతో వచ్చే పేర్లు పెట్టాలి.

## మహా పుణ్యాతి పుణ్య పూజాదికార్యాలేవి?

- ♠ పాడ్యమినాడు విష్ణుమూర్తికి ఘృతస్నానము చేసినవారి ఇరువది ఒక్క తరములను తరించి విష్ణులోకాన్ని చేరతారు.
- ♠ బ్రహ్మదేవునకు నేయితో, పాలతో స్నానము చేయించిన వారు బంగారు విమానములో బ్రహ్మలోకాన్ని చేరతారు.
- ♠ చెరకురసంతో స్నానము చేయించిన వారు ప్రకాశవంతమైన సూర్యలోకాన్ని చేరతారు.

♠ గంధపు నీటితోగానీ, చందనపు నీటితో గానీ అభిషేకించిన వారు బంగారు వన్నెకాంతితో రుద్రలోకాన్ని చేరతారు.

♠ పరిశుద్ధమైన జలముతో గాయత్రీ మంత్రమును వంద పర్యాయములు జపించి బ్రహ్మదేవునకు అభిషేకించిన వారు బ్రహ్మలోకాన్ని పొందుతారు.

## బిడ్డలకి దిష్టి ఎలా తియ్యాలి?

రాతి ఉప్పును ఒక చెంచాడు చప్పున ఎడం చేతి గుప్పిటలో తీసుకొని ఇరుగు దిష్టి, పొరుగు దిష్టి, తల్లి దిష్టి అన్నీ తుడిచిపెట్టుకు పోవాలని అనుకుంటూ బిడ్డ చుట్టూ ఎడమ నుంచి కుడికి మూడుసార్లు, కుడి నుంచి ఎడమకి మూడుసార్లు తిప్పాలి. చేతిలో ఉన్న ఉప్పుని పక్కన ఒక ప్లేటులో పెట్టి పై విధంగా మరో రెండుసార్లు చేసి నీటితో బిడ్డ కళ్ళను తుడిచి దిష్టి తీసిన ఉప్పును ఎవ్వరూ తొక్కని చోట పడవేయాలి.

ఇదే విధంగా ఉప్పు, మిరపకాయలు కలిపిన మిశ్రమంతో తీయవచ్చు. ఇంకా కొబ్బరికాయను లేదా కోడి గుడ్డును కూడా తిప్పి తీయవచ్చు.

## దంతధావన ఎలా చేయాలి?

చాలామంది చేసినట్టుగా కాకుండా మధ్య వేలితో చేయాలి. అలానే నడుస్తూ చేయరాదు. ఎక్కడ పడితే



అక్కడ ఊయటం మహాపాపం. ఆ వూసిన చోట అనేక క్రిములను చంపిన పాపం తెలియకుండా మీకే అంటుకుంటుంది.

## సర్వ మంగళప్రదమైన గృహము కొరకు?

'ఓం శ్రీవిష్ణు నమో నమః' అని విడవకుండా 108సార్లు జపించిన సర్వమూ మంగళకరముగా ఉండును.

## తలస్నానం చన్నీటితో ఎందుకు చేయమంటారు?

నదీస్నానమూ, సముద్రస్నానమూ చెయ్యమనేది శిరస్సు నందు అనేక జ్ఞానసంబంధిత కణము లుంటాయి. వాటిని ఉత్తేజ పరుచుటకు నదీ లేదా సముద్ర స్నానము చేయమంటారు. వీలు కాని ఎడల చన్నీటితోనైనా చేస్తే మంచిది.

## హోమగుండం వద్ద ఎలాంటి ముగ్గులు వేస్తారు?

సర్వత్ర చక్రం హోమగుండం వద్దా, అలాగే యజ్ఞయాగాదులప్పుడు అష్టదళపద్మం, ఓంకారం, స్వస్తిక్

వంటివి వేస్తారు. ఇలా వేయాల్సిన సందర్భం వచ్చినప్పుడు అవకాశం ఉంటే భగవత్ ప్రసాదంగా భావించి ముగ్గును స్వయంగా వేయండి. ఆ ప్రాంతంలో వేసిన ముగ్గు వలన సప్త జన్మల వరకూ సౌభాగ్యం లభిస్తుంది.

## గజసత్వ స్త్రీ లక్షణము?

తెల్లారగానే ఆహారం కోసం వెతుక్కునేది. వెంటనే మత్తుగా పడుకునేది. పక్కవారి మాటలన్న ప్రియం కలది. విపరీత కోప స్వభావం కలది గజసత్వ స్త్రీ లక్షణము.

## తల్లీ, తండ్రీ ఎంత గొప్పవారని శాస్త్రాలు చెబుతున్నాయి?

- ఈ సమస్త భూమికంటే బరువైనది తల్లి.
- ఆకాశముకన్నా ఉన్నతుడు తండ్రి.
- ఒక్కసారి తల్లికీ, తండ్రికీ నమస్కరించిన గోవును దానం చేసిన ఫలము వచ్చును.
- సత్యం తల్లి... తండ్రి జ్ఞానము.
- పదిమంది ఉపాధ్యాయులకంటే ఆచార్యుడు గొప్ప వాడు. వందమంది ఆచార్యులకంటే తండ్రి గొప్ప వాడు.ఆ తండ్రికంటే వేయిరెట్లు గొప్పది తల్లి.



- ఆరుసార్లు భూప్రదక్షిణ చేసిన ఫలమూ, వెయ్యిసార్లు కాశీయాత్ర చేసిన ఫలమూ, వందసార్లు సముద్రస్నానము చేసిన ఫలమూ అందుతుంది.
- ఏ పుత్రుడూ, ఏ పుత్రికా మాతృదేవతను సుఖంగా ఉంచరో, సేవించరో వారి శరీర మాంసాలు శునక మాంసము కన్నా హీనమని వేదం చెబుతోంది.
- ఎంతటి శాపానికైనా నివృత్తి ఉంది. కన్నతల్లి కంటనీరు తెప్పించితే దానికి లక్ష గోవులు దానమిచ్చినా, వేయి అశ్వమేథయాగాలు చేసినా పోదు.
- తను చెడి బిడ్డలని చెడగొట్టిన తండ్రిని అసహ్యించు కున్నా తప్పులేదు. చెడునడతతో ఉన్న తల్లిని నిరాదరించినా అది తప్పేనని ధర్మశాస్త్రము చెబుతోంది.
- తల్లిని మించిన దైవం లేదు. గాయత్రికి మించిన మంత్రం లేదు.

## విఘ్నేశ్వరుని ప్రసాదం తిన్న తర్వాత ఏం చెయ్యాలి?

ఒక్క వినాయకుణ్ణి మాత్రమే వేద మార్గం ద్వారా, అపరిశుభ్రంగా పిశాచగణపతి రూపంలోనూ ఆరాధిస్తారు. మొదట ధర్మమైన పూజా విషయానికొస్తే

వినాయకుని ప్రసాదం తిన్న తర్వాత ఆ నోటితోనే విష్ణుమంత్ర జపం చేస్తే అనంతమైన పుణ్యం. అలాగే ప్రసాదం తిన్న తర్వాత నోరుకడుక్కోకుండా ఏదైనా తిని ఆపై మీ అలవాట్లును కొనసాగించాలి.

## ఉఫ్.. ఉఫ్.. మని ఆహారాన్ని తినటము, పెట్టడం చేయరాదు?

వేడిగా ఉన్న ఆహార పదార్థాలను తల్లి బిడ్డకు పెట్టే ముందు వాటిని ఊదుతూ చల్లార్చి పెడుతుంది. అలాగే మనమూ అనాలోచితంగా వూది వూది తింటాము. అది ఎంతో అనారోగ్యం. నోటిలోని అనేక క్రిములు ఆహారం మీద పడి ఆహారాన్ని విషతుల్యము చేస్తాయి.

## శనిగ్రహం గూర్చి భయం వద్దు?

శనీశ్వరుడు మహాశివుణ్ని సహితం అష్టకష్టాల పాలు చేసిన శక్తివంతమైన గ్రహం. అయితే అంతస్థాయిలోనే శుభాన్నీ, సంతోషాన్నిచ్చేది కూడా శనీశ్వర గ్రహమే. మన కర్మ, పుజాదికాలను బట్టి ఆనందాన్నిస్తాడు.

## ఫలాలను ఎలా ఆరగించాలి?

సహజంగా భోజనం చేసిన తర్వాత లేదా కలిపి తినే అలవాటు ఉంటుంది. అలా తినటం



అనారోగ్యము. పండ్లు చాలా తేలికగా జీర్ణమయ్యే ఆహారం. ఘనాహారంతో తింటే జీర్ణక్రియలో మార్పులొచ్చి అనారోగ్యం కలగ చేస్తుంది. పండ్లను ఒకింత ఖాళీ కడుపుతోనే తీసుకోండి.

## ఉదయం లేవగానే గోరువెచ్చని నీళ్ళెందుకు త్రాగుతారు?

శరీరంలో అవయవాలన్నీ రాత్రి నిద్ర తర్వాత పూర్తి విశ్రాంతిలో వుంటాయి. మొహం కడుక్కోవటం ద్వారా, అటూ ఇటూ తిరగటం ద్వారా శరీరం మామూలు స్థితిలోకి వస్తుంది. శరీరం లోపలున్న అవయవాలు ఆహారం తీసుకోవటానికి సిద్ధంగా ఉండవు. అందుకే తేలికైన నీటితో వాటిని లేపుతాము. అడుగు బొడుగు పదార్థాలన్నీ మనము త్రాగిన నీటిద్వారా శుభ్రపడి ఘనాహారం తీసుకోవటానికి సిద్ధంగా లోపలి అవయవాలు సిద్ధపడతాయి.

## కార్యము ఏ రోజు పెట్టుకోవాలి?

వివాహం అయినా పరిపూర్ణంగా భార్య కాదు. దానమిచ్చిన కన్య, వధువే. కార్యమైన తర్వాతే సంపూర్ణమైన మీ భార్య అవుతుంది. జీవితంలో మరిచిపోలేని ఆ మధురరాత్రిని పదహారో రోజు లేదా పదహారురోజుల లోపు గాని పూర్ణచంద్రుడంత

అందంగా స్త్రీ ఋతుమతి అయిన పదిహేనో రోజుగానీ, పదహారో రోజు గానీ పెట్టుకుంటే మీ శ్రీమతి అద్భుతమైన అందంతో ఉంటుంది.

## నిత్యమూ ఏఏ సమయాల్లో, ఏమని దైవస్మరణ చేయాలి?

నిద్ర నుంచి లేచినపుడు 'ఓం విష్ణు నమో నమః ' అని జపించవలయును.

భోజనం చేయు సమయంలో 'ఓం మాధవాః నమో నమః' అని జపించవలయును.

నిద్రకుపక్రమించు సమయంలో 'ఓం గోవిందాః నమో నమః' అని జపించవలయును.

## కుబేరుని మూల మంత్రం

'ఈశావాస్యంచ గుహ్యే' గర, పట్టిశము ధరించిన కుబేరుణ్ని వ్యాపార సంస్థలోకి ప్రవేశించగానే మనస్సునందు తలచుకుంటే కుబేర ప్రీతి కలుగుతుంది. అపార ధనవంతులవుతారు.

## నవగ్రహాలకి ప్రదక్షిణ ఎక్కడ్నించి ప్రారంభించాలి?

నవగ్రహ స్తోత్రాన్ని నమో ఆదిత్యాయ సోమాయ అంటూ ప్రారంభిస్తాం. అలానే ఆదిత్యుడైన సూర్యుని



వద్ద నుంచి ప్రదక్షిణ ప్రారంభించి, మళ్ళీ అక్కడికి వస్తే ఒక ప్రదక్షిణ పూర్తయినట్టు. సూర్యగ్రహాన్ని మధ్యగా తూర్పు ముఖ దిశగా ప్రతిష్ఠిస్తారు.

## తల్లి గర్భంలో బిడ్డ ఏ విధంగా ఎదుగుతాడు?

మొదటి రోజు కలిలం అవుతుంది. అయిదు రోజులకు బుద్బుదాకారము. పదిరోజులకు రేగిపండంత. ఒక నెలకి తల, రెండో నెలకి భుజాలు, మూడో నెల పూర్తయ్యేసరికి ఆకలి దప్పికలు ప్రారంభమవుతాయి. ఆరునెలలకి మాయతో కప్ప బడతాడు. ఏడు నెలలకి జ్ఞానము కలుగుతుంది. కదలటం మొదలవుతుంది.

అప్పుడే భగవంతుడ్ని అనేక విధాలుగా గతజన్మలో చేసిన పాపాలు చెయ్యనని, మంచిబుద్ధిని ఇవ్వమని అలాగే ఈ జన్మలో ప్రవర్తిస్తానని వేడుకుంటాడు. అనేక విధాలుగా మానవజన్మ సాధించాలని సార్థకం చేసుకోవాలని కోరుకుంటాడు. పదో నెల రాగానే భూమ్మీద పడతాడు. తల్లి కడుపులోని ప్రతిజ్ఞలన్నీ మరిచిపోతాడు. మహామాయ కమ్మేస్తుంది. బుద్ధి కర్మలతో మాత్రమే ధర్మమార్గాన్ని ఎంచుకోవల్సిన పరిస్థితి వస్తుంది.

## శుభకార్యం జరగాలని భావించే వారు చేయాల్సిన స్నానము?

ఒళ్ళంతా నూనె రాసుకొని ఆపై స్నానము చేయాలి. తైలాభ్యంగనమును ఈ స్నానము మంగళరవము. శరీరం మొత్తం ఒకలాంటి వ్యాయామానికీ, మర్దనకీ లోనయి అనుకున్న కార్యం వేగం అవ్వటానికి వారికి వారే ప్రయత్నం చేసే శక్తి వస్తుంది.

## ఉత్తమమైన ఆహారమేది?

తీగ ద్వారా వచ్చే పొట్లకాయ, బీరకాయ, సొరకాయ, గుమ్మడి, చిక్కుడు, ఆకు కూరలు ఉత్తమమైన ఆహారం. కాయల ద్వారా వంకాయ, దోసకాయ, టమోటా.. ఇత్యాదివన్నీ మధ్యమాలు. ఇక అధమం... భూమిలో పండేవి. అనగా దుంపకూరలు. దుంపకూరలు ఆరోగ్యానికి ఏమంత మేలు చేయవని వైద్య శాస్త్రం శెలవిస్తోంది కూడా.

## గోరువెచ్చని నీటితో స్నానమెలా చెయ్యాలి?

తొలుత పాదములు తడుపుకొని ఆపై స్నానమాచరించాలి. అలా చేయడం వల్ల నరములకు



శక్తీ, ఉత్తేజం కలుగుతాయి. అట్లే దేహం పైనుంచి స్నానాన్ని ప్రారంభించాలి.

## కాకసత్వ స్త్రీ లక్షణము?

ఇప్పుడు చెప్పిన మాట మరుక్షణంలోనే మార్చి చెప్పేది.

ఇక్కడ మాట్లాడుతూనే నలువైపులా చూపులను సారించేది. ఎత్తు పొడవుతో, పెద్ద స్థనద్వయంతో నుండేది కాకసత్వ.

## శంఖము పూరించటమంటే?

గృహ ఆవరణలోని దుష్టశక్తులు దూరంగా పారిపోతాయి. ఆరు నెలలు పురాణ శ్రవణము వలన కలిగిన ఫలం ఒక్కసారి శంఖము పూరించినంతనే కలుగుతుంది.

## ఉత్తమోత్తమమైన కృతజ్ఞతంటే?

చేసిన మేలును గుర్తుంచుకొని, ప్రశంసించటమే పుణ్యమైన కార్యం.

తనకి చేసిన మేలుకి ప్రత్యుపకారము చేసి సంతోషపెట్టడం మధ్య పద్ధతి. ఇక ఉత్తమోత్తమమైన కృతజ్ఞతా భావం, అతను పొందిన మేలుకన్నా ఎక్కువ చెయ్యటము.

## మానవుని జీవిత ఆయుష్షు పదేళ్ళ లోపా?

నిండు నూరేళ్ళు జీవించే భగవంతుని వరమున్నా, అనేక ఆటుపోట్లతో మనిషి సగటు జీవితం డెబ్భై సంవత్సరాలే. అందులో సగభాగం నిద్రకు. మిగతా ముప్ఫయి అయిదేండ్లలో బాల్యం పన్నెండేళ్ళు, ముసలితనము పదేళ్ళు.

ఇక మిగిలిన పదమూడేళ్ళ కొంత కాలంలో జబ్బులూ, సమస్యలూ. ఆ మిగిలిన కాలమే మానవుడు నిజంగా బ్రతికే కాలం. అంత విలువైన ఆ సమయాన్ని ఎంత ధర్మబద్ధంగా గడపాలో చెప్పేందుకే మన వేదాలూ, ఉపనిషత్తులు.

## ఏ రోజుల్లో అభ్యంగనస్నానం చేయకూడదు?

శ్రాద్ధ దినములందూ, ఆది, మంగళవారములూ, పాడ్యమీ, చవితీ, షష్ఠీ, అష్టమీ, నవమీ, చతుర్దశి తిథులందు అభ్యంగస్నానం కూడదని శుక మహర్షి శెలవిచ్చారు. ఆ తిథుల్లో అభ్యంగనస్నానం చేసిన గ్రహ, నక్షత్ర ప్రభావముల వల్ల అనారోగ్య, ఈతి బాధలొస్తాయి.



## దశషోడశ దానాలేవి?

గో, భూ, తిల, హిరణ్య, రత్న, విద్య, కన్యాదాది పదహారు దానాలు షోడశదానాలు. గో, భూ, తిల, హిరణ్య, అజ్య, వస్త్ర, ధాన్య, గుడ, రౌప్య, లవణ దానాలు దశ దానాలు. మహాఋషులూ, దేవతలూ దశషోడశ దానాల్లో అన్నదానాన్ని చేర్చలేదు. అందుకే అన్నిదానాలకంటే అన్నదానం మహోన్నతమైనది.

## సకల దేవతలకే సమర్పించవల్సిన ప్రీతికరమైన నైవేద్యాలు ఇవి మాత్రమే!

- ♠ బ్రహ్మదేవునకు జావ నైవేద్యం పెట్టాలి.
- ♠ ఇంద్రునికి భక్ష్యములు నివేదించాలి.
- ♠ అగ్నిదేవునకి హవిష్యాన్నము.
- ♠ వివస్వంతునకు తేనె, మాంసమూ, మద్యము.
- ♠ శ్రీమహావిష్ణువునకు శ్రేష్ఠాన్నము.
- ♠ యమునకు తిలాన్నము.
- ♠ అశ్వినీ కుమారులకు భక్ష్యములు.
- ♠ పితృదేవతలకి తేనె, నేయితో చేసిన పాయసము.
- ♠ గౌరీదేవికి జావ.
- ♠ శ్రీమహాలక్ష్మీదేవికి పెరుగు నైవేద్యము.

- చదువుల తల్లి సరస్వతీ దేవికి త్రిమధురము.
- వరుణ దేవునకు చెరకు రసముతో చేసిన అన్నము.
- ధనరాజు కుబేరునకూ, వాని మిత్రుడు సూర్యదేవునకూ శర్కరాన్నము.
- ఋషులకు క్షీరాన్నము.
- సర్పములకు పాలు.
- సూర్య రథమునకు సర్వభూత బలి.

## భర్తను కొంగున ముడివేసుకోవటానికి ఆయుర్వేద పుస్తకాల్లోని పెట్టుమందులో ఎంత సత్యముంది?

అలాంటి పుస్తకాల్లో తెలిసీ తెలియని మిడి మిడి పరిజ్ఞానముతో మధ్యలో చొప్పించారు. ఎంతటి ఆయుర్వేద పురాతన గ్రంథాల్లో కూడా అలాంటి మందులు లేవు. స్త్రీ అంతిమ ఉద్దేశ్యాన్ని గ్రహించిన కొంతమంది చెప్పే, పెట్టే మందు మీ భర్త ఆరోగ్యాన్నీ, సంభోగనాశక్తినీ హరిస్తుంది. ఎవరో చెప్పారనీ, కాలిగోళ్ళ వేళ్ళ మందుల భస్మములని వాడితే మీకు మిగిలేది వ్యథ... చింతనలే. అందరి దృష్టిలో ఓ సర్పంలా కనిపిస్తారు.



## ఏ సంతానాన్ని దానమివ్వాలి?

పెద్ద కొడుకు తొలి సంతానము. దైవ సంతానము. చివరి కొడుకు ముద్దుల కొడుకు. జ్ఞాన సంతానము. మధ్యవాడు కామసంతానము. కాన వాడిని దత్తత ఇవ్వాలి. (వాల్మీకి రామాయణము)

## కంటి వ్యాధులున్న వారు వెండి కంచంలో తినటం ఎంత మంచిది?

ఆర్థికంగా అవకాశం లేకపోయినా కనీసం వివాహం అయిన తరువాత నుంచి లేదా ఓ వయసు దాటాకా వెండి కంచంలో ఆహారాన్ని తీసుకోవడం వల్ల నేత్రాలకు చలువ చేస్తుంది. జఠరాగ్ని పెరుగుతుంది. అన్ని వైద్యశాస్త్రాలూ వెండిని కంటికి సంబంధించిన మందుల తయారీలో వాడతారు. వెండి కంటికీ, వంటికీ, పంటికీ ఎంతో మేలు చేస్తుంది.

## దైవస్నానము అంటే?

ఎండ, వాన కలిసినప్పుడు పడే చినుకుల మధ్య స్నానము దైవస్నానము. అయితే వర్షంగా రూపాంతరం చెందేలోపు వర్షపు చుక్కలతో స్నానం చేయాలి.

## కాశీకీ, శబరిమల వెళ్ళేటప్పుడు తల్లి అనుమతి తీసుకోవాలా?

ఎంతో దూరప్రయాణం. కష్టసాధ్యమైన దీక్షాపరమైన కాశీకి వెళ్ళే ముందు పూర్వము తల్లి అనుమతి తీసుకొని ఆశీర్వాదం తీసుకుని వెళ్ళేవారు. ఈ రోజుల్లో అయ్యప్ప మాల వేసుకొనే భక్తులు తల్లి అనుమతి తీసుకొని మాల ధరిస్తే తల్లి దీవెనలతో యాత్ర సజావుగా సాగిపోతుంది.

## నిద్రలేవగానే భగవంతుని ధ్యానమెందుకు?

రాత్రి నిద్రించినప్పుడు శరీరంలోని అవయవాలన్నీ పూర్తి విశ్రాంతి తీసుకుంటాయి. ధ్వనిపేటిక కూడా శరీరంతో పాటు ఎంతో శ్రమ పడుతుంది. మనతో పాటు అదీ విశ్రాంతి తీసుకుంటుంది. ఒక్కసారి మనం లేచినా, ధ్వనిపేటిక సంసిద్ధతగా ఉండదు. అందుకే మౌన, ధ్యాన, జపం ద్వారా దాన్ని ఉత్తేజ పరచాలి.

## వైతరిణి నది ఎలా ఉంటుంది?

వంద యోజనాల వెడల్పుతో ఉంటుంది. అందులో చిక్కని రక్తం. దానితో పాటు చీముకూడా.



మహా జలచరాలు. ఒక్కక్షణం కూడా భరించలేని వాసన. ఎన్ని దీనాలాపనలు చేసినా పాపి అక్కడ తాను చేసిన పాపాలకు ఫలితము అనుభవించాల్సిందే. అందుకనే తమ వారి కోసం భువిపై వారి పేరు మీద గోదానం చేస్తారు. గోదానం చేస్తే వైతరిణి నదిని సులభంగా దాటగలరని గరుడ పురాణంలో శ్రీ మహావిష్ణువు స్వయంగా గరుత్మంతుడికి తెలియచెప్పాడు.

## చతుర్విధ దానాలంటే?

చావు భయంతో భీతిల్లే వాడికి ప్రాణఅభయం ఇవ్వటమూ, రోగాలతో రొప్పులతో నరకయాతన పడేవాడికి వైద్యం చెయ్యటమూ, పేదవారికి ఉచిత విద్యను అందించటమూ, క్షుద్బాధతో అల్లాడే వానికి అన్నదానం చెయ్యటమూ, ఇవే చతుర్విద దానాలు. ఈ దానాలు చేసిన పూర్వ జన్మ పాపాలు నశించి, ఈ జన్మలోనే సుఖిస్తారు.

## యమపురి దారెలా ఉంటుంది?

మనిషి ఆయువు తీరిన పదమూడో రోజు తర్వాత యమభటులు జీవిని యమపురికి తీసుకెళ్తారు. దారంతా ఎగుడు దిగుడులు.. ఆకలిదప్పికలు తీరే అవకాశం లేని ప్రాంతంలో అరికాళ్ళు బొబ్బలెత్తినా యమభటులు

కొరడాలతో కొట్టి నడిపిస్తారు. కనుచూపులోనే నీరుంటుంది. త్రాగబోతే చేతికందదు. మహామేఘాలు నిరంతరం వర్షిస్తుంటాయి. అయితే అవి వర్షించేది నీరు కాదు రక్తాన్ని. అలా పదిహేడు రోజుల పాటు జీవించినపుడు చేసిన పాపాలను తలుచుకొని వాపోతుంటాడు జీవుడు. ఆ తర్వాతే యమపురి మజిలీ అయిన సౌమ్యపురం చేరతాడు.

## ఏ పాపాలు ఎన్ని యజ్ఞాలు చేసినా పోవు?

పరుల ధనాన్ని చేజిక్కించుకున్న వారికీ, పరాయి వాని భార్యని ఆశించి పొందినవానికీ, ఇంటి యజమానీ లేదా పెద్దలు లేనప్పుడు పిల్లలకి చెందాల్సిన ఆస్తిని కాజేసిన వారికి ఎన్ని శ్రాద్ధాదులు పెట్టినా, ఎన్ని దానాలిచ్చినా వారి పాపాలు నశించవు. ఆ పాపాలకి శిక్ష పైలోకాల్లోనూ, ఇక్కడా అనుభవించాల్సిందే.

## ఏ సుగుణం వల్ల ఏది సిద్ధిస్తుంది?

సామర్థ్యము ద్వారా అధికారం అందుతుంది. జ్ఞానము చేత వైరాగ్యము, దానం చేత కీర్తీ, మర్యాదా... వినయము ద్వారా సంపదా లభిస్తాయి. ప్రియ పలుకుల ద్వారా మంచి మిత్రులూ, భక్తి ద్వారా భగవంతుని ఆశీర్వాదమూ అందుతాయి.



## అమృతా సద్గుణా పత్నీ అంటే?

సకల సుగుణ గుణములున్న భార్య గల భర్తకి గృహమే స్వర్గ సీమ అని.

పురుషునికి ఇలలో స్వర్గాన్ని అనుభవించే అవకాశం భార్య వల్లే సాధ్యపడుతుంది.

## ఏవి చేయకూడదు? ఏవి చేయాలి?

- ♠ గడప ఇవతల నుంచి భిక్ష వెయ్యకూడదు.
- ♠ కర్పూరాన్ని ఎండాకాలంలో దానమివ్వకూడదు.
- ♠ మీ శ్రీమతితో చెప్పకుండా భోజనానికి ఎవర్నీ పిలవకూడదు.
- ♠ శుభానికి వెళ్తున్నప్పుడు స్త్రీలు ముందుండాలి. అశుభానికి స్త్రీలు వెనకుండాలి.
- ♠ ఉదయం పూట చేసే దానకార్యాలు ఎక్కువ ఫలాన్నిస్తాయి.
- ♠ అమంగళాలు కోపంలోనూ, ఆవేశంలోనూ కూడా ఉచ్చరించకూడదు. తదాస్థు దేవతలుంటారు.
- ♠ పెరుగును చేతితో చిలికి మజ్జిగ చేయరాదు.
- ♠ పిల్లి ఎదురొస్తే కొన్ని నిమిషాలు ఆగి బయలు దేరాలి. కుక్క ఎదురొస్తే నిరభ్యంతరంగా ముందుకు సాగాలి.
- ♠ చూపుడువేలితో బొట్టు పెట్టుకోరాదు.

♠ పగలు ధనాన్ని సంపాదించాలి. రాత్రి సుఖాలను పొందాలి.

## ఏ తుమ్ము శుభప్రదమైనది?

♠ ఒంటి తుమ్ము మంచిది కాదు.

♠ కూర్చునేటప్పుడూ, కొత్త వస్త్రాలను ధరించేటప్పుడూ, భోజనానికి ముందూ, పంటపొలాల్లో విత్తనములు చల్లేటప్పుడూ, పెళ్ళి సమయాల్లో తుమ్మిన తుమ్ము శుభకరము.

## బాదం ఆకులో భోజనం వల్ల ఏ ఫలం వస్తుంది?

ఆహారం అరగక మలబద్ధకంతో బాధపడేవారు, తగు సంబంధిత వ్యాధులున్న వారు బాదం ఆకులో భోజనం చెయ్యటం ద్వారా జీర్ణశక్తి కలగడంతో పాటు ఆరోగ్య లాభం కలుగుతుంది.

## మహిళలు ఎంతటి తెలివిగలవారు?

స్త్రీలు శారీరకంగా ప్రకృతి పరంగా బలహీనులయితే అయ్యారేమో కాని, మేథస్సులో కాదు. ఎంతటి చిక్కు ముడులనైనా తీయగల సమర్ధత గల తెలివితేటలు మగవారికంటే ఎక్కువుంటాయి. డెబ్భై, అరవై, ఎనభై మొ॥ చుక్కలు పెట్టి ఎక్కడా తడబడకుండా అలవోకగా



అందంగా ముగ్గులు పెట్టేస్తుంటారు. అంత ఏకాగ్రత మగవారికుండదు. అందుకే పెద్ద పెద్ద సంస్థల సి.ఇ.ఒలు మహిళలే.

## ఈ భూమికి మహాప్రళయం ఎప్పుడు?

కృతయుగమూ, త్రేతాయుగమూ, ద్వాపర యుగమూ, కలియుగమూ. ఈ యుగాల మొత్తం నలభై మూడు కోట్ల, పన్నెండు లక్షల సంవత్సరాలు. దాన్ని మహాయుగమంటారు. అలాంటి మహాయుగాలు వేయి గడిస్తే బ్రహ్మదేవునకు ఒక పగలు మాత్రమే. అలాగే మరో వేయి మహాయుగాలు గడిస్తే ఒక రాత్రి. ఆ పగలూ, రాత్రి పూర్తయితే వచ్చేదే మహాప్రళయం. కాన బ్రహ్మ దేవునికి ఒక పగలు కూడా ఇంకా పూర్తవ్వలేదు. దాని గూర్చి ఆలోచనలు అనవసరము.

## తల్లినీ, తండ్రినీ, పెద్దలనూ ధిక్కరించి చులకన చేస్తే?

సమవర్తి ప్రళయకాలపు మేఘగర్జనలతో జీవిని మండుతున్న రాగినేల మీద పరుండబెట్టి నిప్పులు చల్లే సూర్యుడి ద్వారా పైనా క్రింద మాడ్చి మాడ్చి యాతనలు పెట్టిస్తాడు.

## బంగారు వంకీలు ధరించటంలో పరమార్థం?

ముక్కుపుడక ద్వారా శ్వాసకు మరియు నాసికకు సంబంధిత వ్యాధులు, చెవి దిద్దుల వల్ల చెవుల్లో చీము ఇత్యాదివి రావో ధగధగలాడే వంకీలు ధరించటం వల్ల అందంతో పాటు రెండు భుజాల నరాలకీ ఉత్తేజము, రక్తప్రసరణ జరిగి రోజు వారి పనులు చేసుకోవటానికి మరింత శక్తీ, ఉత్సాహం వస్తుందని మన పెద్దలు వంకీలనే పేరుతో మహిళలకి వ్యాయామాన్ని ఇస్తున్నారు. అలానే వంకీలు రెండు చేతులకీ ఉండటం వల్ల ఓ మోస్తరు అందంగా ఉన్న పడతి కూడా వంకీలు వల్ల మహా అందగత్తెవుతుంది. అవి ధరించి శుభకార్యాల్లో నలుగురి దృష్టిని ఆకర్షించటం ద్వారా త్వరగా వివాహమవుతుంది.

## వన్యప్రాంతాల్లో ఋషులెందుకు నివాసం ఏర్పరుచుకుంటారు?

నల్లచారలుగల జింకలు సంచరించే ప్రదేశాన్ని ఎంచుకొని ఆశ్రమం కట్టుకొని తపస్సు చేసేవారు. అలాంటి జింకలు సంచరించే ప్రాంతమంతా పుణ్యభూమి. ఆ ప్రదేశంలో యజ్ఞాలూ, యాగాలూ, ఏ



ధర్మకార్యాలూ చేసినా ఎటువంటి విఘ్నాలు లేకుండా ఫలప్రదం అవుతాయి. అలాంటి ప్రదేశంలో దేవతలూ, పుణ్యఋషులూ సదా సంచరిస్తుంటారు. పూర్వము రాజాధిరాజులు అలాంటి ప్రదేశాల్లోనే యజ్ఞ యాగాదులు చేసేవారు.

## విషబాధలు గల రోగులు మహాశివుణ్ణి ఎందుకు ప్రార్థిస్తారు?

క్షీర సాగరమును మథించటంలో వచ్చిన హాలాహలాన్ని శివుడు మింగి కంఠంలో ఉంచుకున్నాడు. అంతటి విషాన్ని స్థంభింపచేసిన శివుడిని తమకున్న విషరోగాలు అరికట్టే శక్తి గలవాడని భక్తులు నమ్ముతారు. శివా, పరమేశ్వరా అన్న ధ్యానజపం వల్ల శరీరంలో ఎన్నో మార్పులు జరిగి ఉత్సాహం, ఉత్తేజం వస్తుంది.

## అత్తగారింట ఏ వైపు తలపెట్టి నిద్రించాలి?

- ♠ గృహంలో నేలమీద పడుకుంటే సంభోగశక్తి వృద్ధి అవుతుంది.
- ♠ మంచంపై పడుకుంటే వాతపిత్త దోషాలను సరిచేస్తుంది.

♠ మెత్తని దూది మంచంపై పడుకుంటే మనస్సు హాయిగా ఉంటుంది.

♠ విరిగిన పక్కపై పడుకుంటే అనేక దీర్ఘవ్యాధులు బైటపడతాయి.

♠ స్వంత ఇంట్లో తూర్పు వైపూ, అత్తగారింట ఉత్తరం వైపూ, బంధువుల ఇంట మరియు తీర్థయాత్రా సమయాల్లో పడమర వైపూ తలపెట్టుకొని నిద్రించాలి.

## ఏ ఋతువుల్లో ఏ వస్త్రాలు ధరించాలి?

భావప్రకాశంలో పట్టువస్త్రాన్నీ, ఉన్ని వస్త్రాన్నీ, ఎర్రటి రంగు వస్త్రాలనీ శీతాకాలం ధరించమనీ, తెలివి తేటలని పెంచే కాషాయవస్త్రాలనూ ఎండాకాలంలో ధరించమనీ...

ఏ కాలమందైనా తెలుపుబట్టలు మనసుకు హాయినిస్తాయనీ, అన్నింటికీ మించి ఖద్దరు స్త్రీ పురుషులిరువురికీ బ్రహ్మాండమైన ఆరోగ్యాన్నిస్తాయని శెలవిస్తోంది.

అందమైన వస్త్రాలు, ఆడంబరాలను చూపించటంతో పాటు అహాన్నీ, పొగరునీ పెంచుతాయని మానసిక శాస్త్రం చెబుతోంది.



## వ్యభిచరిస్తే నరకంలో యముడు ఏ శిక్ష విధిస్తాడు?

మండుతున్న నిప్పు స్థంభానికి జీవిని కట్టి పిడికిళ్ళతో, కాళ్ళతో, ఇనుప గుదియలతో గుద్ది గుద్ది చిత్రహింస చేయిస్తాడు.

పాపి అయ్యో! తెలియక ఎంత పాపము చేసితిని అని విలవిలలాడితే వచ్చే కన్నీరుతో ఆ అగ్ని ఆగిపోయేవరకూ హింస తప్పదు. ఎర్రగా కాలే రాగి పురుషుని విగ్రహాన్ని స్త్రీతో కౌగిలించుకునేలా చేసి, అలాగే పురుషుడ్నీ స్త్రీ రాగి ప్రతిమను కౌగిలించుకునేలా చేసి కొరడాతో చిత్రహింస చేస్తారు.

## దుర్మార్గులూ, స్త్రీ మానస చోరులూ ఎలా జన్మిస్తారు?

ప్రకృతి స్త్రీ స్థానమూ, పురుష స్థానమూ శృంగారంలో నిర్ణయించింది. దాన్ని కాదని ముందూ వెనకా, నుల్చొనీ, కూర్చునీ, ఒంగోనీ, ఇలా కామ కోరికలు తీర్చుకోవటం ద్వారా శృంగార సుమధుర భావప్రాప్తి పోయి విచ్చలవిడితనం ఇద్దరిలో వస్తుంది. ఆ భావాలతో కలిసిన వారికి పుట్టే పిల్లలు అలాగే తయారవుతారు.

## పెళ్ళిలో ఎవరు ముందు జీలకర్ర పెడతారో వారి మాటే చెల్లుతుందా?

మనుష్యుల శరీరంలో విద్యుత్ దాగి ఉంటుంది. అదే జీవశక్తి. వివాహ సమయంలో ఎవరు ముందుగా జీలకర్ర, బెల్లం తలపై పెడతారో వారిశక్తి అవతల శక్తిపై పడుతుంది. ఆ ప్రవాహశక్తి జీవితాంతము పని చేస్తుంటుంది.అందుకే కొంతమంది ఇంట ముందుగా జీల్లకర్ర, బెల్లం పెట్టిన వారిమాటే చెల్లుబాటు అవుతుంది. సాంప్రదాయంగా అయితే పెళ్ళి కూతురితో ముందు పెట్టిస్తారు.

## ఋషులు కమండలంలోని నీళ్ళు చల్లి శపించేదెందుకు?

ఎంతటి శక్తినయినా ఇముడ్చుకోగల శక్తి గలవి ఈ భువిపైన మూడే. అవి జలమూ, విభూదీ, రుద్రాక్ష. మునులు తమ తపశ్శక్తిని కమండంలోని జలంలో ఉంచుతారు. అందుకే వారు కోపమొచ్చినా, వరమివ్వదలచినా కమండలంలోని తమ తపఃశక్తి అనే జలాన్ని మంత్రించి చల్లుతారు. జలంలోని పుణ్యశక్తి వల్ల వారన్నది అక్షరాలా జరుగుతుంది.



## ఆలయాల్లో వేదస్నానగుండం ఉండేదెందుకు?

అపరిశుభ్రంగా, దేవాలయంలోకి ప్రవేశించ కుండా ఉండేందుకు నిర్మించారు. ఉత్సవాల సందర్భాలలో దేవతా విగ్రహాల చక్రస్నానము వలన పుష్కరిణి మంత్ర ప్రభావం చెందుతుంది. యోగులూ, సిద్ధులూ స్నానమాచరించిన తరువాత పుష్కరిణిలో ఏడుమునకలు వేసి తొలుత వీపూ, ఆపై ముఖమూ, తలా... వరుసగా తుడుచుకోవాలి. ఒడ్డుకు వచ్చి విభూది, కుంకుమ ధరించి దైవదర్శనము చేసుకోవాలి. సామాన్యులు కూడా ఈ విధంగా చేయటం వల్ల స్వామి కృప కలుగుతుంది.

## బంగారు కంచంలో తింటే ఆయుష్షు పెరుగుతుందా?

రాజులూ, చక్రవర్తులూ, జమీందారులూ బంగారు కంచంలో భోజనం చేసేవారు. ఆయుర్వేద పరంగా కూడా ఆ విధంగా భోజనం చేయటం వల్ల శరీరంకాంతితో పాటు వీర్యవృద్ధి పెరుగుతుంది. అన్నింటికీ మించి ఆయుష్షు పెరుగుతుంది. అందుకే స్తోమత లేకపోయినా వెండికంచంలో చిన్న బంగారు పువ్వు వేసుకొని సరిపెట్టుకుంటారు.

## ఎప్పుడు గర్భవతి అయితే ఎలాంటి బిడ్డలు కలుగుతారు?

ఋతుమతి అయిన నాల్గవరోజు గర్భం ధరిస్తే ఆయుష్షు తక్కువవాడూ లేదా ధనము లేనివాడూ అవుతాడు.

అయిదోరోజు గర్భం ధరిస్తే పుట్టే పుత్రికా అంతే. ఆరూ లేక ఏడు రోజులలో గర్భవతి అయితే కష్టాలు పడేవారూ, ఎనిమిదీ తొమ్మిదో రోజు గర్భం ధరించిన వారికి మహా ధనవంతులు జన్మిస్తారు.

పదవరోజు అందరికి పేరు తెచ్చేవారూ, పదకొండోరోజు గర్భం ధరిస్తే పుట్టే శిశువు నలుగురి నోళ్ళలో నానేదిగానూ, పన్నెండున పుత్ర ఫలము మహాపేరు ప్రఖ్యాతులను తెచ్చిపెట్టును.

పదమూడోరోజు తల్లీ తండ్రికీ కష్టములు తెచ్చి పెట్టువారూ, పధ్నాలుగో రోజు వందలాది మందిని శాసించగలవారూ.

పదిహేనో రోజు గర్భం ధరించినచో మహా భోగాలను అనుభవించేవారూ, పదహారవ రోజున గర్భం ధరించిన వారికి పుట్టే బిడ్డలు తామే కాక తమ చుట్టూ ఉన్న వార్ని కూడా సుఖించేలా చేస్తారు.



## నిద్రరానివారు గోరింటాకు తలక్రిందెందుకు పెట్టుకుంటారు?

కాళ్ళూ, చేతులకీ గోరింటాకు పెట్టుకునేది అందంకోసమూ, గోళ్ళ సంబంధిత వ్యాధులను దూరం చేసి అందంగా ఉంచేందుకు కూడా. నిద్రలేమితో బాధపడేవారు గోరింటాకు పువ్వులను పక్కమీద చల్లుకోవటం ద్వారా, గోరింటాకు కట్టిన మూటను తలక్రింద పెట్టుకోవటం ద్వారా చక్కటి నిద్ర వస్తుంది. గోరింటాకు రసముతో తలను మర్ధిస్తే పలచగా ఉన్న వెంట్రుకలు గట్టి పడతాయిని ఆయుర్వేద శాస్త్రం శెలవిస్తోంది.

## చెడుసావాసాలు వద్దు అని పెద్దలు మందలించేదెందుకు?

ఎంత ధర్మబుద్ధులు నేర్చినా, చెడు ప్రవర్తన కలిగిన వారితో ఉంటే, మన మంచి బుద్ధి వారికి అంటకపోగా, వాడి అధర్మబుద్ధి మనకు అంటుతుంది. భీష్ముడు సకల ధర్మశాస్త్రాలనూ, ధర్మాలనూ చెప్పి ఆచరించినా దుర్యోధనుడి సభలో ద్రౌపది చీర లాగుతుంటే చూస్తుండిపోయాడు. అందుకే శ్రీకృష్ణుడంటాడు ... కత్తితో కలిసినందుకు అగ్నికి సమ్మెటపోటు తప్పదని.

## దీర్ఘాయుష్మంతునిగా భర్త ఉండాలంటే?

నక్షత్రాణి చ సర్వాణి యజ్ఞాశ్చైవ పృథకృథక్
అశ్వీన్యామశ్వినా విష్ట్యా దీర్ఘాయుర్జాయతే నరః

అశ్వినీ నక్షత్రమందు అశ్వినీ దేవతలను పూజించాలి. అలాగే రుగ్మతలతో బాధపడేవారూ, పీడింపబడేవారూ తొందరగా ఉపశమనాన్ని పొందగలరు.

## గంపలో పెళ్ళికూతురిని ఉంచి తెచ్చేదెందుకు?

శ్రీమహాలక్ష్మి తామరపువ్వులో ఉంటుంది. అందుకే మా ఇంటి మహాలక్ష్మిని గంప అనే తామరపువ్వులో తెచ్చి నీ కిస్తున్నాము అని భావము.

## జింక చర్మము మీద గతంలో తపస్సు చేసేవారెందుకు?

వేదాలలోని ఋగ్వేదము రంగు తెలుపు. సామవేదము రంగు నలుపు. ఆ రెండు వేదాల రంగులే పగలూ, రాత్రి. అందుకనే పూర్వము ఆ వర్ణాలు గల జింక చర్మము మీద తపస్సు చేసేవారు. జింక చర్మం మీద తపస్సు అనేక వ్యాధులను దూరం చేస్తుందని ఆయుర్వేద శాస్త్రాల సారాంశము.



అయితే జింకచర్మము మీద తపస్సు చాలా పెద్ద నేరం ఈ కాలంలో.

ఆ రోజుల్లో కాలం చెల్లిన జింక చర్మాలను మాత్రమే ఋషులు ఉపయోగించేవారు.

## ఆహారం తీసుకునేముందు దైవ ప్రార్థన చెయ్యటమెందుకు?

ధ్యాన మంత్రాక్షరాలకు అపూర్వమైన శక్తి ఉంది. ధర్మంగా సంపాదించని ధనము చేత ఆహారం కొన్నదికాకపోయినా, మురికి గుంటల పక్కనా, పండించకూడని ప్రదేశాల్లో పండించిన ఆహారమూ విషతుల్యమగును. అందుకే ప్రార్థన ద్వారా కొంత అయినా ఆహారాన్ని అమృతమయం చేసుకొనుటకు తప్పని సరిగా దైవప్రార్థన చేసి భోజనానికి ఉపక్రమించాలి.

## పురుషుల్లో పుణ్య పురుషులు వేరయా ... అంటే?

♠ తన క్షేమములకంటే తనవారి క్షేమములను నిరంతరమూ చూసేవాడు ఉత్తమ పురుషుడు.

- తనకి వచ్చిన ఫలంను బట్టి ప్రత్యుపకార ఫలాన్నిచ్చు వాడు మధ్య పురుషుడు.
- తన సుఖం కోసం, తన వ్యసనాల కోసం కుటుంబాన్నీ, తన వారినీ నాశనము చేయువాడు అధమ పురుషుడు.
- తనకున్న దుర్గుణాల ద్వారా తనూ, తన వారినీ పాడు చెయ్యటమేకాక, ఏ సంబంధం లేని వార్ని కూడా మాయప్రలోభాలతో ఆ వైపు మళ్ళించువాడు అధమాధమ పురుషుడు.

## చిరకాల మిత్రునిగా నిలిచిపోవాలంటే?

- స్నేహితునితో లేనిపోని విషయాలపై అనవసర విషయాలపై వాదులాడరాదు.
- డబ్బు విషయంలో ఇచ్చి పుచ్చుకునే వ్యవహారం నిక్కచ్చిగా నలుగురి మధ్యన చేసుకోవాలి.
- ఎట్టి స్థితిలోనూ మిత్రుడి భార్యతో వంటరిగా మాట్లాడరాదు.

## ఆజ్ఞాచక్రాన్ని ఎలా పూజించాలి?

కనుబొమల మధ్య ఉంటుంది. గాయత్రి మంత్రం చదివేటప్పుడు వచ్చే పద్దెనిమిదో అక్షరం 'యో' భూమధ్యని సూచిస్తుంది. నరములకు కేంద్రమైనదీ,



జ్ఞాపకశక్తి నిచ్చునదీ అయిన ఈ ఆజ్ఞాచక్రాన్ని కుంకుమ ధరించటం ద్వారా, విభూది ధరించటం ద్వారా పూజించినట్టే. అలా చేయుట వల్ల తల పైభాగములోని నరములతో కలిసే అక్కడి నరములు జ్ఞాపకశక్తిని వృద్ధి చేస్తాయి.

## ఇవన్నీ ఇలా చెయ్యటం చాలా అనారోగ్యము?

- స్నానమప్పుడు కాలిమీద కాలు పెట్టి రుద్దు కోవటము. శరీరాన్ని రుద్దుకున్నట్టే కాళ్ళను చేతులతోనే రుద్ది శుభ్రపరుచుకోవాలి.
- దాన, దైవ, పూజ, జప, హోమ సమయాల్లో అంచులేని వస్త్రాలని ధరించకూడదు.
- పురుడప్పుడూ, సంక్రాంతి పర్వదినాల్లో, శ్రాద్ధములప్పుడూ, తమ తమ పుట్టిన రోజునాడూ వేడి నీటి స్నానాలు చేయరాదని శాస్త్రాలు తెలవిస్తున్నాయి.
- స్త్రీ వాడిన దుస్తులు పురుషులూ, పురుషులు వాడిన దుస్తులు భార్యా భర్తలైనా వాడరాదు.
- కంచు పాత్రలో పాలూ, కొబ్బరి వంటివి తీసుకోకూడదు.
- ఆదివారం ఉసిరి పచ్చడి తినరాదు.

- భోజనమప్పుడు నేతిని పదార్థములపై కాకుండా వేడిచేయరాదు.
- రసం వంటి వాటి మధ్యా, పాయసమప్పుడూ, మజ్జిగ, పెరగన్నమప్పుడూ నీళ్ళు త్రాగరాదు.
- వాకిట్లో ఉదయం, సాయంత్రం నీళ్ళు చల్లి ముగ్గులేస్తే లక్ష్మీదేవి అనుగ్రహిస్తుంది.
- వినే వాళ్ళున్నారుగదాని తెలీని వాటికి తమ తెలివితేటలు కలిపి చెప్పి నమ్మించరాదు.
- ఆవూ, గేదె పదకొండు రోజులలోపు పాలు తీసినవాడూ, వాడినవాడు
- భర్తనొదిలేసి ముక్కోటి దేవతలకు పూజ చేయ కూడదు.
- ధూపం లేకుండా పూజ చేయరాదు.
- ఆలయంలో ప్రదక్షిణలు చేసేటప్పుడు గర్భాలయ వెనుకభాగాన్ని తాకరాదు.
- భోజనం తర్వాత చేతిని నాకరాదు.
- అన్నం ఉడికేటప్పుడు మౌనంగా ఉండాలి.
- ఒక గాజు ధరించకూడదు.
- స్త్రీకి సహజంగా ఉండాల్సిన ఆభరణాలు అనగా ముక్కుకీ, చెవులకీ, మెడలో ఏమీ లేకుండా భర్తకీ, సాటి స్త్రీలకూ కనిపించకూడదు.



- మంగళ, శుక్రవారాలు సముద్ర స్నానం చేయరాదు.

## స్త్రీలు సుందరకాండను ఎందుకు పఠించకూడదంటారు?

రామాయణంలో భాగమైన సుందరాకాండ ఒకటికి పలుమార్లు చదవవచ్చును.

సుందరకాండ పఠించకూడదని చెప్పింది, అందులో గాయత్రీ మంత్రము ఉండటం వల్ల, గాయత్రి పఠించుట వల్ల స్త్రీ గర్భాశయంపై దుష్ట ప్రభావం చూపిస్తుందని.

## తాంబూలాన్ని ఎవరు వేసుకోకూడదు?

పంటిజబ్బులున్నవారూ, ఆకలిగలవారూ, కంటి రోగాలున్నవారూ, పళ్ళు బలంగా లేనివారూ, విరోచనములకు మందులు వాడేవారూ తాంబూలము సేవించవద్దని ఆయుర్వేదము శెలవిస్తోంది. అలాంటి వారు వేసుకున్నచో కంటిచూపు తగ్గుతుంది, జుట్టు పలచబడుతుంది.

దంతాలలో శక్తి తగ్గుతుంది. శరీరంలో శక్తి సన్నగిల్లుతుంది.

## ఉదయం లేవగానే చెయ్యాల్సిన భూ ప్రార్థన?

సముద్ర వసనే దేవీ పర్వ స్తనమండలే
విష్ణు పత్ని నమస్తుభ్యం పాదస్వర్శాం క్షమస్వమే

ఈ ప్రార్థనను ధ్యానించి, మనసులో స్మరించి పడుకున్న మంచము దిగకుండానే భూమిపై తొలుత చేతులు ఆన్చి, ఆపై కాళ్ళను భూమిపై పెట్టాలి.

## భగవంతుడు కామాన్ని ఎందుకు పెట్టాడు?

మహా అప్సరసల్ని భగవంతుడు సృష్టించినది మానవుడి బుద్ధిని తెలుసుకోవటానికే. ధర్మమార్గంలో కామాన్ని పొంది తనని చేరుకుంటాడో, కామాన్ని స్వాధీనంలో ఉంచుకొనక పశువుగా మారి రాక్షసుడవు తాడోనని పెట్టిన అతి పెద్ద పరీక్షే కామము. స్త్రీ వ్యామోహం అన్ని వ్యసనములకన్నా భయంకరమైనది. నాశనం చేసేది.

## ఆవుపాలు ఎంత శ్రేష్ఠమైనవి?

మూడు ప్రొటీనులూ, ఆరు విటమినులూ, ఇరవై అయిదు ఖనిజాలు గల ఆవుక్షీరము ధారణశక్తి కలిగి



ఉంటుంది. శ్వాససంబంధిత వ్యాధులను తొలగిస్తాయి. స్తన్యములను వృద్ధి చేయును. శరీరానికి కాంతినీ, ఇంద్రియములకు నిర్మలత్వాన్నీ ఇస్తాయి. వృద్ధులకూ, రోగాల బారిన పడినవారికీ, తల వెంట్రుకలలో బలము తగ్గిన వారికి అమృతతుల్యమైనవి ఆవుపాలు.

## ఆచమనములో మూడు ఉద్ధరిణిల నీటి పరమార్థం ఏమిటి?

మనిషి శరీరంలో నిరంతరం విద్యుత్ ఉంటుంది. గోకర్ణాకారంలో ఉంచిన అరచేతిలో మినప గింజ మునిగేంత తక్కువగా తీసుకునే నీరు విద్యుత్‌ని గ్రహించి, ఆచమనం చేయగానే నోటిద్వారా ప్రవేశించి నరములనూ, స్నాయువులనూ ఉత్తేజాన్ని చేస్తాయి. అలాగే కేశవాయస్వాహా అనగానే కుత్తుక, నారాయ ణాయస్వాహా అనగానే నాలుకా, మాధవాయస్వాహా అనగానే గ్రంథులూ మనిషి జీవన విధానానికి, బ్రతుకుకి సంబంధించి ఆ మూడు ఒకలాంటి వ్యాయామానికిలోనై జీవన చక్రాన్ని నడిపిస్తాయి.

## ఎర్రరంగుతో ఉన్నది కుంకుమకాదు!

పసుపు కొమ్ములు, నిమ్మరసమూ, పటికల సమ్మేళనాలతో తయారు చేసేదే కుంకుమ. అలాంటి

కుంకుమని ఎడమ అరచేతిలోకి తీసుకొని కుడిచేతి ఉంగరపు వేలితో ధరించాలి. పాదరసంతో చేసే క్రీములూ, చేపల పొలుసుల ద్వారా చేసే పెదాల అద్దకాల వల్ల అందంకంటే అనారోగ్యమే వస్తుంది.

## వేదాలూ, ఉపనిషత్తులను చేతులతో తాకి కన్నులకు అద్దుకోమని ఎందుకు చెప్పారు?

మన వేళ్ళ కొసలయందు శ్రీమహాలక్ష్మీ దేవి ఉంటుంది. మన అరచేతిలో సరస్వతి ఉంటుంది. అందుకే అరచేయి, వేళ్ళు కన్నులకు తగిలేలా అద్దుకోవాలి. అరచేతి మొదట శ్రీమహావిష్ణువు ఉంటాడు కావున వేళ్ళూ, అరచేతి మొదలూ, అరచేయి మూడింటినీ కనులకు తగిలేలా అద్దుకుని స్మరించాలి.

## ఇంట్లో గాలీ, ధూళీ ఉంటే తులసి చెట్టు ఎండిపోతుందా?

జాతకపరంగా, గృహపరంగా దోషాలుంటే తులసి చెట్టు ఎండిపోతుంది. అలాగే మొక్కుకున్న మొక్కులు తీర్చకున్నా తులసి ఎండిపోతుంది. కాన నిత్య తులసీ పూజ, దైవ పూజ ద్వారా దోషాలు పోగొట్టుకోవచ్చు.



## బ్రహ్మస్నానము ఎలా చేయాలి?

తీర్థయాత్రలు చేస్తున్నప్పుడూ, ఇంకా అనేక సమయాలప్పుడు స్నానం చేసి దర్శనము చేసుకునే వీలుండదు. అలాంటప్పుడు పద్మపురాణంలో చెప్పిన బ్రహ్మస్నానం చేసి దర్శించుకోవాలి. ఉద్ధరణిలో పట్టేంత నీరు అరచేతిలో తీసుకొని ఇష్టదైవాన్ని ప్రార్థించి విద్యుత్ కేంద్రమైన మన శిరస్సుపై శరీరం మీద కూడా పడేలా చిలకరించుకోవాలి. అరచేతిలో తీసుకున్న నీరు విద్యుత్‌ను గ్రహించి, శరీరంలోని ఎక్కువ తక్కువలుగా ఉన్న విద్యుత్‌ను సమం చేసి దేహాన్ని చక్కటి స్థితికి స్నానము చేసినంత కాకపోయినా ఎంతో కొంత తెస్తుంది.

## దేవాలయం నుంచి వచ్చాక స్నానం చెయ్యకూడదా?

మనం సహజంగా స్నానం చేసేది ఉదయం, సాయంత్రం. ఎవరైనా చనిపోయిన వార్త విన్నప్పుడూ, శ్మశానమునకు వెళ్ళి వచ్చాకా తప్పక స్నానం చేయాలి. అయితే దేవాలయం పవిత్రమైన ప్రదేశము. వచ్చి స్నానం చేస్తే ఆ పవిత్రత పోతుంది. ఏ కారణంగానూ దేవాలయానికి వెళ్ళి వచ్చి స్నానం చెయ్యకూడదు.

## దైవధ్యానం ఎలా చెయ్యకూడదు?

ఆవులిస్తూ, పక్కవారికి సమాధానాలను సైగలతో చెబుతూ, పిల్లలని లేదా పనివాళ్ళని అరుస్తూ దైవధ్యానం చెయ్యకూడదు. ధ్యాన జపాలు చేస్తున్నప్పుడు ఏ ఉద్దేశ్యంతో చేస్తున్నామో ఆ ఉద్దేశ్యమే మనసా వాచా నిండి ఉండాలి. ఇంకా శవం వద్దా, స్మశానం వద్దా జపాదులు చేయరాదు.

## ఈ స్త్రీ కూడా పతివ్రత క్రిందే వస్తుంది?

- ♠ తెలిసీ తెలియని వయసులో మాటలకి లొంగి పోయిన ఆడది.
- ♠ ప్రేమ పేరుతో, పెళ్ళి పేరుతో మోసపోయిన ఆడది.
- ♠ భయపెట్టి, ఆయుధం చూపించి ప్రాణభయం కలుగచేసి లొంగదీసుకున్న ఆడది.
- ♠ భర్త, పిల్లల ప్రాణరక్షణ కోసం తల వూపిన ఆడది.
- ♠ ఇష్టం లేకున్నా, కొట్టి, తిట్టి, రక్కి, బంధించి కోరికలను తీర్చుకోబడిన ఆ స్త్రీకి ఎటువంటి దోషమంటదు.

## స్నానబట్టను ఎలా వదలాలి?

చక్కగా స్నాన విధి అయ్యాక ఆ బట్టను పొడిబట్ట కట్టుకుంటూ క్రిందకి వదిలివేయాలి. దాన్ని పైనుంచి



తీసి మెడపై వేసుకోరాదు. తద్వారా పోయిన మలినము తిరిగి శరీరాన్ని చేరతాయి. అలానే ఆ బట్టను ఎవరికి వారే పిండి ఆరవేయాలి. దానికి కారణం శరీరం ద్వారా బైటికెళ్ళిన మలినాలు తడి బట్టను అంటిపెట్టుకుని ఉంటాయి. దాన్ని అలాగే ఉంచినా, చుట్టు పక్కల వ్యాపించి అనారోగ్యం కలుగచేస్తాయి. అందుకే వెంటనే పిండి ఆరవేయమని పెద్దలు చెప్పారు.

## 'కృష్ణ, కృష్ణ, కృష్ణ' అని తలుస్తే?

అట్లు మూడుసార్లు జపిస్తే ఎంతో పుణ్యం, ప్రతినిత్యమూ పఠిస్తే పదివేల యజ్ఞాలు చేసినంత ఫలం. అందుకే పెద్దలు ప్రతి మాటకు కృష్ణా, రామా అంటారు.

## ధగ ధగ మెరిసే బంగారు వడ్డాణం కేవలం వైభోగమే కాదు?

మహిళలు వడ్డాణము ధరించి ఆనందంగా, వైభోగంగా శుభకార్యాల్లో తిరుగుతుంటారు. వడ్డాణం ధరిస్తే వచ్చే అందం వెనుక, అలంకరణ వెనుక మన పెద్దవారు స్త్రీ ఆరోగ్య లోపాలను గుర్తించి వడ్డాణము అనే అలంకరణ ఏర్పరిచారు. దోషరహిత రత్నాలతో వడ్డాణము ధరిస్తే పుట్టే పిల్లలు పొట్టిగా పుట్టరు. గర్భకోశంలోని లోపాలు కూడా సరవుతాయి. దానికి

తోడు నడుం సన్ననై భర్త దృష్టిలో అందమైన సుందరైన భార్యని పొందాననే గర్వం కూడా కలిగిస్తుంది వడ్డాణము.

## ఏ సంవత్సరం ఎక్కడ పుష్కరం... పుష్కర పరిధి గల ప్రాంతము?

గురుడు ఒక్కొక్క రాశిలో ఒక్కో సంవత్సరం ప్రేవశించు కాలమున ఒక్కొక్క నదికి పుష్కరమొస్తుంది.

పుష్కర సమయంలో స్త్రీలు నదీమ తల్లికి పూజలు చేసి తమ సౌభాగ్యాన్ని చల్లగా చూడమని కోరు కుంటారు.

దంపతులు ఇరువురు కలిసి దానాలిస్తారు. పురుషులు పితృదేవతలకు తర్పణాలు వదులుతారు. అయితే పుష్కర సమయంలో నది పరిధి ఎంతవరకు అన్నది పంచాంగ శాస్త్రము ప్రకారము –

## బృహస్పతి మేషములో ప్రవేశించిన?

మేషములో ప్రవేశించినప్పుడు గంగానదికి పుష్కరము వస్తుంది. గంగోత్రి నుండి కలకత్తా వద్ద తూర్పు సముద్రములో కలిసేంతవరకూ పరీవాహక ప్రాంతము.



## బృహస్పతి వృషభములో ప్రవేశించిన?

వృషభములో ప్రవేశించినప్పుడు రేవా(నర్మద) నదికి పుష్కరము వస్తుంది. వింధ్య పర్వత ప్రాంతము నుండి పశ్చిమ సముద్రములో కలిసేంతవరకూ పరీవాహక ప్రాంతము.

## బృహస్పతి మిధునములో ప్రవేశించిన?

మిధునములో ప్రవేశించిన సరస్వతీ నదికి పుష్కరము వస్తుంది. సరస్వతీ నది అంతర్వాహిని. కురుక్షేత్రము గుండా అలహాబాద్‌లో గంగా యమునలతో కలిసేంతవరకూ పరీవాహక ప్రాంతము.

## బృహస్పతి కర్కాటకములో ప్రవేశించిన?

కర్కాటకములో ప్రవేశించిన యమునా నది పుష్కరము వస్తుంది. జమునోత్రి నుండి అలహాబాద్‌లో గంగతో కలిసేంతవరకూ పరీవాహక ప్రాంతము.

## బృహస్పతి సింహములో ప్రవేశించిన?

సింహములో ప్రవేశించిన గోదావరి పుష్కరములు వస్తాయి. నాసిక్ క్షేత్రము నుండి తూర్పు సముద్రములో

నరసాపురం వద్ద కలియునంతవరకు పరీవాహక ప్రాంతము.

## బృహస్పతి కన్యలో ప్రవేశించిన?

కన్యలో ప్రవేశించిన కృష్ణా పుష్కరములు వస్తాయి. సహ్యాద్రి నుండి బంగాళా ఖాతములో హంసలదీవి వద్ద కలిసేంతవరకూ పరీవాహక ప్రాంతము.

## బృహస్పతి తులలో ప్రవేశించిన?

తులలో ప్రవేశించిన కావేరి పుష్కరము వస్తుంది. మైసూరు-శ్రీరంగ క్షేత్రముల గుండా బంగాళాఖాతములో కలిసేంతవరకూ పరీవాహక ప్రాంతము.

## బృహస్పతి వృశ్చికములో ప్రవేశించిన?

వృశ్చికములో ప్రవేశించిన తామ్రపర్ణీ నది పుష్కరము వస్తుంది. తిరునల్వేలి జిల్లా పాపనాశనం కుర్తాళంలో గుండా సముద్ర సంగమం వరకు పరీవాహక ప్రాంతము.

## బృహస్పతి ధనస్సులో ప్రవేశించిన?

ధనస్సులో ప్రవేశించిన సింధు నది పుష్కరము వస్తుంది. పాకిస్తాన్‌లో కలిసిన పంజాబ్ రాష్ట్రముగుండా



పశ్చిమ సముద్రములో కలిసేంత వరకు పరీవాహక ప్రాంతము.

## బృహస్పతి మకరములో ప్రవేశించిన?

మకరములో ప్రవేశించిన తుంగభద్రా నది పుష్కరము వస్తుంది. శృంగేరి క్షేత్రము - మంత్రాలయముల గుండా కృష్ణలో కలిసేంత వరకు పరీవాహక ప్రాంతము.

## బృహస్పతి కుంభములో ప్రవేశించిన?

కుంభములో మలాపహారిణీ లేక భీమరథీ పుష్కరము వస్తుంది. మహారాష్ట్ర గుండా పశ్చిమ సముద్రములో కలిసేంత వరకు పరీవాహక ప్రాంతము.

## బృహస్పతి మీనములో ప్రవేశించిన?

మీనములో ప్రవేశించిన ప్రణీతా నదికి పుష్కరము వస్తుంది.

పుష్కర సమయంలో నదిలో దీపాలు వెలిగించటం, దీపదానం చేయటం వలన అష్టైశ్వర్య సిద్ధితో పాటు సుఖమయమైన జీవితం పొందగలరు.

## స్వామికి హారతి ఎలా ఇవ్వాలి?

కేవలం వట్టి హారతిని ఇవ్వకూడదు. పత్రంగానీ, పుష్పంగానీ హారతితో పట్టుకొని స్వామికి ఇవ్వాలి. అనంతరం మీరు కళ్ళకద్దుకోవాలి.

## 108 ప్రాముఖ్యత విశేషాలు?

- ♠ ఉపనిషత్తులు 108.
- ♠ అష్టోత్తర నామావళి 108.
- ♠ జపమాలలో పూసలు 108.
- ♠ చంద్రునికీ భూమికీ మధ్య దూరం చంద్రుని వ్యాసానికి 108 రెట్లు ఉంటుంది.
- ♠ ఆయుర్వేదం మనిషి శరీరంలో 108 మర్మస్థానాలని తెలవిస్తోంది.
- ♠ శ్రీచక్రయంత్రంలో 54 స్త్రీ, 54 పురుష అంతర్భాగాలున్నాయి.
- ♠ దేవభాషలో అక్షరాలు 108.
- ♠ భరతుడి నాట్యశాస్త్రంలో నాట్య భంగిమలు 108.
- ♠ 108 ప్రదక్షిణాల వలన మంచి ఫలితం ఉంటుంది.
- ♠ 108 సార్లు హనుమాన్ చాలీసా వంటివి చేయటం వల్ల సకల కోరికలు సిద్ధిస్తాయి.
- ♠ అంతటి విశేషస్థానం గల సంఖ్య 108. నూట ఎనిమిదిసార్లు గాయత్రిని జపిస్తే సకల శాస్త్రాలనూ పూజించిన ఫలం కలుగుతుంది.



## పురుషులకు ఏ రోజు తలంటు స్నానం చేస్తే ఏ ఫలం వస్తుంది?

- ♠ శనివారము స్నానము మహాభోగము.
- ♠ ఆదివారము తలంటు తాపాన్నీ, కోర్కెలనీ పెంచుతుంది.
- ♠ సోమవారము తలంటు అందాన్ని పెంచుతుంది.
- ♠ మంగళవారము తలంటుస్నానము విపరీత దుఃఖాలకి కారణమవుతుంది.
- ♠ బుధవారము స్నానము లక్ష్మీ దీవెనలు లభిస్తాయి.
- ♠ గురువారము నాడు తలంటు స్నానము చెయ్యటం ద్వారా ఆర్థిక నష్టములు విపరీతముగా ఉండును.
- ♠ శుక్రవారము తలంటు అనుకోని ఆపదలు.. కాన పురుషులు గమనించవలెను.

## ఋతు సమయంలో స్త్రీలు పసుపు నీరెందుకు త్రాగుతారు?

పసుపు సర్వదేవతా ప్రియమైనది. ఇంకను క్రిమి సంహారిణి. ముఖానికీ రాసుకోవటం ద్వారా చక్కని అందముతో మెరిసిపోతారు. ఇంటి పని చేసుకొనే స్త్రీల కాలి అందము సూక్ష్మ క్రిముల ద్వారా పాడవకూడదని పసుపుని పాదాలకు వ్రాసుకుంటే మంగళ కరమైనదని

ఈ ఆచారం పెట్టారు. వధూవరులకు వివాహ సమయంలో నలుగు పెట్టేది రక్త ప్రసరణ కోసమే. ఋతు సమయంలో స్త్రీలు పసుపు నీరు త్రాగితే ఆ నాలుగు రోజుల బాధలు అనేకం తగ్గుతాయి.

## పుత్రుడ్ని తండ్రి ఎలా పెంచాలి?

పసివానిగా అయిదేళ్ళు వచ్చేవరకూ రాజుగా లాలించి, ప్రేమించి పెంచాలి. పదేళ్లు వచ్చేవరకు అదిలించి, బెదిరించి, తప్పకపోతే కొట్టి సరైన దారిలో నడిపించాలి. పదహారేళ్ళు దాటిన పుత్రునితో స్నేహితుడిగా ఉండాలి. చెప్పాలే గాని చెయ్యమని ఒత్తిడి తేకూడదు. ఆపై పెళ్ళయిన తర్వాత తన బిడ్డగా కాక కోడలి భర్తగా మాత్రమే చూడాలి. అప్పుడు తండ్రిని తండ్రిగా చూస్తాడు, గౌరవిస్తాడు కొడుకు.

## ఎలాంటి కాటుకను పెట్టుకోవాలి?

కనులకు అందాన్నీ, హాయినీ ఇస్తుంది కాటుక. రాగి పళ్ళెమునకు నాలుగు అంగుళాలు పచ్చకర్పూరము పులిమి, దానిపై ఆముదం పోసి వత్తి పెడతారు. ఆ వత్తిని ముట్టించి, దాని నుంచి వచ్చే పొగమసి తగలటానికి పైన పాత్ర ఉంచుతారు. అలా కొంతసేపయ్యాక బాగా మసి పడుతుంది. దానిని తీసి



ఆముదంతో మర్దించి ఆపై కాటుకను కనులకు పెట్టుకుంటారు. గతంలో ఎవరికి వారు గృహంలోనే చేసుకునేవారు. ఆముద దీపాన్ని వెలిగించి దానిపై రాగి పళ్ళెం పెట్టి ఆ మసిని కాటుకగా కూడా వాడుతుంటారు. గర్భవతులు క్రమం తప్పకుండా కాటుక పెట్టుకుంటే బిడ్డకీ, తల్లికీ మంచిది.

## తాంబూలంలో ఎంత ఆరోగ్యముంది?

తాంబూలాన్ని రెండుసమయాల్లో ఎక్కువగా తీసుకుంటారు. రతి కాల సమయాన తీసుకోవటం వల్ల శరీర శక్తి పెరుగుతుంది. ఆహారం వల్ల వచ్చే చెడు శ్వాస ఇరువురికీ ఇబ్బంది కలిగించదు. అలాగే దవడలనూ, దంతాలనూ దృఢంగా చేస్తుంది. లేత ఆకులూ, వక్క, సున్నమే కాకుండా లవంగములూ, జాజికాయా, పచ్చకర్పూరమూ... ఇలాంటివి కూడా కలిపితే తాంబూలము మధురిమ తెలుస్తుంది.

## కంచుపాత్రలో ఏ పానీయము త్రాగరాదు?

కొన్ని ఆహారాలు కలుస్తే అమృతమయ మవుతాయి. మరికొన్ని విషమవుతాయి. అలాగే కంచులో పాలూ, కొబ్బరినీళ్ళూ త్రాగరాదని ఆయుర్వేదం తెలియచెబుతోంది.

## అష్టమైధునములంటే?

- సుందర స్త్రీ విషయాలను వినటం, తిరిగి చెప్పటము.
- ఆడవాళ్ళతో కలిసి మెలిసి వినోదించటము.
- శృంగారానికి సంబంధించిన విషయాలను మాట్లాడటము.
- సంకల్పము.
- ప్రయత్నము.
- చివరగా శారీరకంగా కలవటము.
- స్త్రీల సంబంధిత విషయాలను అనేక విధాలుగా ఎదుటివారికి చెప్పటము..

## నైరుతిలోనే ఆరోగ్యముందా?

నైరుతి మనకు ఆరోగ్యాన్నీ, సౌభాగ్యాన్నీ అందిస్తుంది.

నైరుతిని అదుపులో ఉంచుకుంటే సకల సంపదలూ, భోగాలూ లభిస్తాయి.

## సంపదల కోసమూ, విజయం కోసమూ!

శ్రవణేతు సితైర్విష్ణుం పీతై ర్నీలైశ్చభక్తితః సంపూజ్య శ్రియ మాప్నోతి పరం విజయమేవచ



శ్రవణా నక్షత్రమున తెలుపూ, పసుపూ, నీలవర్ణములు గల పుష్పములతో వైకుంఠవాసుణ్ని పూజించిన సంపదా, విజయములు లభిస్తాయి.

## చూపుడు వేలును ధర్మకార్యాల్లో ఎందుకు వినియోగించకూడదు?

మనకు కోపం వచ్చినా, కసి వచ్చినా, ఎవ్వరినైనా సాధించాలనుకున్నా చూపుడు వేలితో నిన్నేమి చేస్తానో చూడు అంటాము. ఆవేశానికీ, కోపానికీ, క్రోధానికీ ప్రతీక చూపుడు వేలు. అందుకే ధర్మకార్యాల్లోనూ, జపములోనూ, ఆరోగ్య సంబంధిత మందులు వేసుకునేప్పుడూ చూపుడు వేలుకి పని చెప్పకపోవటం మంచిది.

## పులిచర్మము మీద పూర్వకాలంలో ఋషులెందుకు తపస్సు చేసేవారు?

- పులిచర్మాన్ని దాటి భూమికి ఆకర్షించే గుణం లేదు. తత్కారణంగా తపస్సు ద్వారా సాధించినది సాధకునిలోనే ఉండిపోతుంది.
- వెదురు కర్ర సంబంధిత ఆసనము మీద పూజ చేస్తే దరిద్రము.
- రాతి మీద చేస్తే అనేక వ్యాధులొస్తాయి.

♠ కటికనేల మీద దుఃఖాన్ని కలిగించే సంఘటనలు జరుగుతాయి.
♠ గడ్డి పరకల మీద చేస్తే ఆయుష్షు క్షీణిస్తుంది.

## పిల్లేళ్ళు ఎందుకు ధరిస్తారు?

స్త్రీలు మూడు నాలుగు కాలివేళ్ళకు వీటిని ధరిస్తారు. స్త్రీలకు పురుషులకన్నా రెండు రెట్లు కామము అధికము. వీటిని ధరించటం వల్ల ఆ కాలి వేళ్ళ వద్దనున్న కామ నరాలు వకదానితో మరొకటి రాసుకొని కామం పుట్టించకుండా పురుషుని కామంతో స్త్రీ కామాన్ని సరిసమానం చెయ్యటానికే పిల్లేళ్ళు పెట్టారు పెద్దలు.

## ఆనుకొని కూర్చుంటే ఫలమురాదా?

అందుకే పూజాదివిశేషములప్పుడూ, శుభ కార్యములప్పుడూ, వివాహ సమయాలప్పుడూ, చదువు కునేటప్పుడూ వెనుక ఆనుకొని కూర్చునే సౌకర్యం ఉండవు. అలా ఆనుకుంటే చేసే పని మీద ధ్యాస ఉండదు. సుఖంపై, భోగాలపై ఆసక్తి కలుగు తుంది.

## ఏ స్త్రీ ఎన్ని వరాలు కోరుకోవాలి?

♠ సద్ బ్రాహ్మణ స్త్రీ వంద వరాలు.
♠ క్షత్రియ స్త్రీ రెండు వరాలు.



♠ వైశ్య స్త్రీ ఒక వరము.
♠ శూద్ర స్త్రీ మూడు వరాలు కోరుకోవాలి. (శ్రీమహాభారతం నుంచి)

## ఏ సమయంలో అన్నమాట జరిగి తీరుతుంది?

దైవపూజ చేస్తున్నప్పుడూ, అలాగే పూజాది కార్యాలు అయిన తర్వాత మంచి ముహూర్త సమయములలో అన్నమాట అక్షర సత్యమవుతుంది.

## పురాతన కాలంలో వర్షాలు పడతాయని ఎలా నిర్ధారించేవారు?

ముందు వర్షం పడుతున్నప్పుడు దూదిని తీసుకొని ఓ ప్రదేశాన్ని ఎన్నుకొని పెట్టేవారు. ఆ మరుసటి రోజు ఆ దూదిని పిండేవాళ్ళు. ఆ దూదిలో నుండి ఎన్ని చుక్కలు రాలితే ఆ సంవత్సరంలో అన్ని వర్షాలు పడతాయని గ్రహించేవారు.

## ఈ ప్రపంచంలో దురదృష్టవంతులెవ్వరు?

నిద్రపట్టని వారు మహా దురుదృష్టవంతులు. సహజంగా వీరికి నిద్రరాదు. పక్కవార్ని పాడు చేసి

తద్వారా ధనము సంపాదిద్దామనుకున్నవారికీ, తమను ఎవరేమైనా చేస్తారేమోనన్న భయం కలవారికీ, పరాయి స్త్రీలపై వ్యామోహాన్ని పెట్టుకున్నవానికీ ఎన్ని సంపదలున్నా మహాసంపదైన నిద్ర కరువే.

## ఏ దేవునికి ఏ అక్షతలు వాడాలి?

పరమేశ్వరునకు తెల్లని అక్షితలూ, విష్ణుమూర్తికి పసుపు అక్షితలూ, స్త్రీ శక్తిదేవతలకు కుంకుమ అక్షితలు వాడాలి.

## అసలు సిసలు మిత్రుడంటే?

- ♠ అవసరం కోసం మాట్లాడేవాడు అవసరార్థి.
- ♠ మీ దగ్గరున్న అర్హతల గూర్చి వచ్చినవాడు స్నేహితుడు.
- ♠ కష్టనష్టములలో తోడు ఉండేవాడే మిత్రుడు.
- ♠ సకల కార్యాలనూ చెప్పి, అడిగి, కలిసిమెలిసి ఉండేవాడు ఉత్తమోత్తమ మిత్రుడు.

## స్త్రీలు సిగ్గు పడినప్పుడు ఈ పని చేయరాదు?

స్త్రీకి సిగ్గే అందము. అయితే కొంతమంది కాలి బొటనవేలును నేలకు రాస్తూ సిగ్గుపడతారు. అది ఆరోగ్యరీత్యా మంచిది కాదు. అక్కడున్న నరాలు



గర్భానికీ, హృదయానికీ సంబంధించినవి అయి వుంటాయి. వాటిపై ఒత్తిడి తేవటం ఆరోగ్యరీత్యా మంచిది కాదు. శృంగారంపై ఆసక్తి తగ్గుతుంది.

## విభూది బొట్టు ఎలా పెట్టుకోవాలి?

విభూధిని బొటన వేలితో కుడి నుంచి ఎడమవైపుకు పెట్టుకొని మధ్య వేలితో సరి చేసుకోవాలి. ఆపై మధ్య మూడు వేళ్ళతో పెట్టుకోవాలి. తల స్నానం చేసినప్పుడు తడి విభూధి, మామూలు స్నానము చేసినవారు పొడి విభూధిని ధరించాలి.

## అరటిఆకు ఎలా వేసి వడ్డించాలి?

అరటిఆకు చివర కూర్చున్న వారికి ఎడమవైపు ఉండేలా వేయాలి. కుడివైపుగా వేసి వడ్డించరాదు. చివర లేకుండా ఉన్న అరిటాకులో భోజనం చేయరాదు. వడ్డించరాదు. అతిథిని తన కుడివైపు ఉంచి గృహస్థు భోజనాన్ని పెట్టాలి. చివరగా అతిథికి మజ్జిగ ఇవ్వాలి.

## సిద్ధులూ, యోగులూ తమని తాకనీయరు. దేనికి?

దూరం నుంచి నమస్కారానికి మాత్రమే పరిమితం చేస్తారు. పాదాభివందనము ఎట్టి స్థితిలో

చేయనివ్వరు. అలా చేయటం వల్ల వారు సాధించుకున్న తపస్సు శక్తి అవతలవారికి చేరుతుంది.

## ఏ భోజనాన్ని ఏమంటారు?

♠ ఒంటిరిగా తినే భోజనము వృధా.
♠ ఇద్దరు కలిసి భోజనము చేస్తే భుక్తి.
♠ ముగ్గురు కలిసి చేస్తే భోజ్యము.
♠ నలుగురూ ఆపై కలిసి చేస్తే భోజనము.
♠ అందుకే గృహస్థు కుటుంబ సభ్యులందరితో భోజనము చేయాలి.
♠ భార్యా భర్తలు కలిసి భుజించుట మంచిదికాదు.
♠ భోజనమప్పుడు మంచినీటి గ్లాసును కుడివైపున ఉంచుకోవాలి.
♠ పీట మీద కూర్చుని భోజనం చేసే వాళ్ళు ఓ కాలు పీటనుంచి భూమిని తాకుతూ తినరాదు. తిన్న ఆహార శక్తి భూమికి అందుతుంది.

## సన్యాసులు పాదాలకి మెట్టెలు, కడియాలు ఎందుకు ధరిస్తారు?

ఆ ప్రాంతంలో ఎక్కువ కామనాడులుంటాయి. కామపు కోరికలతో తమ ఆధ్యాత్మిక తపస్సు విధులు భంగం కలుగకుండా స్త్రీ వ్యామోహం దేహానికి రాకుండా జాగ్రత్తలు తీసుకుంటారు.



## ఏ సమయంలో ఏ పని ఏ దిక్కుగా ప్రారంభించాలి?

ఉదయం కార్యాన్ని ప్రారంభింపదలిస్తే తూర్పు వైపు నడిచి, అదే సాయంత్రము వైపు కార్యాన్ని ఉత్తరదిశగా ప్రారంభించాలి. అప్పుడే అది విజయవంతమవుతుంది.

## తాంబూలము ముత్తైదవులకు ఎలా ఇవ్వాలి?

బొట్టు పెట్టి తాంబూలము ఇచ్చేటప్పుడు తమలపాకు చివర్లూ, అరటి పళ్ళు చివర్లూ ఇచ్చేవారి వైపు కాకుండా వ్యతిరేక దిశలో ఉంచి ఇవ్వాలి. చివర్లను వారివైపుకు ఉంచి ఇస్తే మీరిచ్చిన తాంబూల ఫలం వృధాగా పోతుంది. తమలపాకులు మూడుగానీ, అయిదుగానీ, అలాగే వక్కలూ, పండ్లూ రెండు చొప్పున పెట్టాలి. ఏక పండు తాంబూలం ఇవ్వరాదు.

## తలక్రింద చెయ్యి పెట్టి ఎందుకు నిద్రించకూడదు?

కొంతమందికి అలా నిద్రించటం అలవాటు. అది ఆరోగ్యరీత్యా మంచిది కాదు. ఎడమ చేయి

తలక్రింద పెట్టుకోవటం ద్వారా అక్కడున్న సూర్యనాడి ఒత్తిడికి లోనవుతుంది. అందుకే పెద్దలు అలా నిద్రించకూడదంటారు. అలాగే కాళ్ళు కడుక్కొని అస్సలు నిద్రించకూడదు.

## స్త్రీ ధనమంటే?

- ♠ వివాహసమయంలో తల్లీ, తండ్రీ పెట్టిన నగలు.
- ♠ భర్త సంతోషంగా ఇచ్చిన ధనము.
- ♠ అన్నదమ్ములూ, బాబాయిలూ ఇచ్చిన సొమ్ము.
- ♠ వ్రతాలూ, నోములప్పుడూ పుట్టింటివారు పెట్టిన రొక్కము.
- ♠ తల్లి ధనముపై పుత్రికలెందరున్నా అందరికీ సమానమైన హక్కు ఉంటుంది.

## ఎవరు అతిథి మర్యాదలు పాటించనవసరంలేదు?

స్త్రీలూ, పిల్లలూ, పుత్రికా, చిన్నపిల్లలూ, సోదరీ, రోగులూ, కడుపుతోనున్న వారూ వీరంతా అతిథి మర్యాదలనూ, ధర్మాలనూ పాటించక భుజించవచ్చు.

## అడ్డబాస పరమార్థము

దీన్నే ముక్కెర అని కూడా అంటారు. ముక్కు చివర మధ్య భాగంలో స్త్రీలు ధరిస్తారు. ముత్యముతో



గానీ, కెంపుతో గానీ ధరించే ఈ అడ్డబాసర అందానికే కాకుండా ముక్కు నుంచి వచ్చే బొగ్గు పులుసు వాయువును పరిశుభ్రం చేస్తుంది. భర్తతో ఏకాంతంగా సఖ్యతగా ఉన్న సమయాన చెడుశ్వాసను భర్తకి తగలనీయదు. స్త్రీలు మితభాషులుగా ఉండమని అర్థం చెప్పే ఈ ముక్కెర వల్ల వంట చేసేటప్పుడు ముక్కుద్వారా చెడుక్రిములు వండే పదార్థాలపై పడకుండా ఆహారాన్ని అమృతమయం చేసి రోగాలను దూరం చేస్తుంది.

## ఏ వస్తువులు శ్రాద్ధకార్యాలకు వాడకూడదు?

గుమ్మడికాయా, వంకాయా, కరివేపాకూ, పచ్చి మిరపకాయలూ, గోంగూరా, కుంకుడు కాయలు వాడరాదు. దానికి కారణము అవి విశ్వామిత్రుడు సృష్టికి ప్రతిసృష్టి చేసినవి.

## వధూవరుల తలపై పెట్టించే జీలకర్రా - బెల్లంలో ఆయుర్వేద రహస్యం?

- ♠ జీలకర్ర సర్వమంగళకరమైనది.
- ♠ దంపతులకు ముందుగా ముసలితనము రాకుండా చేస్తుంది.

- ♠ యవ్వనాన్ని పెంచేది గనుకనే మహర్షులు ఈ ఆచారాన్ని పెట్టారు.
- ♠ జీలకర్రను కొబ్బరి నీళ్ళతో రుబ్బి, నిమ్మరసాన్ని కలిపి స్నానము చేయిస్తే చల్లటి ఆ నీళ్ళతో ఉన్మాదం కూడా పోతుంది.
- ♠ బెల్లము కఫమునకూ, పిత్తమునకూ, వాతమునకూ సంజీవిని.
- ♠ యవ్వనకారణమై వీర్యవృద్ధిని పెంచుతుంది.
- ♠ అలాంటి ఆ రెండూ కలిపి శిరస్సు మీద ఉంచటం వల్ల ఒకరి శరీరంలోని విద్యుత్ మరొకరి శరీరంలోనికి అంతర్వాహినిగా ప్రవేశించి ఏకమవుదురు.
- ♠ విడివిడిగానున్నా ఆ రెండు శరీరాలు ఆ చర్య ద్వారా కలిసినప్పుడు ఏకశక్తిగా మారి ఇద్దరి శరీరతత్వాలను క్రమబద్ధీకరిస్తుంది. ప్రేమను పెంచుతుంది.

## సౌందర్యవతియైన భార్య కావాలనుకుంటే ?

**కామ దేవం త్రయోదశ్యాం సురూపో జాయతే ధ్రువమ్**
**ఇష్టాం రూపవతీం భార్యాం లభేత్కామాంశ్చ పుష్కలాన్**

త్రయోదశినాడు మన్మథుని పూజించి సంతృప్తి పరిస్తే మంచి సుందర రూపంతో పాటు అద్భుతమైన



సొగసూ, లావణ్యంగల, గుణవతి అయిన భార్యను పొంది సుఖించగలడు.

## దీర్ఘాయుష్మంతునిగా భర్త ఉండాలంటే?

**నక్షత్రాణి చ సర్వాణి యజ్ఞాశ్చైవ పృధక్పృథక్**
**అశ్విన్యామశ్వినా విష్ట్వా దీర్ఘాయుర్జాయతే నరః**

అశ్వినీ నక్షత్రమందు అశ్వినీ దేవతలను పూజించాలి.

రుగ్మతలతో బాధపడేవారూ, పీడింపబడేవారూ తొందరగా ఉపశమనాన్ని పొందగలరు.

## సకల కార్యాల్లోనూ, గృహస్థుడిగానూ విజయుడవ్వాలంటే?

**దుర్గాం సంపూజ్య దుర్గాణి నవమ్యాం తరతీచ్ఛయా**
**సంగ్రామే వ్యవహారేచ సదా విజయ మశ్నుతే**

నవమినాడు మహాదుర్గను పుష్పములతో పూజించి...

ప్రీతికరమైన నైవేద్యాలను నివేదన చేసిన వారు మహాదుర్గమమైన సంసారమునందూ, వృత్తిపర కార్యాల్లోనూ జయాన్నీ, సుఖాన్నీ పొందగలరు.

## ఎన్నిజన్మల తర్వాత మానవజన్మ?

**జంతుర్జన్మ సహస్రేభ్య ఏకస్మిన్మానుషోయది సతత్రాప్యతి మూఢాత్మా కింభోగానభిధావతి**

ప్రాణి వేయి జన్మల్లో ఎప్పుడో ఒకసారి మానవజన్మ ఎత్తుతాడు. అంతటి దుర్లభమైన మానవజన్మలో మూఢాత్ముడై విషయభోగాల వెంట పరుగుతీసి మళ్ళీ అనేక పాపపు జన్మలు ఎత్తి నరకాన్ని అనుభవిస్తున్నాడు.

## సంపదల కోసమూ, విజయం కోసమూ.

**శ్రవణేతు సితైర్విష్ణుం పీతై ర్నీలైశ్చభక్తితః సంపూజ్య శ్రియ మాప్నోతి పరం విజయమేవచ**

శ్రవణా నక్షత్రమున తెలుపూ, పసుపూ, నీలవర్ణములు గల పుష్పములతో వైకుంఠవాసుణ్ని పూజించిన సంపదా, విజయములు లభిస్తాయి.

## మహావిజయం కొరకు?

**ఆర్ద్రాయాంతు శివం పూజ్య పశ్చాద్విజయమాప్ను యాత్ పద్మాదిభిః స దివ్యైశ్చ పూజితః శం ప్రయచ్ఛతి**

ఆర్ద్ర నక్షత్రమునాడు శివారాధన చేసిన మహాఫలము లభిస్తుంది.



సుందర పుష్పాలతో మహేశ్వరుణ్ని పూజించి పరమేశ్వరుని కృప ద్వారా విజయుడవుతాడు.

## లక్షలాది రూపాయలు విలువ చేసే ఆరోగ్య రహస్యం ఈ క్రింది విషయంలో ఉందా?

ప్రతినిత్యము మనం తినే కూరగాయలను అనేక భయంకర విషపూరిత మందులు వేసి పండిస్తారు. అలాంటి కూరలని ఎంత కడిగినా, ఎన్నో కొన్ని రసాయనాలు వాటిని అంటి పెట్టుకొని, అనేక రోగాలకు కారణాలవుతున్నాయి. ఏ అలవాట్లు లేనివారికి కూడా ఎందుకన్ని రోగాలో తెలుసా? ఇందుకే. కాయగూరలని వేడినీళ్ళతో కడిగి ఓ నిమిషం అందులో ఉంచి, అదే ఆకుకూరలయితే (వంకాయ కూడా) మరికొంతసేపు కడిగి ఆపై వండటం ద్వారా ఎన్నో వ్యాధులు మనకి ఆహారం ద్వారా అందవు.

(వందలాది ఎకరాలు పండిస్తున్న ఓ రైతు చెప్పిన సత్యం)

## తెలుసుకోవాల్సిన విషయం?

ఒక్క ఆవు మూత్రంతో అయిదు ఎకరాలకు సరిపడ ఎరువు వస్తుంది. ఆవు మనకి చేసే మేలు విషయంలో ఓ చిన్న విషయం మాత్రమే ఇది.

## భార్యను దగ్గరికి తీసుకున్నప్పుడు కనులు తెరిచే ఉంచాలా?

తన్మయత్వంతో, ఆనందంగా, సిగ్గుగా కనులు మూసుకునేది స్త్రీ. పురుషుడు కనులు తెరిచి భార్యను చూస్తూనే తన శృంగారాన్ని ప్రదర్శించాలి. పురుషుడు కనులు మూసుకుంటే అనేక ఆలోచనలు అతన్ని ఏదో రకంగా ఇబ్బంది పెడుతూ పరిపూర్ణ సుఖాన్ని పొందలేడు. చిరువెలుగులో మాత్రమే ఇరువురూ గడపండి.

## వికలాంగులుగానూ, ఓ పూట తిండి కూడా దొరకని దేశాల్లో కాకుండా అన్ని అవయవాలిచ్చి దేవుడు మననెందుకు పుట్టించాడు?

ప్రపంచానికి పనికి వచ్చేలా ఏదైనా సాధించమని. అలాంటి దీన స్థితిలోనున్న వార్ని అక్కున చేర్చుకోమనీ, ఇచ్చిన కాళ్ళతో మంచి మార్గం వైపు నడవమనీ, ఇచ్చిన చేతులతో అనాథలనూ, రోగులనూ సేద తీర్చమనీ, కనులతో ప్రపంచాన్ని చూసి తను చెయ్యాల్సిన ధర్మాన్ని నిర్ణయించుకోవటానికి వారిలా తమను పుట్టించనందుకు



తను సృష్టించిన ఈ విశ్వానికి ఏం మేలు చేస్తావని, చెయ్యమని చెప్పటమే భగవంతుని ఉద్దేశ్యము.

## నీళ్ళు త్రాగటం మంచిదేనా?

కొంతమంది చాలా మంచిదన్న నమ్మకంతో విపరీతంగా నీరు త్రాగుతుంటారు. అలాంటి వారికి మూత్ర సమస్యలొస్తాయి. అతిగా త్రాగకూడదు. అలా అని తక్కువ త్రాగకూడదు.

ఉదయం గోరు వెచ్చని నీళ్ళు ఓ గ్లాసున్నర త్రాగటం ఎంతో మంచిది. భోజనానికి ముందు త్రాగకూడదు. భోజనం మధ్యలో కొద్ది, కొద్దిగా తీసుకోవాలి. అలాగే రాత్రిపూట నీళ్ళు పక్కనే ఉంచుకుంటే వైద్యుణ్ణి పక్క నుంచుకొన్నట్టే.

## గర్భిణీ స్త్రీ పెరుగెందుకు తినకూడదు?

తనతో పాటు మరో ప్రాణిని పెంచుతుంది గాన, తేలికగా జీర్ణమయ్యే ఆహారం తీసుకోవటము ఉత్తమము. పెరుగు అదీ రాత్రి పూట అసలు తినకూడదని అయుర్వేదం శెలవిస్తోంది.

## వర్షపు నీరు త్రాగితే మంచిదా?

మంచిదే. అలా అని వర్షపునీటిని దోసిటపట్టి త్రాగకూడదు. భూమిపైనున్న జలాశయాలూ,

చెరువులూ, ఆఖరికి మురికి గుంటల్లోని నీరు కూడా ఆవిరై మేఘాల నుంచి వర్షిస్తుంది. అందుకనే ఏ వర్షపు నీరు మంచిదనో తెలుసుకోవటానికి ఓ వెండి గిన్నెలో వేడి అన్నాన్ని పెట్టి వర్షపు నీరు పడతారు. అన్నం పాడయితే మంచి వర్షపు నీరు కాదనీ పాడవకపోతే ఆ వర్షపు నీరు మంచిదనీ స్వీకరించేవారు మన పెద్దలు.

## పాలను ఎవరు త్రాగాలి? ఎప్పుడు త్రాగాలి?

పసిపిల్లలూ, ప్రసవించిన స్త్రీలూ, గర్భిణీ స్త్రీలూ, ముసలివారూ పాలను తప్పకుండా త్రాగాలి. పాలను ఉదయం, మధ్యాహ్న భోజనమూ, రాత్రి భోజనము అనంతరం తీసుకోవచ్చు. అయితే పాలు త్రాగిన అరగంట వరకు నిద్రపోకూడదు. నువ్వులతో చేసిన పదార్థాలు తిన్న అనంతరము, పులుపు పదార్థాలు తీసు కున్న తర్వాత పాలు ఎట్టి పరిస్థితులలోను త్రాగకూడదు.

## అతి వేడి లేదా అతి చల్లని పదార్థాలు తినకూడదా?

భావప్రకాశ ఆయుర్వేద శాస్త్ర ప్రకారం అతి చల్లనివి లేదా అతి వేడివి జీర్ణం కావు. తినే భోజనాన్ని కూడా ఒక పద్ధతి ప్రకారం తినాలి. ముందుగా తీపిని,



తరువాత పులుపు, తరువాత చేదు, ఆ తరువాత ద్రవపదార్థం చివరగా మజ్జిగ అన్నాన్ని స్వీకరించాలి.

పౌర్ణమి, అమావాస్యల రోజు ఎంత తగ్గించి భోజనం తీసుకుంటే అంత మంచిది. రాత్రి సమయంలో పండ్లు తీసుకుంటే ఇంకా ఉత్తమం.

## కొత్త పెళ్ళికూతురిచే అత్తవారింట అడుగుపెట్టినప్పుడు సింహద్వారం వద్ద బియ్యాన్ని ఉంచి ఎందుకు దొర్లిస్తారు?

నూతన దంపతులు అత్తగారింటికి వచ్చినప్పుడు రాగి పాత్రలో బియ్యం పోసి సింహద్వారం మీద పెట్టి, కొత్త పెళ్ళికూతుర్ని ఆ బియ్యపు పాత్రను తన్ని ముందుగా కుడికాలు పెట్టి లోపలికి రమ్మంటారు. ధాన్యలక్ష్మిని తన్నటం తప్పే. అయినా పెళ్ళికూతురు తన్నిన బియ్యం ఎంత దూరంగా పడి విస్తరిస్తే అంత ప్రదేశం మేర ధాన్యలక్ష్మి తాండవిస్తుందని అలా చేయిస్తారు. ఇది కొన్ని ప్రాంతాలలో మాత్రమే ఉండే ఆచారము.

## ఏ పాలు శ్రేష్ఠము?

అప్పుడే పితికిన ఆవు లేదా గేదె పాలు శ్రేష్ఠము. కపిలగోవు పాలను దైవ కార్యాలకు మాత్రమే

వినియోగించాలి. పచ్చిపాలు నాలుగు గంటలకన్నా ఎక్కువ సేపు నిలవ ఉన్నవి తాగకూడదు. ప్యాకెట్ పాలు కాగపెట్టి త్రాగటమే శ్రేయస్కరము.

## ఆహారం తీసుకునేటప్పుడు తీసుకోవాల్సిన జాగ్రత్తలు?

భోజనానికి ముందు ఆమ్లగుణం గల దానిమ్మ తింటే అజీర్ణము బాధ వుండదు. పుల్లని పెరుగు అసలు తినకూడదు. మినుములతో చేసిన పదార్థాలను తిన్న తరువాత పాలు త్రాగకూడదు. తినే పదార్థాలను ఎక్కువ సార్లు వేడి చేసి తినటం అసలు మంచిది కాదు. దీని కారణంగా గ్యాస్ పెరిగి అనారోగ్య సమస్యలు పెంపొందుతాయి. తినే ఆహారాన్ని నిలబడి, కాళ్ళుచాపి, నడుస్తూ, మాట్లాడుతూ అసలు తినకూడదు.

## పెరుగన్నంలో అరటిపండు ఎందుకు తినకూడదు?

పెరుగు మలబద్ధకాన్ని పెంచుతుంది. అరటిపండు కూడా మలబద్ధకాన్ని పెంచుతుంది. అలా రెండూ కలిస్తే ఉదర సంబంధిత సమస్యలొస్తాయి. బాగా మిగల పండిన అరటిపండు జీర్ణశక్తిని పెంచుతుందని, పెరుగుతో కలిపి తినకూడదు.



## ఆదివారం మాంసాహారం తినకూడదా?

ఆదివారం మాంసాహారము తినటం వల్ల సూర్యుని ఆగ్రహానికి గురి కావల్సివస్తుంది. మాంసాహారం భుజించని వారికి అశ్వమేధయాగం చేసినంత ఫలం లభిస్తుందని గౌతమ మహర్షి శెలవిచ్చారు.

## విదియ రోజు పురాణ పరమార్థం ఏమిటి?

అన్నాచెల్లెళ్ళ భోజనాలని పిలిచే ఈ రోజున యముడు సోదరి ఇంటికెళ్ళి ఆమె ఆప్యాయతతో వండి పెట్టిన భోజనాన్ని స్వీకరించి చెల్లిని నిండునూరేళ్ళు పసుపు కుంకుమలతో వర్ధిల్లమని ఆశీర్వదించి కార్యార్థియై వెళ్ళి విజయం సాధించాడు. అందుకే దీన్ని యమద్వితీయ అని కూడా అంటారు. సోదరి చేతి వంట తిన్న సోదరుడు కూడా పరిపూర్ణ ఆయుష్షుతో సుఖంగా జీవిస్తాడని యముడి ఆశీర్వాదము. అందుకే ఎన్ని పనులున్నా ప్రతి అన్న సోదరి ఇంటికెళ్ళి చెల్లినీ, అక్కనీ పలకరించి భోజనాన్ని చేసి ఆమెకి ఆనందాన్ని కలుగచేస్తాడు.

## కార్తీక ఏకాదశీ, ద్వాదశీ, పౌర్ణమిలలో చన్నీళ్ళ స్నానాలెందుకు?

ఆయా మాసాల్లో ప్రవహించే నదుల్లోని నీటిలో ఎంతో శక్తి ఉంది. తెల్లవారుజామున నదీ స్నానం చేస్తూ నీటిలో ఉండగలిగినంతసేపు ఉంటే ఉదర వ్యాధులు పోతాయని నమ్మకమూ, వాస్తవమూ కూడా.

దానికి కారణం ఆ కాలం వరకూ పడిన వర్షపు నీరు భూమిలో ఇంకి ఓ మహా అయస్కాంత మండలము ఏర్పడుతుంది.

ఆ అయస్కాంత శక్తి వర్షాకాలం తర్వాత వచ్చే ఆ మాసాల్లో నదుల్లో ప్రవహిస్తుంది. అందుకే వర్షాకాలం అనంతరం వచ్చే విష్ణువుకూ, మహాశివునకూ ఇష్టకరమైన మాసాల్లో ఆ ఆచారాన్ని పెట్టారు మన పెద్దలు.

## భగవంతుడిచ్చిన మేధస్సును ఎలా ఉపయోగించకూడదు?

- ♠ అయినవారి మీద చెడు ఆలోచనతో ఎన్నో తెలివితేటలు చూపించి వారికి నష్టం కలిగించినా చివరకు నష్టపోయేది వారే.



- ♠ మీ మంచి కోరే వార్ని దూరం చేసుకోవటం ద్వారా జీవితంలో నిద్ర కూడా కరువైపోతుంది.
- ♠ మీ చుట్టూ ఉన్న వారంతా బాగుండాలని కోరుకుంటే మీరు ఇంకా బావుంటారు.
- ♠ జంతువులు కూడా గుంపులుగా ఆహారం కోసం వెళతాయి. ఆత్రంగా, స్వార్థంగా కనిపించేదంతా తనకే కావాలని ఏ జంతువూ ఆత్రుతపడదు.
- ♠ భార్యను దూరం చేసుకున్నవాడూ, తల్లీ, తండ్రీ, అత్తమామలనూ దూరం చేసుకున్నవాడూ, స్నేహితులని దూరం చేసుకున్నవాడూ... అట్టి వాని గూర్చి జాలిపడాలి.
- ♠ మట్టి పాత్రయినా కావచ్చు, అది ఉన్నప్పుడు దాని విలువ తెలియదు. దూరమయినప్పుడే దాని విలువ తెలుస్తుంది. అప్పుడు ఏం చేసినా ప్రయోజనం శూన్యం.

## ఏ పాలను త్రాగకూడదు?

గేదె ఈనిన తర్వాత, దూడ మరణించిన గేదె పాలనూ పది రోజుల వరకూ త్రాగకూడదు. అలాగే విరిగిన పాలను తీపి పదార్థముగా లేదా మరే ఇతర పదార్థలతో కలిపి ఉపయోగించకూడదు. దీని వలన ప్రాణ హాని జరిగే అవకాశము ఉంది. పాలు విరిగిపోయాయి అంటేనే అవి పనికి రానివి అని అర్థం.

## ఎవరు మాంసాహారం భుజించాలి?

భూమిపై ఏ జీవులనయితే చంపి తింటారో, ఆ లోకాల్లో ఆ జీవులు అతన్ని తింటాయి. అయితే శాస్త్రాలు చెప్పిన ప్రకారము కొన్ని వర్గాలవారు మాత్రమే మాంసాహారం భుజించాలి. తినాల్సిన వర్ణాల వారు తాము స్వయంగా చంపి తినటం కన్నా ఎవ్వరైనా ఇచ్చినవీ, కొన్నవీ, వండి పెట్టినవి తినవచ్చుననీ, అలా తినటం దోషరహితమనీ శాస్త్రాలు చెబుతున్నాయి.

## కార్తీక మాసములో తైలదీపాన్ని ఎందుకు వెలిగించమంటారు?

ఆ మాసాములో పగలు తక్కువా, రాత్రి ఎక్కువ. దానికి తోడు చలి. వేడిలో తేడా వస్తుంది. ఆరోగ్యంలో మార్పులు జరుగుతాయి. సాయం సమయంలో తైలదీపం వెలిగించటం ద్వారా అనగా నవ్వులు నూనె, ఆవునెయ్యితో వెలిగించిన దీపాన్ని చూడటం వల్ల కనులకి ఎంతో హాయి కలుగుతుంది. అనేక దృష్టి దోషాలు దూరమవుతాయి. చలి వలన, వాతావరణం వలన వచ్చిన శ్వాసకోశ వ్యాధులు దూరమవుతాయి. శరీరంలో తగ్గిన వేడి, దీపం వద్ద చేసిన పూజ ద్వారా



ఎంతో కొంత శరీరంలో ప్రవేశించి ఆరోగ్యాన్ని చేకూరుస్తుంది. ఇంకా ఇలా దీపం వెలిగించటం వల్ల చలికాలంలో పెరిగే క్రిమికీటకాలు నశిస్తాయి.

## పెరుగును ఎవరు తినవచ్చు?

వేడి శరీరము ఉన్నవారూ, బాగా జీర్ణశక్తి గలవారు పెరుగును తినవచ్చు. మామూలు వారు పెరుగంటే బాగా ఇష్టమున్న వారు కొన్ని సందర్భాలలో గడ్డపెరుగును తినాలంటే చరకసంహిత ప్రకారము మిరియాల పొడి, శొంఠిపొడి, సైంధవలవణము వంటివి కలిపి తింటే ఏ సమస్యలూ రాకుండా ఉంటాయి.

పరగడుపునా, భోజనముముందూ, రాత్రి సమయంలో, వసంత, గ్రీష్మ, శరదృతువులలో, చలికాలంలో అస్సలు పెరుగును తినకూడదు.

అలాగే ఉబ్బసమూ, చలిజ్వరమున్నవారు అస్సలు స్వీకరించకూడదు. పెరుగులో వీర్యవృద్ధిని పెంచే గుణమున్నా కఫాన్నీ, వాతాన్ని పెంచుతుంది. ఇది మనిషి ఆరోగ్యానికి మంచిది కాదు.

## ఏ మాంసాన్ని తినాలి?

శాస్త్రాలు నిర్ణయించిన వర్ణాల వారు చేప, కోడి, మేక తినవచ్చు. అయితే అడవి జంతువులను తినకూడదు. అనారోగ్యాన్ని తెచ్చిపెట్టే లక్షణాలు

అందులో ఉన్నాయి. శాస్త్రాల ప్రకారం పూర్వాభాద్ర, మూల, పూర్వాషాఢ, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ, శివరాత్రి, గ్రహణ సమయమున ముందు వెనుకా, సంక్రమణ సమయాలలో తినరాదు.

## అనేక పూలమాలలలో మరువం తప్పక వాడతారెందుకు?

కొన్ని రకాల పూలు సువాసనలనూ, అందాన్ని మాత్రమే ఇస్తాయి. వాటికి మరువం కలిపి పెట్టుకోవటం ద్వారా చెవి భాగాలు శుభ్రమవుతాయి. చీమూ, చెవిపోటు వంటివి ఈ మరువం వాసనా, స్పర్శ ద్వారా నివారణమవుతాయి. ఇంకా వినికిడి శక్తి కూడా బాగా పెరుగుతుంది. ప్రతి ఆచారాన్నీ, పద్ధతినీ మన పెద్దలు అన్ని వైపులా ఆలోచించి, పరిశోధించి మనకి అందించారు.

## కొత్తపెళ్ళికూతురు తెల్లచీర, మల్లెపూలు పెట్టుకోవటంలో పరమార్థం?

మల్లెపూవులో సుగంధపరిమళం అతి ఎక్కువ. ఈ వాసన ఎలాంటి వారికైనా కామపు కోర్కెలని



తెప్పిస్తుంది. భార్యాభర్తల మధ్య ఉండే చిన్న చిన్న బేధాలు తొలగి భార్యపై ఇష్టాన్నీ, మమకారాన్నీ పెంచి దగ్గర చేస్తుంది.

ఈ మల్లెపూల వాసన శరరాన్ని కుదురుగా ఉంచటమే కాకుండా వాతాన్ని తగ్గించి, రక్తంలో ఉండే దోషాలను పోగొట్టి, పుట్టే సంతానం ఆరోగ్యవంతంగా పుట్టేందుకు దోహదపడుతుంది.

## ఉసిరికాయ మీద ఆవునేతి దీపం ఎంత పుణ్యము?

అలా దీపం వెలిగించిన వారూ, పూజించినవారూ విష్ణుసాన్నిధ్యానికి చేరుతారని శ్రీవిష్ణు పురాణం శెలవిస్తోంది.

## వినాయక చవితి పత్రిలో ఎన్ని ఆరోగ్య రహస్యాలున్నాయి?

వినాయక చవితి వచ్చిందంటే పిల్లలకీ, పెద్దలకీ ఎంతో హడావుడి. పూజలో ఉపయోగించే పత్రి వాసనలను సంవత్సరంలో వక్కసారైనా ఆఘ్రాణించాలనీ, కనీసం ఓ గంటైనా వాటి వద్ద ఉండాలనీ విఘ్నాధిపతి పూజలో పత్రిని చేర్చారు. ఆ పత్రిలో ఔషధ గుణాలు ఎన్నో. వాటి సుగుణాలను

తెలుసుకోమని చెప్పటమే పెద్దలు వినాయక చవితి పర్వదినాన పత్రి వాడమని చెప్పటంలో పరమార్థం.

- మాచీపత్రం నులిపురుగులను హరించి అతి దప్పికను నివారిస్తుంది.
- మునగాకు కఫాన్నీ, వాతాన్నీ తగ్గించి శ్వాసని క్రమబద్ధం చేస్తుంది.
- బిల్వపత్రము మీదుగా పీల్చేగాలి తగిలినంతనే చర్మరోగాలు నశిస్తాయి. ఈ ఆకులతో పూజించటం ద్వారా గాలి ఆడని దేవాలయాల్లో, లేదా గృహములలో అనేక దుర్వాసనలు తొలగి భక్తులకి పవిత్రమైన భావన కలుగచేస్తాయి.
- గరిక ముక్కుకి సంబంధించిన వ్యాధులను అరికడుతుంది.
- ఉమ్మెత్త ఆకుల్లో వెంట్రుకలకు బలాన్నీ, నిగారింపునూ తెచ్చే ఔషధాలున్నాయి.
- తులసి ఆకుల గూర్చి ఎంత చెప్పినా ఇంకా మిగిలే ఉంటుంది. ఒక్క వినాయకచవితినాడు తప్ప ఈ తులసిని వినాయకుని పూజలో వాడకూడదు.
- మామిడి ఆకులలో అనేక పుండ్లను తగ్గించే గుణాలు అధికము.
- గన్నేరు ఆకు ద్వారా అనేక శరీర దురదలను తగ్గించవచ్చును.



- విష్ణుక్రాంత పత్రం అనేక వ్యాధులకు క్రిమిసంహారకంగా పనిచేస్తుంది.
- దానిమ్మఆకు తింటే చర్మం కాంతి వంతమవుతుంది.
- దేవదారు ఆకు వెక్కిళ్ళను, వాపులనూ తగ్గిస్తుంది.
- మరువము సువాసనలకు శ్వాసరోగాలూ, చెవి సంబంధిత వ్యాధులూ నయమవుతాయి.
- వావిలాకు తలకు పెట్టుకుంటే తలనొప్పి మటుమాయమవుతుంది.
- జాజిపత్రం తినటం ద్వారా కంఠం మధురంగా తయారై పలుకులు వెన్నెల చినుకుల్లా అవుతాయి.
- తీగ గరికెను కడుపులోని అనేక వికారాలను తగ్గించేందుకు ఆయుర్వేదంలో వాడతారు.
- జమ్మిఆకులో అతిసారం తగ్గించే లక్షణాలున్నాయి. ఈ ఆకురసం జుట్టు కుదుళ్ళను బలంగా చేస్తుంది.
- రావిచెట్టు ఆకు... ఈ చెట్టు క్రింద విద్యార్థి చదువుకుంటే జ్ఞాపకశక్తి పెరిగి ఏకసంథాగ్రహి అవుతాడు.
- మద్ది ఆకు ద్వారా అనేక వాత కఫాలను తగ్గించవచ్చు.
- జిల్లేడు ఆకు తలపై పెట్టుకొని స్నానం చెయ్యడం ద్వారా జలుబు తగ్గుతుంది.

అంతటి మహాశక్తివంతమైన, పవిత్రమైన ఆకులను ఒక్కొక్కటి స్పర్శించటం ద్వారా ఎంతో మేలు కలుగుతుందని పూర్వం ఋషులు ఈ మహాపూజా విధానాన్ని ఏర్పరిచారు.

## పాలను ఏ పాత్రలో కాయటం ద్వారా ఎంత శ్రేష్ఠమౌతాయి?

♠ రాగి పాత్రలో కాచటం ద్వారా ఆ పాలల్లో వీర్యవృద్ధి చేసే గుణం పెరుగుతుంది.

♠ కంచుపాత్రలో కాచిన పాలు త్రిదోషహరణము.

♠ మట్టి పాత్రలో కాయటమూ, సేవించటమూ అన్నింటికన్నా అత్యంత శ్రేష్ఠాతి శ్రేష్ఠము. దేహపుష్ఠితో పాటు శరీరంలో అనేక దోషాలుపోతాయి.

వెండి పాత్రలో త్రాగటము వల్ల ఆయుష్షు వృద్ధి. బంగారు పాత్రలో పాలు సేవించటం ద్వారా ముసలితనం చాలా ఆలస్యంగా దరి చేరుతుంది.

## సంవత్సరానికొక్కసారైనా ఉసిరి తినమని ఎందుకు చెప్పారు?

రకరకాల వాతావరణాలతో, అలసటతో, ఆందోళనలతో, ఉద్వేగాలతో సతమతమయ్యేవారికి



సంవత్సరం పొడవునా కలిగిన దోషాలను పోగొట్టే శక్తి ఉసిరికలో ఉన్నది. అందుకనే కార్తీకమాసంలో తప్పని సరిగా ఉసిరితో చేసిన వంటలు తినమన్నది. అయినా తింటారో లేదోనని కనీసం ఆ చెట్టు వాసననైనా పీల్చి ఆరోగ్యవంతులవ్వాలని ఉసిరి చెట్టు క్రింద ఒక్కసారైనా భోజనం చెయ్యమని పెద్దలు కార్తీక మాసంలో ఆ నియమం పెట్టారు.

## దాయాల్సింది వయసొక్కటే కాదు?

వేదధర్మశాస్త్రాలు ఖచ్చితంగా దాయాల్సినవి చెబుతూ తొలుత వయస్సుని పేర్కొన్నాయి. ఆ తర్వాత ధనాన్నీ, మీరు నిత్యం చేసే మంత్రపూజనూ, మీ కుటుంబంలోని వివాదాలనూ, మీరు సేవిస్తున్న ఔషధాలనూ, చేసిన దానాన్నీ, మీ ముఖ్య శరీర అవయవాలనీ, మీకు జరిగిన పరాభవాన్నీ దాయమని గుట్టుగా కడుపులో పెట్టుకోమని చెబుతున్నాయి.

## ఎలాంటి వారికి అదృష్టము కలిసి వస్తుంది?

పురుషులకి గానీ, స్త్రీలకి గానీ నోరు చిన్నదిగా ఉండాలి. అలాగే కనులు పెద్దవిగా ఉండాలి. మోకాళ్ళు కలిసే ప్రదేశంలోనూ, మోకాళ్ళ మధ్యా తగు ఖాళీ

ఉంటే అదృష్టం రకరకాలుగా కలిసి వస్తుంది. చేతుల విషయానికొస్తే ఆరువేళ్ళ వారికి అంత అదృష్టము ఉండదు. వారు కష్టం ద్వారానే సాధించాలి.

## విజయదశమి రోజు జమ్మి చెట్టునెందుకు పూజిస్తారు?

విరాటపర్వం తర్వాత పాండవులు అజ్ఞాతవాసం వీడి శమీ వృక్షాన్ని పూజించి వృక్షంపై పెట్టిన ఆయుధాలు తీసుకొని యుద్ధం చేసి అపూర్వ విజయాన్ని సాధిస్తారు. శమీ వృక్షం అంతటి శక్తివంతమైనది కాబట్టే అజ్ఞాతవాస కాలంలో తమ ఆయుధాలను ఆ వృక్షం మీద ఉంచారు. శమీ వృక్షమును పూజించినా, ఆ ఆకులను పెద్దలకిచ్చి పాదాలకి నమస్కారం చేసినా ఆ సంవత్సరమంతా విజయపథమే అవుతుందని పురాణ శాస్త్రాల సారాంశము కూడా.

## ఆడపిల్ల అందంగా ఉంటే సుఖపడుతుందా?

ఆడపిల్ల ఎంత అందగత్తెయితే అంత సుఖపడుతుంది. ఒక్కోసారి ఆ అందమే శత్రువై ఆమెని కబళిస్తుంది. అందమైన ఆడవాళ్ళూ, మహా అందగత్తెలూ, విపరీతమైన రంగు కలవారూ ఎంతో



జ్ఞానవంతులవ్వాలి. ఆవేశాన్నీ, కోపాన్నీ అదుపులో ఉంచుకోవాలి. ముఖ్యంగా పెద్దల మాట వినటం ద్వారానే వారి జీవితం సుఖవంతమవుతుంది. ధనమూ, అధికారమూ ఎలా అహంకారాన్ని పెంచుతాయో, ఆడపిల్లలకి తమ అందము అంతకుమించిన అహంకారాన్ని కలిగిస్తుంది.

## కొత్త ఇంటి ప్రవేశమప్పుడు పాలు పొంగించమనేదెందుకు?

గతంలో కట్టెల పొయ్యి మీద వంట చేసేవారు. శుభపర్వదినాల్లో రెండు బియ్యపు గింజలను పొయ్యిలో వేసేవారు. అలా మాడిన బియ్యపు వాసన వల్ల వంటగదిలోని అనేక క్రిమికీటకాలు దూరంగా తొలగి పోతాయి. కాలం మారుతుండటంతో, బ్రతుకు తెరువు కోసం అనేక చోట్లకు జనం తరలి వెళ్తుండటంతో వెళ్ళిన చోట పాలు పొంగించి బియ్యం వేసి ఉడికించి పొంగలిని నైవేద్యంగా భగవంతునికి సమర్పించమని పెద్దలు ఆచారంగా ఈ నియమాన్ని పెట్టారు.

## చిన్నపిల్లలు బిందెలను కొడుతుంటే పెద్దలు తిట్టేదెందుకు?

గుడిలో గంట దేవునికి మేలుకొలుపు. శంఖానాదము విజయానికి గుర్తు. ధనుష్ఠంకారము

సమరోత్సవానికి పిలుపు. రెండు చేతులూ కలిపి కొడితే అద్భుతానికి గుర్తు. అదే బిందెల మీద కొడితే దెయ్యాలకి ఆహ్వానము.

## దైవపూజలు, ధర్మకార్యాల సమయంలో ఆచమనము చేసేటప్పుడు గుర్తుంచుకోవాల్సినవి?

- ♠ ఆచమనాన్ని శబ్దం చేస్తూ తీసుకుంటే తీసుకున్నది రక్తంతో సమానము.
- ♠ మూడుసార్లు ఒకేసారి పోసుకొని త్రాగకూడదు. విడివిడిగా మూడుసార్లు తీసుకోవాలి.
- ♠ అలాగే ఆచమనం నీరు దంతాలకి తగలకూడదు.
- ♠ ఆచమనం చేసే వారికి ఉంగరం తప్పని సరిగా ఉండాలి.
- ♠ అలాగే తీర్థాన్ని తొలుత తను తీసుకుని తర్వాత అందరికీ ఇవ్వాలి.

## ఉదయాన్నే పూజకు ఉపక్రమిస్తూ గుర్తుంచుకోవాల్సినవి?

- ♠ సకల పూజాద్రవ్యములను దక్షిణభాగము వైపు ఉంచుకోవాలి.



- ♠ ఇంట్లో చెట్టే కదానీ, రేపు మళ్ళీ పూస్తుందనీ అన్ని పూలూ కోయకూడదు. పూలులేని చెట్టుని చూడకూడదు.
- ♠ స్టీలు వంటి పళ్ళెరములలో పూజాద్రవ్యములు ఉంచుట, అక్షింతలు కలుపుటా, గౌరీదేవిని తయారు చేయుట చేయకూడదు.
- ♠ ఒకేసారి దబ్బా అక్షింతలు చేసుకుని అవే వాడకూడదు. ఏ రోజు పూలు ఆ రోజు వాడినట్టుగా అక్షింతలనూ వాడాలి.
- ♠ పక్కింటివారి పూల చెట్ల నుంచి కోసి తెచ్చిన పూలతో చేసే పూజాఫలము వారికే చెందుతుంది.
- ♠ చాతుర్మాస్య దీక్ష రోజుల్లో తులసిని కదపరాదు. వేరే ప్రదేశమునకు మార్చరాదు.
- ♠ శుక్రవారం లక్ష్మీదేవి, సరస్వతీ దేవి, గణపతి పూజలు ఏమి చేసిన పూజ చేస్తున్నప్పుడు ఆవాహన చేయాలి గానీ, పూజానంతరం ఉద్వాసన చేయరాదు.

## పారాణి పెట్టడంలో సంప్రదాయముతో పాటు ఆరోగ్యం కూడా?

పసుపులో సున్నం కలిపితే పారాణి తయారవుతుంది. వివాహ సమయంలో వధూవరులకూ, ఆడపడు

చలకూ, వియ్యపురాలికీ, ఇంకా శ్రావణ మాసంలో పూజా కార్యక్రమముల సమయాలలో ముత్తైదువుల కాళ్ళకి పారాణి పెట్టడం మన సాంప్రదాయము. అలాగే నూతన వధూవరులకు పారాణి పెట్టడమే కాకుండా పారాణి నీళ్ళ దిష్టి కూడా తీస్తారు.

కాలివేళ్ళ నరాలకీ, హృదయానికీ, గర్భాశయానికీ అవినాభావ సంబంధము ఉండటం వల్ల ఆ భాగాల్లో ఉన్న అనేక రుగ్మతల వల్ల మనసు వికలం అవ్వకుండా పారాణి పెడతారు.

అలా పారాణి ఆచారంగా పలుసార్లు పెట్టడం వల్ల కాలిపగుళ్ళు రాకుండా పాదాలు సున్నితంగా, అందంగా తయారవుతాయి.

## ఆషాఢమాసంలో స్త్రీలను గోరింటాకు పెట్టుకోమని చెప్పేదెందుకు?

స్త్రీకి జీవితంలో సగభాగం వంటగదిలోనూ, నీటిలోనూ గడుస్తుంది. వాళ్ళ క్షేమం గూర్చీ, ఆరోగ్యం గూర్చే ఆ మాసంలో తప్పకుండా గోరింటాకు పెట్టుకోవాలనీ, ఆనందంగా శ్రీమహాలక్ష్మిలా కళకళలాడుతూ ఉండాలనీ నియమం పెట్టారు. దానితో పాటు ఆ కాలం వర్షాకాలము. ఆడవాళ్ళ చేతులూ,



కాళ్ళూ ఆ వాతవరణానికి తడిచి పుండ్లు పడి, పగుళ్ళు ఏర్పడతాయి. గోరింటాకు పెట్టుకోవటం ద్వారా చాలా వరకు ఆ సమస్య నుంచి వారు రక్షించబడాలనే ఆ ఆచారం పెట్టారు.

## దానం కన్నా, అన్న దానం కన్నా గొప్ప పుణ్యకార్యం?

అనేక గోవులూ, ధనమూ దానం ఇవ్వటం కంటే పదిమందికి అన్నం పెట్టడం పుణ్యకార్యం. చేపల కూర పెట్టడం కన్నా చేపలు పట్టడం నేర్పించటమ కోటి రెట్ల పుణ్య కార్యము. అనగా అన్నం పెట్టడం కన్నా అన్నాన్ని వచ్చే మార్గాన్ని చూపించటము గొప్ప పుణ్యకార్యము.

## గోకులాష్టమి రోజు అర్థరాత్రి నైవేద్యం పెట్టేదెందుకు?

ఈ పండగ చిన్నా పెద్దా తేడా లేకుండా ఆనందంగా చేసుకుంటారు. చిన్న కృష్ణుడి పాదముద్రలు ఇంటిబైట నుంచి ఇంట్లోకి వేస్తారు. బుడి బుడి అడుగులతో తమ ఇంట్లోకి చిన్నికృష్ణయ్య రావాలని కోరుకుంటారు. రాత్రి పన్నెండుగంటలకి అనగా శ్రీకృష్ణుడు పుట్టిన సమయానికి.... అప్పుడే పుట్టిన బాలకృష్ణునికి నైవేద్యం పెడతారు.

## భగవంతుని పూజకు ఏ పూలు ఎన్ని రోజుల వరకూ అర్పించవచ్చు?

తామరపూలు ఏడు రోజుల వరకూ, తులసి కోసిన దగ్గర్నించి ఒక సంవత్సరము వరకూ అదే మారేడు మూడు సంవత్సరముల వరకూ స్వామికి అర్పించవచ్చు.

## రథసప్తమినాడు జిల్లేడు ఆకులను తలపై, భుజాలపై పెట్టుకొని ఎందుకు స్నానం చేస్తారు?

జిల్లేడు ఆకులకు సూర్యరశ్మి తగలటం వల్ల ఓ అద్భుత శక్తి వస్తుంది. అందుకే రథసప్తమినాడు ఏడు జిల్లేడు ఆకులను తలపై పెట్టుకొని, వాటి మీద రేగుపళ్ళు పెట్టి సూర్యదేవునికి నమస్కారం చేసి మూడుసార్లు నదిలో మునిగి స్నానము చేయమని చెప్తారు. ఈ విధంగా చేయటం వల్ల శిరస్సు నుంచి శరీరానికి నూతన శక్తి ఆవహించి, శరీర దోషాలన్నీ మటుమాయమౌతాయి. అందుకే సూర్యుభగవానుని పూజించే ఆ పర్వదినాన ఆ నియమాన్ని పెట్టారు.



## గృహంలో దేవతా విగ్రహాలు రెండు అంగుళాలు మించి ఉండకూడదా?

గృహంలోని దేవతా విగ్రహము రెండు అంగుళాలు మించి ఉండకపోతే మంచిది. ఆ ఎత్తు దాటితే స్వామికి మీరు చేసే పూజ తృప్తినివ్వదు. దానివల్ల అనవసర పరిణామాలు ఎదుర్కోవలసి వస్తుంది. అలాగే కుంకుమ పూజ చేస్తున్నప్పుడు అమ్మవారి ముఖం మీద పడేలా పూజ చేయకూడదు.

## నవగ్రహాల ప్రదక్షిణా, పూజ తర్వాత తప్పనిసరిగా చెయ్యాల్సినవి?

ఆలయ ప్రాంగణములో కాళ్ళు కడుక్కోకూడదు. ఆలయం బైటా, లేదా బావి వద్దా, నదీ ప్రాంతంలో కడుక్కోవాలి. ఇంటికొచ్చి కాళ్ళను కడుక్కోకూడదు.

## ఊరేగింపులూ, ఉత్సవాల సమయంలో దేవుని ఉత్సవ విగ్రహాల ముందు బిందెతో నీళ్ళెందుకుపోస్తారు?

అది స్వామికి స్వాగతం చెప్పటం. ఇంటి ముందుకు రాగానే బిందెనీళ్ళను నిలువుగా పోసి, తమ

ఇంటికి ఆహ్వానిస్తున్నామని చెప్పటమే ఈ చర్యలోని పరమార్థము.

అడ్డంగా పోయరాదని శాస్త్రాలు చెబుతున్నాయి. నిలువుగా పోస్తే ఇంటికి శుభము. అడ్డంగా పోస్తే అశుభము.

**అనేక రకాల అనర్థాలు అనువైన అవకాశాల కోసం అనుక్షణమూ అదేపనిగా ఎదురు చూస్తుంటాయి.**

**- కాళిదాసు**

## శ్రీరామజననమెప్పుడు?

- శ్రీరామ జననం - వైవస్వంత మన్వంతర, పంచమ త్రేతాయుగ చతుర్థ భాగమున 30,000 సం॥ అగు విళంభినామ సం॥ర చైత్ర శుద్ధ నవమి బుధవారం పునర్వసూ నక్షత్ర యుక్త కర్కాటక లగ్నమున అభిజిత్ లగ్నమున.
- నామకరణము - చైత్ర బహుళ సప్తమి.
- ఉపనయనము - పరాభవనామ సం॥ చైత్ర శుద్ధమున రాముని ఎనిమిదవ ఏట.
- సౌమ్య నామ సం॥ర మాఘ బహుళ విదియనాడు, విశ్వామిత్రుడు యాగ సంరక్షణార్థము రామ



లక్ష్మణులను తీసికొని బయలుదేరుట. (అప్పటికి రాముని వయస్సు 11 సంవత్సరముల 10 మాసముల 8 రోజులు).

## మూడురంగుల దారాన్ని ఉపయోగించి దీపాన్ని వెలిగించేది ఎందుకు?

పురాతనమైన ఈ సాంప్రదాయములో తమ వారంటే తమకున్న ప్రేమను తెలియచెప్పే చర్య ఉంది. ఇంట్లో యజమానికి జబ్బు చేస్తే మూడు రంగుల దారాలతో ఏడు పేటల వత్తి చేసి నెయ్యి, నూనె, ఆముదం గల మట్టి ప్రమిదలలో వత్తి వేసి వెలిగిస్తారు.

**ప్రపంచంలో మనిషి ఎంత ఎదిగినా, అతనికి అయిదు విషయాలు మాత్రం ఎంత తెలిసినా తెలియనట్లే. అవి - జీవించే వయసు, రోగాలు, చావురాకడ, శరీరంలో పతనావస్థలు, మరణించాక జరిగే సంగతులు.**

**- జాతక కథలు**

## నైవేద్యం పెట్టేటప్పుడు ముఖ్యంగా గుర్తుంచుకోవాల్సినది?

స్వామి నైవేద్యం కోసం చేసిన దాంట్లోంచి కొంత విడిగా తీసిపెట్టకూడదు. మొత్తం గిన్నెనంతా పెట్టాలి. చాలా మంది నైవేద్యం పెడతారుగానీ, మంచి నీళ్ళు పెట్టరు. కాన తప్పనిసరిగా మంచి నీళ్ళు కూడా నైవేద్యంతో కలిపి పెట్టాలి. అలాగే పంచదారకు బదులు బెల్లంతో వండినవే నైవేద్యంగా పెట్టాలి.

**మనం మంచివారితో సాంగత్యం చేస్తూ జీవనం సాగిస్తుంటే, చెడు గుణాలు సైతం మంచి గుణాలుగా పరిగణించబడుతుంటాయి.**

**- విదురుడు**

## మామిడి పండును దానమిచ్చాకగానీ లేదా గుళ్ళో ఇచ్చాకగానీ తినేదెందుకు?

ఎండాకాలంలో వచ్చే మామిడి పండును స్వామికి సమర్పించిగానీ, దానంగా ఇచ్చిగానీ తినరు. దానికి



కారణం వైశాఖ మాసంలో అనగా సంవత్సరంలో ఒక్కసారే వచ్చే ఈ పండును దానమిస్తే దేవతలు సంతృప్తులవుతారు. ఇంకా మామిడిపండునే కాక ఏ పండును దానమిచ్చినా వారి పితృదేవతలు పరమానందం చెందుతారు. అలాగే దోస, బెల్లం, చెరకు వంటివి దానం చేస్తే పాపాలు నశిస్తాయి. అలాగే ఈ మాసంలో మజ్జిగను దానమిస్తే అపారధనలాభమని శాస్త్రాలు శెలవిస్తున్నాయి.

**కోపం యమధర్మరాజు లాంటిది. తృష్ణ వైతరిణి లాంటిది. విద్య కామధేనువు లాంటిది. ఇక సంతృప్తి దేవరాజైన ఇంద్రుడి నందనవనం లాంటిది.**

**- చాణక్యుడు**

## పూజాదికాలు నిర్వహించేటప్పుడు ఏ రంగు పట్టు బట్ట కట్టడం మంచిది?

ఎర్రని పట్టు పంచెలూ, చీరలూ అనవసర ఆవేశానికీ, కోపాలకీ కారణమవుతాయి. పచ్చని పట్టు

బట్టలు మంగళకరమైనవి. శరీరంలోని ప్రాణశక్తిని నింపేవి. ఏక రంగు పట్టు ధైర్యాన్నీ, తెల్లని పట్టుబట్ట శుభాన్నీ తెచ్చి పెడుతుంది. అంచులేని పట్టుబట్ట అశౌచ దోషము కలది. పట్టుబట్ట కట్టుకొని భోజనం చేస్తే ఆ తర్వాత మళ్ళీ శుభ్రపరచకుండా ఉపయోగించకూడదు.

**సాహిత్యం, సంగీతం, కళలు - వీటితో పరిచయమే లేని మనిషి సాక్షాత్తూ తోక, కొమ్ములు లేని పశువుతో సమానము.**

**- భర్తృహరి**

## చండ ప్రదక్షిణము చేస్తే ముప్పయి వేల ప్రదక్షిణములు చేసిన ఫలమా?

అవునని శాస్త్రాలు చెబుతున్నాయి. శివాలయంలో ప్రదక్షిణ చేస్తున్నప్పుడు సోమసూత్రాన్ని దాటకూడదు. సోమసూత్రం ఇవతల నుంచి ధ్వజస్థంభం వరకూ, ధ్వజస్థంభం నుంచి మళ్ళీ ప్రదక్షిణగా సోమసూత్రం వరకూ, అక్కణ్నించి వెనక్కి తిరిగి ధ్వజస్థంభం వరకూ, ధ్వజస్థంభం నుంచి ముందుకు కదలి సోమసూత్రం వరకూ, తిరిగి మళ్ళీ వచ్చిన దిశగా ధ్వజస్థంభం వరకూ,



మళ్ళీ అలానే ధ్వజస్థంభం నుంచి సాగి సోమసూత్రం వరకూ, తిరిగి సోమసూత్రం నుంచి వెనుక ధ్వజం వరకూ, అక్కడ్నించి ముందుకు సోమసూత్రం వరకూ, సోమ సూత్రం నుంచి ధ్వజం వద్దకూ, ఆపై శివాలయ ధ్వజ స్థంభం ఎడమ పక్క వెళ్ళాలి. అదే చండ ప్రదక్షిణ. రెండోసారి ప్రదక్షిణ చేస్తే ధ్వజస్థంభాన్ని తాకరాదు.

**వేలాది అశ్వమేధాలకన్నా సత్యమే గొప్పది.**

**- వేదవ్యాసుడు**

## మహారుద్రునికి అభిషేకం చేస్తే ఏ ఫలం వస్తుంది? (రుద్రకా మ్యార్చనలో)

ఆవుపాలతో అభిషేకించిన సర్వసౌఖ్యములు. ఆవు పెరుగుతో ఆరోగ్యం, అనంతసౌఖ్యములు, బలం. ఆవు నెయ్యితో ధనాభివృద్ధి.మెత్తని పంచదారతో దుఃఖాలు మటుమాయం. తేనెతో తేజోవృద్ధి. భస్మ జలముతో మహాపాపాలు నశిస్తాయి. గంధోదకముతో పుత్రసంతానము కలుగుతుంది. పుష్పోదకముతో భూమి, పంటల ద్వారా ఆదాయం. బిల్వజలముతో

సకల భోగభాగ్యములు. దుర్వోదకముతో నష్టద్రవ్యప్రాప్తి. నువ్వుల నూనెతో అపమృత్యు హరం.

రుద్రాక్షోదకముతో అష్టైశ్వర్యాలు. సువర్ణ జలముతో అనుకోని అదృష్టము.

అన్నంతో రాజ్యప్రాప్తి, ఆయుర్వృద్ధి, సుఖ జీవనం. ద్రాక్షరసంతో సకల కార్యాల్లో విజయం. ఖర్జూర ఫలంతో శత్రువులు మిత్రులవుతారు. నేరేడు పండ్ల రసంతో ఆధ్యాత్మిక భావం.

కస్తూరీ జలముతో అధికారము. నవరత్న జలముతో ధాన్యం, గృహ, గోప్రాప్తి.

మామిడి పండ్ల రసంతో అనేక మొండి వ్యాధులు మటుమాయం. పసుపు నీళ్ళతో సకల కుటుంబానికీ మంగళప్రదం.

**చేపలు రాత్రింబవళ్ళు నీళ్ళలోనే వుంటాయి. అయినా, వాటి వాసన అలాగే వుంటుంది. అదే విధంగా మనిషి శరీరాన్ని ఎంత కడుక్కున్నా ఏమి లాభం? మనుస్సులోని మాలిన్యాలను కడగలేకపోయాక?**

**- కబీరుదాసు**



## మందార పుష్పాలతో ఏ దేవతలని పూజించాలి?

శ్రీమహాలక్ష్మీదేవినీ, అమ్మవారి అంశగల వారినే కాకుండా లక్ష్మీదేవి ప్రియనాథుడు శ్రీమహావిష్ణువుని పూజించిన శ్రీమహాలక్ష్మి ఆశీర్వాదం కూడా లభిస్తుంది.

## వేటివల్ల ప్రయోజనం ఉండదు?

- ♠ బొట్టుపెట్టుకోని నుదురు
- ♠ మంచిపనులకి ఉపయోగించని ధనము
- ♠ అర్జునుడు వంటి శిష్యుడు లేని గురువు
- ♠ దక్షతలేని ప్రభువు
- ♠ భర్తకు భయపడని భార్య
- ♠ పదునులేని కత్తి
- ♠ పాలు ఇవ్వని గేదెలూ
- ♠ అవసరానికి ఆదుకోని స్నేహితుడూ
- ♠ వీరంతా ఉన్నా ఒక్కటే లేకపోయినా ఒక్కటే.

## కాకులకెందుకు అన్నం పెడతారు?

మనకి దగ్గరిగా ఉండే పక్షి కాకి. కాకికి గతాగతాలు తెలుసునని శాస్త్రాలు చెబుతున్నాయి. పోయిన జీవుడు కాకి రూపంలో అయిన వాళ్ళ చుట్టూనే

తిరుగుతాడనీ, అన్నాన్ని పెట్టినప్పుడు అన్నాన్ని ముట్టుకుంటే వాని కోరికలు తీరినట్టు, ముట్టుకోకపోతే కోరికలు తీరనట్టూ శాస్త్రం చెబుతోంది. అలాగే కాకులరిస్తే చుట్టాలొస్తారనే వారు, నిజంగానే వచ్చేవారు కూడా.

**మనిషికి మంచి మనసుండాలే గాని, నానా విధాల సంపదలూ వాటంతటఅవే వస్తుంటాయి.**

**- తులసీదాస్**

## తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి పాదరక్షలెందుకు అరుగుతాయి?

ఏడుకొండల మీద ఉన్న స్వామి పాద రక్షలు బహుపెద్దవి.

కాలం గడిచేకొద్దీ అరిగిపోతుంటాయి. స్వామి రోజూ కొండ దిగి అలివేలు మంగను చూడటానికి ఆ పాదరక్షలు ధరించి ఏడుకొండలు ఎక్కీ దిగటంతో అరిగిపోతుంటాయని అనాదిగా చెప్తున్న అద్భుతమైన, అందరూ నమ్మే చిదంబర రహస్యం.



## ధ్వజస్థంభము లేదా దేవాలయపు గోపురం నీడ పడిన ప్రదేశంలో ఎందుకు కాపురం ఉండకూడదు?

పరమాత్మ ఆవహించిన ప్రదేశము. ఆ ప్రదేశము దేవుని స్వంతము. అలా నీడపడటం ద్వారా, సూర్యరశ్మి పడాల్సినంత పడదు. తర్వాత ఎన్నో అనారోగ్యాలు. అందుకే నీడపడకూడదని శాస్త్రం చెబుతోంది. తాను ఉన్న ప్రదేశములో అనారోగ్యం స్వామికి ఎంతమాత్రం ఇష్టం ఉండదు కదా.

**గడ్డి వామును తగలబెట్టడం వల్ల సముద్రం వెచ్చబడదు. అలాగే ఎవరో, ఎందుకో అలిగారనో, కోపం తెచ్చు కున్నారనో - మంచి మనుష్యుల మనసులు కోపంతో వేడెక్కవు.**

**- హితోపదేశం**

## ఏ విధంగా నిద్రించాలి?

తల భాగము ఎత్తుగా శరీర భాగము దిగువగా ఉండేలా నిద్రించాలి. దూలమూ, పై కప్పు లేని

ప్రదేశాల్లోనూ, వృక్షముల క్రింద నిద్రించకూడదు. ఇక నిద్రించే మంచము మర్రి, రావి, జువ్వి, నేరేడు వంటి వృక్షములతో చేసినది అయి వుండాలని శాస్త్రం శెలవిస్తోంది.

అలాగే ధాన్యపు బస్తాలమీదా, శుభకార్యాలప్పుడు స్త్రీల మధ్యా నిద్రించకూడదు. రాతి మీదా, సింహ ద్వారముపై తల ఉంచి నిద్రించరాదు. తలవైపు దీపం ఉండకుండా నిద్రించాలి. వట్టి నేల మనలోని విద్యుత్‌ని లాగేసుకొని, శక్తిహీనుణ్ని చేస్తుంది. చుట్టూ అందరూ కూర్చుని ఉన్నప్పుడూ నేలపై నిద్రించరాదు. తెలియక పసిపిల్లలు వంటి వారు నిద్రిస్తే అలా నిద్రించకుండా చూసుకోవడం పెద్దల కర్తవ్యం.

## కన్యాదానం వల్ల ఎన్ని తరాలు తరిస్తాయి?

వివాహంలో వివాహ తంతును నిర్వహించే వధువు తల్లీ తండ్రీ, వరుని తల్లీ తండ్రీ జనకమహా రాజూ, దశరథమహారాజూ దంపతులతో సమానం. వారు ఆ వివాహ తంతును జరిపించటం ద్వారా, కన్యాదానం ఇవ్వటం వల్ల కన్య తల్లీ, తండ్రికే కాక అటు పదితరాలు ఇటు పదితరాల వారికి బ్రహ్మ లోకంలో పుణ్యం సిద్ధిస్తుంది.



**మన వాకిట నిలిచిన మంచివారినీ, మహా పురుషులనీ దర్శించుకుంటే చాలు, పుణ్యక్షేత్రాల్లో చేసిన కోట్లాది తీర్థ స్నానాలకి మించిన ఫలం లభిస్తుంది.**

**- సూరదాసు**

## దీపావళి టపాసుల ఆచార పరమార్థమేమిటి?

శ్రావణ భాద్రపద మాసాల్లో వర్షపాతము అధికము. భూపరిస్థితులని బట్టి అనేక అంటు వ్యాధులు ప్రబలిపోతాయి. ప్రజలు తీవ్ర అనారోగ్యానికి గురవుతారు. భూమిలోని ఆవిరి కూడా చెడి మరింత వ్యాధులకి ఊతం ఇస్తుంది. అందుకే లక్కా, నెయ్యి, నూనె, పాదరసాలు, గంధకము వంటి అనేక ప్రేలుడు పదార్థాలతో టపాసులు కాల్చేలా ఆచారం పెట్టారు. ఆ వెలుగుకీ, శబ్దాలకీ అనేక సూక్ష్మక్రిములు సంపూర్ణంగా నశిస్తాయి. దాని వల్ల ప్రజల ఆరోగ్యంతో పాటు, ప్రజల నివాస ప్రాంతంలో, పంట పొలాలకీ

చెరుపు చేసే అనేక క్రిములు నశించి అంతా సస్యశ్యామలమవ్వటానికి శ్రీ కృష్ణుని కాలం నుంచి ఈ ఆచారం అనాదిగా నిర్వహిస్తున్నారు.

**మనుషుల్లో వైరానికి అయిదు కారణాలుంటాయి- స్త్రీలు, ఆస్తి పాస్తులు, కఠోరమైన వాక్కులు, కులమత ద్వేషాలు, ఎప్పుడో తెలిసో తెలియకో చేసిన అపరాధాలు.**

**- మహాభారతం**

## తర్పణములూ, తిల తర్పణములెందుకు?

దైవ పితృకార్యాల్లో వదిలే తర్పణములో ఉన్న రహస్యమూ, ప్రాముఖ్యతా అంతా ఇంతా కాదు. మానవ శరీరం సదా విద్యుత్ పుట్టిస్తూ, విసర్జిస్తూ ఉంటుంది. ఈ ప్రయత్నంలో విద్యుత్ ఎక్కువైనా, తక్కువైనాగాని అనారోగ్యం కలుగుతుంది. జలతర్పణము ద్వారా శరీరంలోని ఎక్కువ విద్యుత్ విసర్జింపబడుతుంది. తిలతర్పణములో నవధాన్యాలను నీటితో కలిపి



తర్పణములు వదులుతారు. నువ్వులు చేతిలో ఉంచుకొని నీటిలో వదలటం వల్ల విద్యుత్ విసర్జించబడటం కూడా జరుగుతుంది. ఆ ప్రయత్నంలో ఎక్కువ విద్యుత్ పోకుండా సరిపాళ్ళలో శరీరానికి కావలసిన విద్యుత్‌ను ఉంచి, అనవసరమైన విద్యుత్‌ను శరీరాన్నించి పంపిస్తాయి నువ్వులు. స్త్రీలు తర్పణము వదలకపోయినా వారి అలంకారాలైన వాటి ద్వారా విద్యుత్ ఉత్పాదనా, విసర్జనా జరుగుతుంది.

**విధి యిష్టంగా వచ్చేవారిని నడిపించుకు వెళుతుంది. అదే అయిష్టంగా వచ్చేవారిని లాక్కువెళుతుంది.**

**- పురాతన శాస్త్రం**

## ఆరతి ఇచ్చిన ఎర్రనీళ్ళను, ఇంటి ముందెందుకు చల్లుతారు?

ఎరుపుకి కోపాన్నీ, యుద్ధాన్ని సూచించే లక్షణాలున్నా, ఆ రంగు కనులకి ఎంతో మంచిది. రవికి ఎరుపు రంగన్న ఎంతో ప్రీతి. ఎరుపు చూసినంతనే కొన్ని వ్యాధులు దూరమవుతాయి. అందుకే ఎర్రనీళ్ళతో ఆరతి ఇస్తూ, తాము చూడటమే

కాకుండా, చూసిన వారికి కూడా ఎరుపు ప్రభావం వల్ల జరగాల్సిన శరీర శుభాలు జరగాలని, అలా తీసిన ఆరతి నీళ్ళను ఇంటి ఆవరణలో చల్లుతారు. ఆరతి ఇచ్చే ఎరుపు నీళ్ళు వేరూ, దిష్టి కోసం తీసే ఎరుపు నీళ్ళు వేరు.

**మనిషి జీవితంలోని ఎన్నో భారాలనీ, బాధలనీ నివారించి, తేలికపరిచి, ఆనందాన్ని, ఉల్లాసాన్నీ విరబూయించ గలిగేది.**
**- ఒకే ఒకటి... అదే రెండక్షరాల ప్రేమ.**

## ఏకశ్లోకంలో రామాయణగాథ పుణ్యఫలమేనా?

రామాయణాన్ని ఒకసారి చదివిన వారు, మళ్ళీ ఈ ఏకశ్లోకము చదివితే రామాయణము చదివినంత పుణ్యము.

"అదౌ రామ తపోవనాది గమనం
హత్వా మృగం కాంచనం
వైదేహీ హరణం, జటాయు మరణం,
సుగ్రీవ సంభాషణం



వాలీ నిగ్రహణం, సముద్ర తరణం,
లంకాపురీ దహనం
పశ్చాద్రావణ కుంభకర్ణ హననం,
ఏ తద్ధి రామాయణం"

## పగలెవరు నిద్రపోవచ్చు?

శృంగార సంభోగములు జరిపినవారూ, అధిక శ్రమచేసినవారూ, అనారోగ్యము గలవారూ, గర్భిణీలూ, చిన్న పిల్లలూ, వృద్ధులూ వీరంతా పగలు కొంతసేపు నిద్రించవచ్చు. ఇక రాత్రి విషయానికొస్తే ఆరుగంటల నిద్ర అమృతమయమైన నిద్రని ఆయుర్వేద శాస్త్రం చెబుతోంది.

**ఒక వ్యక్తి వంశం మంచిదో కాదో, అతను వీరుడో, పిరికివాడో, పవిత్రమైన వాడో, అపవిత్రమైన వాడో... తెలిపేది, ఆ వ్యక్తి ఆచరణ తీరే. -వాల్మీకి.**

## నోముకీ, వ్రతానికీ తేడా?

మనస్సుని కేవలం భగవంతునిపైనే లగ్నం చేసి స్వామిని పూజించి ధ్యానం చేసేదే నోము. అనగా

శ్రావణమంగళవారం నోము, తిరుప్పావై నోము, ఉండ్రాళ్ళ తద్ది నోము, అట్లతద్ది నోము వంటివి. సన్నని చిల్లులు పడేలా అట్లుపోసి ముత్తైదువులకు భక్తిపూర్వకంగా ఇవ్వటము అట్లతద్ది నోము విధానంలో ఉంటుంది. అటువంటి దైవ సంబంధిత ఆరోగ్య, పుణ్యాలనిచ్చేవి నోములు.

అత్యంత నియమనిష్ఠలతో, మంత్రోచ్చాటనలతో, ధూప దీప నైవేద్యాలతో సేవించేది వ్రతము.

## పసుపు కలిపిన అక్షింతలు వేసి ఆశీర్వదించమనేది ఎందుకు?

బియ్యము చంద్రునికి చెందిన ధాన్యము. మనః కారకుడైన చంద్రుడి ప్రభావం బియ్యంపై ఉంటుంది. మానవుని దేహం ఓ విద్యుత్ వలయం.

ఆశీర్వదించేవారు చేతిలోకి బియ్యం తీసుకోగానే వారిలోని విద్యుత్ బియ్యానికి అందుతుంది. అలాగే ఆశీర్వదించే వారికి చర్మవ్యాధులు ఉంటే ఆ ప్రభావం కూడా ఆశీర్వాదం తీసుకునే వారిపై పడుతుంది.

అందుకే క్రిమిసంహారకమైన పసుపుని కలిపి, కేవలం విద్యుత్ మాత్రమే స్వీకరించేలా చేసి పసుపు కలిపిన బియ్యాన్ని అనగా అక్షింతలనిచ్చి ఆశీర్వదించమంటారు. పసుపు లేదా కుంకుమ గానీ



కలపని అక్షింతలను పూజాకార్యక్రమాల్లోగానీ, శుభకార్యాల్లోగానీ వాడరు.

**పనిచెయ్యడం యిష్టంలేని వారికీ, విపరీతంగా తినే మహాతిండి పోతులకీ, క్రూరమైన స్వభావం కలిగి వున్న వారికీ మనం తావివ్వ కూడదు.**

**- విదురుడు**

## సంగమించకూడని రోజులు?

ఋతుమతయిన స్త్రీని నాలుగురోజుల వరకూ తాకకూడదు. ప్రసవానంతరము ఒక్కనెల వరకూ దూరంగా ఉండాలి.

ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం, సంధ్యాకాలంలో సంగమము సరికాదు. అలా సంగమించిన వాతప్రకోపాలు కలుగుతాయి. సంధ్యా కాలమందు కలిసినా గర్భం నిలవదు. ఒకవేళ నిలిచినా పుట్టిన వారు భూమికి భారమయ్యే విధంగా నడుచుకుంటారు. పర్వదినాల్లో కూడా వలదని శాస్త్రాలు శెలవిస్తున్నాయి.

**వినయమూ, మధుర భాషణమూ మనిషికి శాశ్వతమైన ఆభరణాలు. తక్కినవన్నీ నామమాత్రమైన ఆభరణాలే.**

**- తిరువళ్ళువర్**

## మన పూర్వీకులు ఏకాదశి ఉపవాసం ఎందుకు పెట్టారు?

ఉపవాసం ఉండి ఏకాదశి రోజు జాగరణ చేస్తే పుణ్యం. పరమశివునికి ప్రీతికరమని చెప్పి చేస్తున్న ఈ జాగరణలో ఎంతో ఆరోగ్య రహస్యముంది. మన ఋషులూ, పుణ్య పురుషులూ పెట్టిన ఈ ఆచారంలో ఏకాదశి రోజు ఉపవాసం ఉండటం వల్ల కడుపు ఖాళీగా ఉంటుంది. అనగా శరీరంలో ఉన్న జీర్ణాశయ అవయవాలకి విశ్రాంతి. శరీరానికి నిద్ర ఉంటుంది. శరీరం లోపలున్న కడుపులోని అవయవాల సంగతి ఏంటి? వాటికి విశ్రాంతే ఉపవాసము. ఈ ఆచారం కారణంగా శరీరంలో వేడి పెరిగి అనేక వ్యాధులు ఉత్పన్నం కాకుండా ఉంటాయి. పదిహేను రోజులకొకసారి ఏకాదశి రోజు ఉపవాసం చేయటం



ద్వారా జీవితాంతమూ దిగులూ, అసహాయతా, అనారోగ్యములూ దరిచేరవు.

**ఆత్మగౌరవాన్ని నష్టపరుచుకుని జీవించే జీవితం మృత్యువు కంటే హేయమైనది.**

**- భర్తృహరి**

## క్షౌరము ఏయే రోజుల్లో ఎందుకు చేయించుకోకూడదని పెద్దలు చెప్పారు?

క్షౌరము చేయించుకోవటం వల్ల శరీరంలో విద్యుత్తు తగ్గుతుంది. అందుకే వ్రత దీక్షలప్పుడు క్షౌరము చేయించుకోరు. ఇక పాడ్యమీ, చవితి, షష్ఠి, అష్టమి, నవమి, అమావాస్య, పౌర్ణమి తిథులయందూ, శనివారమూ, మంగళవారమూ వద్దని చెప్పిన దానిలో ఎంతో ఆరోగ్య రహస్యముంది. చంద్ర, సూర్యుల నుంచి వచ్చే కిరణాలు ఆయా రోజుల్లో కనులపై కూడా ప్రభావం చూపుతాయి. సూర్యచంద్రుల కిరణాల ప్రభావం వల్ల కనులకి ఇబ్బంది అయ్యే ఆ రోజుల్లో

క్షౌరము చేయించుకోవటం వల్ల శరీరంలో విద్యుత్ కూడా తగ్గి శరీరానికి అనారోగ్యం కలుగుతుంది. అందుకనే పైన చెప్పిన రోజుల్లో క్షౌరం చేయించుకోవద్దని పెద్దలు శెలవిచ్చారు.

**ఆత్మని గూర్చి చక్కగా తెలుసుకున్న మనిషి మృత్యువుకి భయపడడు.**

**- ఋగ్వేదం**

## ఏ మాలధరిస్తే ఏ ఫలితం వస్తుంది?

- ♠ శ్రీమహాలక్ష్మీదేవికి ప్రియమైనది కమలము. ఆ పుష్ప విత్తనాలైన కమలపు విత్తనాలతో చేసిన కమల మాల ధరించి శ్రీమహాలక్ష్మీదేవి జపం చేస్తే అష్టైశ్వర్యాలను తల్లి ప్రసాదిస్తుంది.
- ♠ పగడాలమాలను వ్యాపారాభివృద్ధి కోసం, కుజగ్రహ శాంతి కొరకు వేసుకోవాలి.
- ♠ చందనమాల మనశ్శాంతినీ, ప్రశాంతతనూ, ఆధ్యాత్మిక భావాన్నీ కలుగచేస్తుంది.
- ♠ శ్రీమహావిష్ణువు పూజా జపం కోసం ఎర్రచందన మాలను ఉపయోగించాలి.



**తన ఇంద్రియాలని అదుపులో ఉంచుకోగలిగిన వాడి బుద్ధి స్థిరంగా వుంటుంది. అతడిని మించిన విద్వాంసుడు, పండితుడు యింకెవరుంటారు?**

**- శ్రీకృష్ణ భగవానుడు**

## నవ్వు నాలుగు విధాల చేటంటే?

నవ్వకూడని సందర్భాలూ, నవ్వే సందర్భాలూ చూసుకొని నవ్వాలని దాని పరమార్థం. ఆవేదననతో తనకు జరిగిన అవమానాన్ని పంచుకుంటున్నప్పుడు నవ్వకూడదు. అన్ని రకాలుగా వోడిపోయిన వాడ్ని, అవమాన భారంతో వెళ్ళిపోతున్న వాడ్ని చూసి నవ్వకూడదు. ముఖపరిచయమున్న స్త్రీని చూసి పురుషుడు పలకరింపుగానే నవ్వాలిగాని అతిగా నవ్వకూడదు. గురువుల వద్దా, పూజాదికాల సమయాలలో అధికంగా నవ్వకూడదు. వివాహమైన పరస్త్రీ, పర పురుషులు కూడా ఒకరితోనొకరు నవ్వులాటలాడుకోరాదు. అది పురుషునికన్నా స్త్రీకే ఎక్కువ అవమానం తెచ్చి పెడుతుంది.

**ఉత్సాహానికి ఎంతో బలం వుంటుంది. ఉత్సాహాన్ని మించిన బలం మరొకటి లేనే లేదు. నిజానికి, ఉత్సాహవంతుడైన మనిషికి దుర్లభమైనది ఏదీ వుండదు యీ ప్రపంచంలో.**

**- వాల్మీకి**

## ముక్కోటి ఏకాదశినాడు తినే అన్నంలో రాక్షసుడున్నాడా?

అందుకే ఆ రోజు ఉపవాసము ఉంటారు. బ్రహ్మదేవుడి స్వేదబిందువు నుంచి రాక్షసుడు జన్మించాడు. బ్రహ్మ ఆజ్ఞతో ముక్కోటి ఏకాదశినాడు వరి అన్నములో ఆనాటి నుంచీ నివశిస్తున్నాడు అని పురాణాలలో ఉన్నది.

ఈ రోజునే శ్రీమహావిష్ణువు గరుత్మంతుడితో సహా వైకుంఠం నుంచి ముక్కోటి దేవతలకి దర్శనమిస్తాడు. వైకుంఠ ఏకాదశి అనంతమైన పుణ్యాన్ని ఇచ్చేరోజు. ఈ ఏకాదశినే ముక్కోటి ఏకాదశి అనీ, మోక్ష ఏకాదశీ



అని కూడా అంటారు. చాతుర్మాస్య కాలంలో దక్షిణం దిక్కున తలపెట్టి నిద్రిస్తున్న శ్రీమహావిష్ణువు ఆ రోజు మేల్కొని భక్తులకి ఉత్తర ద్వార దర్శనాన్ని ఇస్తాడు. ఈ రోజు ఉత్తరద్వారము నుంచి స్వామిని దర్శించిన వైకుంఠంలో స్వామిని దర్శించిన పుణ్యం ప్రాప్తిస్తుంది. రాబోయేది ఉత్తరాయణ పుణ్యకాలమని గమనించాలి. సంవత్సరంలో 24 నాలుగు ఏకాదశుల్లో పూజించి ఉపవశిస్తే వచ్చే పుణ్యం ఈ ముక్కోటి ఏకాదశి రోజున స్వామిని దర్శించి పూజించినంతనే కలుగుతుంది.

## తిరుమలలో ప్రసాదంగా లడ్డుకు ముందేమి ఇచ్చేవారు.

భక్తులు ఎంతో మధురంగా, ఇష్టంగా తీసుకునే తిరుమల శ్రీవారి లడ్డుకి ముందు ప్రసాదంగా బియ్యపుపిండి, బెల్లం పానకంతో చేసిన ప్రసాదాన్ని అందించేవారు. ఆ రోజుల్లో శ్రీవేంకటేశ్వరుని ప్రసాదం అదే. తర్వాతే లడ్డు ప్రసాదంగా మారింది.

## జంట అరటిపళ్ళను తినవచ్చా?

కొంతమంది జంట అరటి పండ్లను తింటే కవల పిల్లలు పుడతారని నమ్ముతారు. జంట ఫలాలను తినటం ద్వారా, స్వామికి అర్పించటం ద్వారా, ఎటువంటి

దోషమూ రాదని శాస్త్రాలు చెబుతున్నాయి. అందంతో అహంకారపూరితయైన రంభ శ్రీమహావిష్ణువు శాపం వలన భూలోకంలో అరటి చెట్టుగా జన్మించిందని పురాణ సారాంశము. తాంబూలంలో మాత్రం జంట అరటిపండును పెట్టకూడదు. దానికి కారణం ఏకఫలమౌతుందనే.

**అగ్ని తన దరిదాపులకి వచ్చేవారినే దహించివేస్తుంది; కాని క్రోధాగ్ని మాత్రం ఎంతో దూరాన వున్న వారిని సైతం దహించి వేయగలదు.**

**- తిరువళ్ళువర్**

## శివుని వక్షస్థలంపై శ్రీలలితా త్రిపురసుందరి ఎందుకుంటుంది?

ఈ మహావిశ్వాన్ని సత్వ, రజో, తమో గుణాలతో నడిపించాలి త్రిమూర్తులు. అందుకొరకు వారికి ఇంకా మహోన్నతమైన శక్తి కావాలి. అందుకోసమే చైతన్య శక్తియైన పరాశక్తిని తమ వక్షస్థలంపై కూర్చోబెట్టుకుని తమ కార్యాలు చేస్తారు.



**మనిషికి ఇంట్లో భార్య నేస్తం. రోగాలు బాధించే దశలో ఔషధాలే మిత్రులు. మరణించిన అనంతరం ధర్మమే మిత్రుడు.**

**- చాణక్యుడు**

## భార్యకి ఏడవనెల వస్తే భర్త పూజలు చేయకూడదా?

ఆ మాసంలోనే బిడ్డ సంపూర్ణరూపాన్ని సంతరించుకుంటాడు.

అలాంటప్పుడు భర్త పూజదికాలూ, దీక్షలూ చేయవద్దనటానికి కారణం, ఆ సమయంలో గర్భిణీ స్త్రీకి పూర్తి విశ్రాంతి కావాలి. భార్య తను చేయకపోయినా ఎంతోకొంత భర్తకి పూజాదికాలలో సాయపడాల్సిందే.

అటువంటి సమయాల్లో అలసటకీ, శ్రమకీ గురయి లేనిపోని సమస్యలు తెచ్చుకుంటుందని ఏడో నెల నుంచే భర్త పూజాదికాలకి దూరంగా ఉండాలని పెద్దలు చెప్పారు.

## గురువాయూర్ దేవాలయంలో అభిషేక నూనెను రాసుకుంటే కీళ్ళనొప్పులు పోతాయా?

కేరళలో కొన్ని లక్షలమంది నిత్యపారాయణం చేసే 'నారాయణీయం' రాసిన భక్తునికి వచ్చిన కీళ్ళనొప్పులు దేవాలయంలోని అభిషేక నూనెను తీసుకొని తైల మర్దన చేయడం ద్వారా తీరాయి. దానికి కారణము ఆ విగ్రహం పాతాళ అంజనం అనే శిలతో ఉండటం వల్ల ఆ దేవుని శిలాశక్తి నూనెలోకి ఆవహిస్తుంది.

**మహాపురుషులైన వారిని ప్రపంచమే వెతుక్కుంటుంది. ప్రపంచాన్ని వారు వెతుక్కోరు.**

**- కాళిదాసు**

## తలుచుకున్నంతనే స్నానం చేసినంత ఫలాన్నిచ్చే నదులు?

గంగ, యమున, గోదావరీ, సరస్వతి, నర్మద, సింధు, కావేరి. అంతటి మహిమాన్వితమైనవి కాబట్టే ఏ జలంతో స్నానం చేస్తున్నా...



"గంగే చ యమునే చైవ గోదావరీ సరస్వతీ
నర్మదా సింధుకావేరీ జలేస్మిన్ సన్నిధింకురు"

అని స్మరించి ఆ నీటితో స్నానమాచరించిన ఆయా నదులలో చేసిన ఫలం వస్తుంది.

**అగాధమైన మహాసముద్రంలో ఒక కొయ్య ఒక వైపు నుంచీ, ఇంకోవైపు నుంచి మరో కొయ్య వచ్చి కాసేపు కలిసినట్లుగా వుండి, ఉన్నట్లుండి విడిపోతుంటాయి. ప్రపంచంలోనూ అంతే. ఇక్కడ ఎక్కడెక్కడినుంచో వచ్చిన ప్రాణులు అనుకోకుండా కలుస్తుంటారు; తమ ప్రమేయం లేకుండానే విడిపోతుంటారు.**

**- వేదవ్యాసుడు**

## దేవతా విగ్రహాలకి ఎలా నమస్కరించాలి?

దేవాలయానికి వెళ్ళినప్పుడు, పూజారి కుడివైపున ఉండి పూజాదికాలు నిర్వహిస్తుంటాడు. అందువలన

మనం ఎడమవైపు నిలిచి నమస్కరిస్తే భగవంతుని దర్శనము కనులకి ఇంపుగా కనపడుతుంది.

అలాగే నమస్కరించేటప్పుడు చేతులను మన హృదయానికి మధ్యలో కాకుండా కొద్దిగా పక్కకి పెట్టి నమస్కరించాలి.

అలా చేస్తే స్వామికి పెట్టినట్టు, సూటిగా పెడితే మనకి మనం పెట్టుకున్నట్టు.

## పూజ కోసం పూలు కోసినా పాపమేనా?

అందుకే పెద్దలు పూజ కోసం లేదా మరో సందర్భం కోసం కోస్తున్నప్పుడు శివకేశవులను తలుచుకొని కోయమని చెబుతారు. ఆ పద్ధతిని అనుసరించిన ఎటువంటి పాపం దరిచేరదు. దోషరహితమైన చర్య అది.

**విద్య వినయాన్నిస్తుంది. వినయం యోగ్యతనిస్తుంది. యోగ్యతేమో ధనాన్నిస్తుంది. ఆ ధనమేమో ధర్మాన్ని స్తుంది. మరి ధర్మం... సుఖాలనిస్తుంది.**

**- ధర్మశాస్త్రం**



## సకల అమ్మవారి దేవాలయాల్లోనూ లలితా సహస్రనామమెందుకు చదువుతారు?

గాయత్రీ, శక్తీ, దుర్గా, శ్రీమహాలక్ష్మి, సరస్వతీ.... ఏ దేవతా శక్తి ఆలయములోనైనా లలితా సహస్రనామ పారాయణాన్ని తప్పక చేస్తారు. లలితా సహస్రనామంలో అన్ని శక్తి స్వరూపాల స్మరణ, స్తుతి ఉంటుంది. అందరి దేవతలను తనలో ఉంచుకున్న శక్తే లలితాదేవి. చక్కని చదువు కోసం సరస్వతిని పూజిస్తాము. సంపద కోసం శ్రీమహాలక్ష్మిని పూజిస్తాము. అలాగే శక్తి కోసం దుర్గాదేవిని పూజిస్తాము. వరదేవతా స్వరూపమైన లలితాసహస్రనామం చదివితే అమ్మవార్లనందరినీ స్తుతించినట్టే. ఎటువంటి కోరికలైనా లలితాసహస్రనామ పఠనం ద్వారా సిద్ధిస్తాయి.

**ఆహారం విషయంలోనూ, వ్యవహారం విషయంలోనూ మనిషి ఎలాంటి మొహమాటాలూ పెట్టుకోకూడదు.**

**- తిరుపతి వేంకట కవులు**

## పురుషులలో పుణ్య పురుషుణ్ని ఎందుకు కోరుకుంటుంది స్త్రీ?

పురుషునకు పదహారు గుణాలుండాలి. అన్ని గుణాలున్న వాడు శ్రీరాముడు ఒక్కడే. అందుకే లోకానికి ఆదర్శప్రాయుడయ్యాడు. ఆ పదహారు గుణాలు : సద్గుణమూ, పరాక్రమమూ, ధర్మమూ, ఉపకారి, అసత్యం ఆడకుండుట, నియమనిష్టలతో గడపటమూ, శత్రువులు కూడా వంక పెట్టని వాడవటమూ, సకల జీవకోటికి ఉపకారం చేయువాడూ, వేదాలను చదివినవాడూ, అందగాడూ, ఆజానుబాహుడూ, ప్రేమతత్వము కలవాడూ, కోపాన్ని అదుపులో ఉంచుకునేవాడూ, స్పష్టంగా పలికేవాడూ, అసూయలేనివాడూ, యుద్ధానికి సిద్ధమైతే దేవతలంతా కలిసివచ్చినా భయపడనివాడూ. ఈ పదహారు గుణాలున్నది ఒక్క శ్రీరామునికే. అందుకే ఆ సుగుణాల్లో కొన్నయినా ఉన్న పురుషుల్లోని పుణ్యపురుషుణ్ని కోరుకుంటుంది స్త్రీ.

**శిశువుకి శుశ్రూష లందజేయడం వల్ల అమ్మని 'శక్తి' అంటాం.**

**- స్కంద పురాణం**



## ఎంతకోపంలో కూడా ఆడవారు చెయ్యకూడని పనులు?

ధనాన్ని, అనగా భర్తపై కోపంతో నగలు విసిరేయటం భర్తకు హాని (ఉదా: కైక). అలాగే వంటపాత్రలూ, చీపురూ వంటివి విసిరేయకూడదు. ఆ చర్య శ్రీమహాలక్ష్మీదేవిని వద్దనుకొని ఆమె అక్క జ్యేష్ఠాదేవిని ఆహ్వానించటమే.

**ఓ అందమైన చిరునవ్వు ముఖానికి చక్కటి అలంకారమై వన్నె తేవడమే కాదు; హృదయానికి సైతం నులి వెచ్చని ఆహ్లాదాన్ని అందిస్తుంది.**

**- పురాతన సామెత**

## ఏ దిక్కు గృహం ఎవరికి మంచిది?

స్థలం మధ్యలో చిన్న గొయ్యి తీసి అందులో మట్టి మూకుడు పెట్టి దానిలో నెయ్యిపోసి నాలుగు దిక్కుల నాలుగు వత్తులు పెట్టి వెలిగించాలి.ఏ దిక్కు వైపు ఎక్కువగా వెలిగితే ఎవరికి మంచిదంటే తూర్పు వైపు బ్రాహ్మణులకూ, దక్షిణం వైపు క్షత్రియులకూ,

పడమర దిక్కు వైశ్యులకూ, మిగతా వారికి ఉత్తర దిశ మంచిది. నలువైపులా ప్రకాశవంతంగా వెలిగితే ఎవ్వరైనా నివశించవచ్చు. అందరికీ మంచిదే అని వాస్తు శాస్త్రం శెలవిస్తోంది.

తర్వాత గొయ్యిని గొయ్యి తీసిన మట్టితోనే పూడ్చాలి.

**శాస్త్రాలు ఎన్నో కొత్త కొత్త విషయాలు తెలుపుతుంటాయి. కనుక శాస్త్రాలంటే అందరికీ కళ్ళతో సమానం. అందుకే ఆ శాస్త్రాల జ్ఞానం లేనివాడు కళ్ళున్న కబోధి.**

**- నిర్ణయ సింధు**

## గ్రహదోషాలు పోవాలంటే ఆవుకి ఏ ఆహారం అందివ్వాలి?

శనివారము లేదా ఆదివారము గోమాతకి తోటకూర లేదా అరటిపండ్లూ తాజావి పెట్టాలి. అలాగే నిన్న మిగిలిన అన్నాన్ని పెట్టకూడదు. గోమాత కోసం చేసిన అన్నాన్నే పెట్టాలి. ఏ గ్రహదోష నివారణకైనా



ఆయా గ్రహ రోజుల్లో సాత్వికమైన తాజా ఆహారాన్ని గోవుకి అందివ్వాలి.

## శనీశ్వరుని పటం గృహంలో ఉండవచ్చా?

అలాంటి శుభకరమైన శనీశ్వరుని విగ్రహం కానీ, చిత్రం కానీ గృహంలో ఉంచటానికి ఉన్న అభ్యంతరము ఒక్కటే. ఆ గ్రహం పేరు చెప్పగానే ఒకింత భయం ఆవహిస్తుంది. రోజూ చూస్తుండటం వల్ల ఆందోళనతో ఆరోగ్యం దెబ్బతింటుంది. కాన ఉంచకపోవటం ఆరోగ్యానికీ, మనసుకీ, ఇంటికొచ్చే అతిథులకీ మంచిది.

## ఏకాదశినాడు ఉపవాసం ఉండకుండా ఉంటే అనారోగ్యమా?

సూర్యుని నుంచి వచ్చే కరములు రెండు రకాలు. అవి భద్రకరము మరియు విష్ణు కరములు. ఈ రెండు కరములు కూడా ఏకాదశినాడు కలిసి ప్రసరించి జీవులకు అజీర్తిని, అనారోగ్యాన్ని కలిగిస్తాయి. అందుకే ఆనాటి ఉపవాసం. ఉపవాసం అనగా ఉప అంటే స్మరణ, వాసం అంటే దగ్గర. భగవంతునిని స్మరిస్తూ ఆయనకి దగ్గరగా ఉండేదే ఉపవాసం. ఆరోగ్యం

మరియు పుణ్యం ఉపవాసం ద్వారా లభిస్తుంది. కాబట్టే నెలకి రెండు సార్లుగా వచ్చే ఏకాదశినాడు ఉపవాసం ఉండమని శాస్త్రాలూ, పురాణాలూ శెలవిస్తున్నాయి.

## ద్వాదశాదిత్యులు ఎవరు?

ఈ సమస్త భూమండలానికి తమ శక్తులను ఇచ్చేవారు. చైత్రానికి ధాత, వైశాఖ మాసమునకు ఆర్యముడూ, జ్యేష్ఠమాసానికి మిత్రుడూ, ఆషాఢానికి వరుణుడూ, శ్రావణ మాసానికి ఇంద్రుడూ, భాద్రపద మాసానికి వివస్వంతుడూ, ఆశ్వయుజానికి తృష్ణ, కార్తీకమాసానికి విష్ణువూ, మార్గశిర మాసానికి తర్యముడూ, పుష్యమాసానికి భగుడూ, మాఘమాసానికి పూష, ఫాల్గుణ మాసానికి క్రతువులు అధిపతులు. శక్తినిచ్చేవారు.

## బీజాక్షరాలంటే?

దేవతా స్వరూపాల సూక్ష్మ రూపమే బీజాక్షరము. 'ఐం' చదువుల తల్లి సరస్వతీదేవికీ, 'హ్రీం' మహాకాళికీ, 'హం' ఆకాశబీజము, 'రం' అగ్ని బీజము. ఆయా దేవతల బీజాక్షరాలను స్మరించటం ద్వారా ఎంతో శక్తి ఏర్పడుతుంది.

వారిని పూజించిన ఫలితం కలుగుతుంది. అమృతబిందువులు బీజాక్షరాలు.



## మీరు ధర్మపరంలో నుండగా మిమ్మల్ని కించపరిస్తే?

ఆ సమయంలో మౌనంగా ఉండటం ద్వారా దుష్టుని తిట్లూ, శాపనార్థాలూ తిరిగి అతన్నే ఆవహిస్తాయి. మౌనం మహాశక్తివంతమైనది. ప్రళయానికి ముందు సముద్రం కూడా ఎంతో ప్రశాంతంగా ఉంటుంది.

**కాలయముడు ఎల్లప్పుడూ ప్రాణుల తలలపైనే ఉంటుంటాడు; అందుకే మనం ఎవరిని కలసినా, ముందుగా క్షేమ సమాచారం అడుగుతుండాలి.**

**- కాళిదాసు**

## గృహంలో బిల్వవృక్షాన్ని ఎంచుకోవచ్చా?

పెంచుకోవచ్చు. అయితే నిత్యం భక్తిప్రపత్తులతో పూజలు చేయాలి. పడమర దక్షిణం దిక్కులు పెంచుకోకూడదు. ఉత్తర, తూర్పు దిక్కుల వైపు

పెంచటం వల్ల ఆ వైపు నుంచి వచ్చే గాలి ఆరోగ్యాన్నీ, బిల్వ వృక్ష ఆశీర్వాదాన్నీ తెస్తుంది.

**మనిషి ఎంతో కష్టపడి, ఎన్నో శ్రమలకోర్చి తపస్సుచేసి సంపాదించుకున్న సత్ఫలితాలనీ, యశోచంద్రికలనీ, క్రోధాన్నీ క్షణంలో మాయం చెయ్యగలదు.**

**- విష్ణుపురాణం**

## గర్భం ధరించిన తర్వాత పుంసవనము ఎప్పుడు చేయాలి?

మూడో నెలలో చేయుట ఉత్తమము. పంచదశ సంస్కారములలోని పుంసవనము తల్లి గర్భం సురక్షితంగా ఉండటానికీ, అలాగే గర్భదోషాలు పోవటానికీ చేస్తారు.

భర్తచే పునర్వసు నక్షత్రమున పుంసవనము చేయించటం ద్వారా గర్భం ఆరోగ్యంగా ఉండి తేజోవంతమైన సంతానం కలుగుతుందని ప్రాచీన వైద్య గ్రంథాలు చెబుతున్నాయి. కొన్ని ఆయుర్వేద



శాస్త్రాలు పుంసవనము తొలి మాసంలో చేయాలని తెలవిస్తున్నాయి.

## రాగిపాత్రలో తీర్థం ఎందుకు పుచ్చుకోకూడదు?

పాలు, పాలపదార్థాలను కంచూ, రాగిపాత్రలలో పోయకూడదు. అలాగే అందులో తీర్థం పుచ్చుకోకూడదు. అలా తీసుకుంటే ఒక రకమైన మద్యాన్ని స్వీకరించినట్టే. ఒట్టి అభిషేక జలమైతే స్వీకరించవచ్చు.

**పూవుల సుగంధం గాలివాటు ఎటుంటే, అటే వ్యాపిస్తూ వుంటుంది. కాని మనిషిలోని సుగుణాల సుగంధం దశ దిశల్లోనూ వ్యాపిస్తుంది.**

**- ధర్మపదం**

## చూపుడు వేలుపెట్టి ఎవరెవర్ని చూపించకూడదు?

దేవాలయాలనూ, ధ్యాన మందిరాలనూ, తల్లినీ, తండ్రినీ, గురువులనూ, పెద్దలనూ చూపుడు వేలితో

చూపకూడదు. చూపుడు వేలితో తమలపాకుపై సున్నం కూడా వ్రాయకూడదు. గంధాన్ని కూడా ఆ వేలితో తీసుకోకూడదు. పూజాదికాలప్పుడు చూపుడు వ్రేలును ఉపయోగించకూడదు.

**పైత్య ప్రకోపంతో నాలిక పాడైపోయినప్పుడు, పటిక బెల్లం సైతం పరమ చేదుగా ఉంటుంది.**
**- శ్రీహర్షుడు**

## కనుమల రోజున ప్రయాణించకూడదా?

అయినవారు దూరమైనప్పుడూ, నివాస ప్రాంతంలో అగ్ని ప్రమాదం జరిగిన మరునాడూ, కర్మ పూర్తయిన తర్వాత రోజూ, దేవాలయంలో జాతరా, ఉత్సవాలు జరిగిన మరునాడూ, కనుమ పండుగ రోజు బైలుదేరకూడదని శాస్త్రం శెలవిస్తోంది. పైవన్నీ కనుమల రోజులుగా పరిగణించబడతాయి.

## ఏకభుక్తమంటే?

ఒంటి పూట భోజనాన్ని అదీ మధ్యాహ్నం మాత్రమే చేసి భగవంతుని ధ్యానంలో గడపటం. అన్నం



వల్ల మనం చేసిన పాపాలు నశించటానికీ, ఇంకా శరీర దోషాలు పోవటానికీ ఏకభుక్తం చేస్తారు.

**మనిషి తనని బాధించే వేదనిని తనలోనే ఉంచుకుని సహించడం, ఆ విధంగా వేరెవ్వరికీ ఎటువంటి బాధలని కలిగించక పోవడం... అదే అసలైన తపస్సు.**
**- తిరువళ్ళువరు**

## ఎవరితో పెట్టుకోకూడదు?

ధనమున్న వాడితో, మదమున్న వాడితో, అంగబలమున్న వాడితో, ఆర్థిక బలమున్న వాడితో, అధికారబలమున్న వాడితో, స్థాన బలమున్న వాడితో పెట్టుకున్నా పర్వాలేదుకానీ, పైవన్నీ లేనివాడైనా మేధావితో పెట్టుకోకూడదు. విద్యాపాండిత్యాలున్న వారితో ఎలాంటి వివాదాలూ పెట్టుకోకూడదు.

## సంవత్సరానికొక్కసారన్నా స్వామిని ఇలా దర్శించుకోవాలి?

బ్రహ్మముహూర్త సమయంలో, స్వామి శయనించి నప్పుడు శయన దర్శనము, అలాగే రథోత్సవము. ఈ

మూడింటిలో ఒక్కదర్శనాన్నైనా తప్పని సరిగా దర్శించి ముక్తిని పొందాలి.

**పాము కోరల్లో విషం వుంటుంది. ఈగ తలలో విషం ఉంటుంది. తేలు కొండెలో విషం ఉంటుంది. కానీ దుర్జనుడికి శరీరం అంతా విషమే. - చాణక్యుడు**

## సీతా, రామా, గౌరీ అని పేర్లు పెట్టుకుంటే కష్టాలొస్తాయా?

శ్రీరామ, సీత, గౌరీ... అలాంటి పేర్లు పెట్టుకున్న వారు వారి సుగుణాలను స్వీకరించి ధర్మబద్ధంగా జీవించటం ద్వారా కొన్ని ఇబ్బందులొస్తాయి. అది కూడా మానసికంగానే. ఆయా దేవతలు కష్టపడ్డారని నలుగురూ అనటం వల్ల. అయితే అమోఘమైన వైభోగాలను అనుభవించే అదృష్టం వారికే ఉంటుంది.

## అష్టదరిద్రాలంటే?

- ♠ సహాయం చేసే వారు ఒక్కరైనా లేకపోవటము.
- ♠ కనీస అవసరాలకి ధనము లేకపోవటము.



- ♠ ఒంటి పూట భోజనమునకు కూడా విపరీతమైన శ్రమ చేయాల్సి రావటము.
- ♠ వినే నాథుడు లేకపోవటము.
- ♠ చినిగిన బట్టలతో ఉండటము.
- ♠ వెళ్ళటానికి ఏ వాహనము లేకపోవటము.
- ♠ ధనం ఉన్నా సంతానం లేకపోవటము.
- ♠ పుత్రుడు ఉన్నా వదలివేయటము.

అలాగే అష్టకష్టాల విషయానికొస్తే ఇష్టం లేకపోయినా తప్పని సరిగా పనిచేయాల్సి రావటము, భయంకర దారిద్ర్యము, భార్య ఉండీ ఉపయోగపడకపోవటము, అడుక్కుతినే పరిస్థితి, అప్పు అడిగినా ఇచ్చేవాళ్ళు లేకపోవటము, వీసమెత్తు ఉప్పు కూడా అప్పుగా దొరక్కపోవటము, రెండు కాళ్ళతోనే వెళ్ళాల్సి రావటము... ఇన్ని దరిద్రాల మధ్యా, అష్టకష్టాల మధ్య కూడా ఎంతో మంది అత్యున్నత స్థాయికి వచ్చారు. ఏ కష్టమూ కలకాలం ఉండదు.

## దీపాన్ని ఏవైపు పెట్టి దీపారాధన చెయ్యాలి?

స్వామికి వెలిగించే దీపం నూనెతో వెలిగిస్తే ఎడమ వైపు అనగా మనకు కుడివైపూ, అదే గోమాత ఆవు నెయ్యితో అయితే స్వామి కుడివైపునా, మనకి

ఎడమ వైపుగా వెలిగించాలి. దీపంలో వెలిగే వత్తులు తూర్పు, ఉత్తరం వైపు ఉంచాలి. మిగతా రెండు దిశలు దీపారాధనకు పనికి రావు. స్వామికి రెండు వైపులా దీపాలు వెలిగిస్తే అసలు సమస్యే లేదు.

**వాంఛలని త్యజించటం కన్నా ఉత్తమమైన తపస్సు లేనే లేదు.**
**- శ్రీమద్భాగవతం**

## సాష్టాంగ నమస్కారము ఎప్పుడు చేయాలి?

దేవాలయములో దేవుని ముందు చేయకూడదు. ఆత్మప్రదక్షిణం కూడా చేయరాదు. ధ్వజస్థంభానికి అవతల చేయాలి. అలాగే గృహంలో పూజాదికాలు అయ్యాక స్వామికి సాష్టాంగనమస్కారము చేయాలి. ఆడవారు మోకాలిపై వంగి నమస్కారం చేయాలి.

## వధూవరులతో ఒకరి కాలివేలి బొటన వ్రేలిని మరొకరి చేత ఎందుకు తొక్కిస్తారు?

ఇరువురి శరీరాల్లో ప్రాణశక్తిని అనగా విద్యుత్తుని ఒకరి శరీరంలోకి ఒకరు పంపించే ప్రక్రియే ఆ తంతు.



ఆ చర్యలో ఇద్దరి మనసులు కలిసి, ఒకే మాటగా ఒకే బాటగా నడచి ఇరువురు ఒక్కటవ్వాలని పరమార్థము. కాలి బొటన వేలి ద్వారా ఉండే నరాలు విద్యుత్‌ని గ్రహించే శక్తి కలిగి ఉంటాయి.

**ఏ మనిషికైనా, హృదయం వైరం తోనూ, ద్వేషంతోనూ నిండిపోయి, అందులో దాని తాలూకు అగ్ని ప్రజ్వరిల్లుతూ వుంటే... రాత్రిళ్ళు నిద్ర పట్టనే పట్టదు.**
**- విదురుడు**

## మహాభారతం చదవటం ద్వారా ఏ విషయాలను తెలుసుకోవచ్చు?

ఆర్థికశాస్త్రమూ, సామాజిక శాస్త్రమూ, జ్యోతిష్యమూ, శకునాలూ, ఆధ్యాత్మికమూ, ధర్మమూ, న్యాయం, కష్టం, సుఖం, జననామరణాలు, పునర్జన్మలూ, భూగోళశాస్త్రమూ, పంచాంగమూ, అధర్మానికి శిక్షలూ, ప్రేమా, స్నేహమూ, మోసాలూ, మర్మాలూ, యుద్ధ తంత్రాలూ... ఇలా ఎన్నో. ఒక్క భారతం చదవటం ద్వారా పరిపూర్ణ జ్ఞానం లభిస్తుంది.

## పదకొండో ఏకాదశి తిథి ముక్కోటి ఏకాదశి ఎంత పవిత్రము?

ద్వాదశి ముందు వచ్చే పదకొండో తిథి ముక్కోటి ఏకాదశి. మనిషి కర్మేంద్రియాలు అయిదింటినీ, జ్ఞానేంద్రియాలూ అయిదింటినీ కలిపి పదకొండోదయిన మనస్సులో నిన్ను సేవిస్తున్నానని ఆ రోజు వైకుంఠవాసుణ్ని పూజించటమే ముక్కోటి ఏకాదశి మహాపుణ్యరహస్యాల్లోని ఒక రహస్యము.

**ధర్మాత్ములైన వారిని సత్యం అనే నావ ఎటువంటి విపత్తుల నుంచి అయినా దరిచేర్చగలుగుతుంది.**

**- ఋగ్వేదం**

## ప్రతి ఒక్కరూ ఆచరించాల్సినవి?

- ♠ మాట్లాడే ముందు ముందూ, వెనుకా చూసుకోవాలి.
- ♠ పక్కవార్ని మందలించేముందూ, విమర్శించే ముందూ ఒకటికి రెండు సార్లు ఆలోచించుకోవాలి.



- ♠ దైవానికి పూజ చేయటమే పుణ్యం కాదు, క్షమించే తత్వము కూడా ఉండాలి.
- ♠ వయసు అవ్వకముందే అవసరమైన ధనాన్ని కూడపెట్టాలి.
- ♠ బియ్యపు గింజలపై మీ పేరు అయిపోవటానికి ముందే ఎవ్వరికి ఇవ్వాల్సిందీ, చెయ్యాల్సిందీ పూర్తి చెయ్యాలి.

**మాట మీద నిలబడే దృఢమైన మనసున్న వారినీ, కొండల పైనుండి క్రిందకి జాలువారే నీటి ప్రవాహాన్నీ ఎవరూ ఆపలేరు.**

**- కాళిదాసు**

## జన్మనిచ్చిన వారు పోయినప్పుడు దేవాలయములోనూ, అత్తింట్లోనూ ఎందుకు నిద్ర చేస్తారు?

అంత దుఃఖాన్నీ నీవే తగ్గించమని 'స్వామీ నీ నీడలో ఉన్నాను. దుఃఖశాంతిని కలుగచేయమనీ' విన్నవించుకుంటారు. అత్తింట నిద్ర చేసేది ఎందుకంటే

ఇకనుంచి మీరే నా బాధల్నీ, శోకాన్నీ తీర్చే తల్లీ, తండ్రీ అని తెలియచెప్పటానికే.

**బ్రహ్మచారికి ఎన్నడూ దుఃఖాలుండవు. ఎందుకంటే అతనికి జీవితంలో లేనిదంటూ ఉండదు.**

**- భీష్మపితామహుడు**

## దీపావళి రోజు ఎక్కడెక్కడ దీపాలు పెట్టాలి?

ముఖ్యంగా అయిదు దీపాలు పెట్టాలి. ఇంట్లో పూజామందిరం వద్దా, ధాన్యమున్న చోటా, బావి వద్దా, రావిచెట్టు వద్దా, తులసి చెట్టు దగ్గరా. ఏ కారణాల వల్ల పండుగ జరుపుకోలేకపోయినా దీపాలు పెట్టుకోవచ్చు.

**ప్రపంచం మొత్తంలో ఇద్దరే ఇద్దరు అసలైన మానవులు. ఒకరు - చనిపోయిన వారు. ఇంకొకరు - ఇంకా జన్మించని వారు.**

**- పురాతన శాస్త్రం**



## 'ఓం'కారం శక్తి?

ఋగ్వేదములోని 'అ'నూ, యుజుర్వేదములోని 'ఉ'నీ, సామవేదంలోని 'మ్' నూ కలిపితే 'ఓం' ఉద్భవించింది.

'ఓం' అని తలచుకున్నంతనే వేదాలను చదివిన ఫలితము వస్తుంది.

అందుకే ఏ నామానికైనా మనం ముందుగా 'ఓం' అని చేర్చి పఠిస్తాము.

## ఏకాదశి ఎంత గొప్పది?

సూర్యునికన్నా, మహాపుణ్య పర్వతాలకన్నా, వైకుంఠవాసుడున్న పాలసముద్రంకన్నా, అన్నదానం కన్నా, కల్పవృక్షం కన్నా, కామధేనువు కన్నా ఏకాదశి శ్రేష్ఠం. ఆ రోజు చేసే ఏ పుణ్యకార్యమైనా అనంతమైన ఫలాన్నిస్తుంది.

**దీపం కింద వుండే చీకటిని పోగొట్టడానికి యింకో దీపం వెలిగించాలని ప్రయత్నం చేయడం వ్యర్థం.**

**- జాతక కథలు**

## పూజాదికాల్లో గోత్రనామా లెందుకు చెప్పకుంటారు?

మనం చేసే పాపాల చిట్టా తయారయినట్టే, పుణ్యాల చిట్టా కూడా ఉంటుంది. పాపాల చిట్టా రాసుకోవటానికి చిత్రగుప్తుడున్నాడు. పుణ్యాల చిట్టా రాసుకోవటానికి అన్ని దేవతా స్వరూపాలు ఉన్నారు. పూజలూ, దానమూ, ధర్మమూ, యజ్ఞాలూ, యాగాలూ... ఇలా ఎన్నింటి ద్వారానో మన పుణ్యం చేరుతుంది. అందుకే తమ పుణ్యాల చిట్టాలోకి చేసే పుణ్యం నేరుగా వెళ్ళటానికి ధర్మకార్యాల్లో గోత్రనామాలను మనచేత చెప్పిస్తారు.

## నాలుగు మహామహత్తు కలిగిన పర్వదినములు?

అమావాస్య సోమవారమూ, ఆదివారము సప్తమీ, అష్టమి బుధవారమూ, చవితి మంగళవారమూ.

**దేవతలు సైతం శ్రద్ధని ఉపాసిస్తుంటారు. నిజానికి శ్రద్ధ వల్లనే అంతులేని ఐశ్వర్యం లభించేది ఎవరికైనా. - ఋగ్వేదం**



## నంది కొమ్ముల మధ్య నుంచి పరమేశ్వరుని దర్శిస్తూ పఠించాల్సిన స్తోత్రము?

నందీశ్వర! నమస్తుభ్యం
శాంతానంద ప్రదాయక!
మహాదేవస్య సేవార్థం
అనుజ్ఞాం దాతుమర్హసి ॥ అని పఠించి శివశివ అనుకుంటూ స్వామిని చూడాలి.

**సమస్యలు ఎటువంటివయినా, మనం ప్రశాంతంగా ఉండగలిగితే చాలు, పరిష్కారాలు వాటంతట అవే వస్తాయి. - అరవిందాశ్రమం**

## గర్భం ధరించిన స్త్రీ ఏవి చూడకూడదు?

♠ ఏనుగునీ, గుర్రాన్నీ చూడకూడదు. వాటిపై ప్రయాణించకూడదు. పర్వతాలూ, గుట్టలూ ఎక్కకూడదు. అధికంగా నవ్వటమూ, అధిక నడకా వంటివి చేయకూడదు.

- ♠ నదీ తటాకాల్లో నీటిలో మునగటమూ, చెట్ల క్రింద ఉండటమూ చేయరాదు.
- ♠ భర్తతో, బంధువులతో కోపంగా మాట్లాడరాదు.
- ♠ అతి కారమూ, అతి పులుపూ తినరాదు.
- ♠ రాత్రి నిద్రపోవాలి. పగలు నిద్ర ఎక్కువ పోయి రాత్రి మెళకువగా ఉండకూడదు.
- ♠ అలాగే బాధా, దిగులూ, సంభోగమూ తగదు.
- ♠ నోటి వెంట అమంగళాలు పలుకరాదు.
- ♠ ఆ సమయంలో స్త్రీ రెండు హృదయాలు కలిగి ఉంటుంది. భర్త పంచే ప్రేమ ఇరువురికీ చేరుతుంది కాన భర్త ఎక్కువ సమయాన్ని భార్యతో గడపాలి.
- ♠ ఏడవ నెల నుంచీ ప్రసవం అయ్యే వరకూ భర్త క్షౌరము చేయించుకోవటమూ, తీర్థయాత్రలకు వెళ్ళటమూ, నదిని దాటడమూ చేయరాదు.
- ♠ ఆ సమయంలో భార్య కోరికలను తీరిస్తే తల్లీ, బిడ్డా సంపూర్ణ ఆరోగ్యంతో ఉండి భర్తనీ, బంధువులనూ ఆనందింప చేస్తారు.

## కొబ్బరికాయ సగానికి పగలకపోతే?

వంకరగా పగిలినా, కుళ్ళినా, చిన్నపాటి దోషముంటుంది. మనసు సరిగా లేనప్పుడూ, భక్తి పాళ్ళు తగ్గినప్పుడు మాత్రమే కొబ్బరికాయ సరిగ్గా మధ్యకి పగలదు. అందుకే పెద్దలు మధ్యకి పగిలేలా



కొట్టు అని చెబుతారు. అలా పగలకపోతే ఏ దేవునికి కొట్టామో ఆ పరమాత్ముని మూడుసార్లు స్మరిస్తే ఆ దోషం పోతుంది.

**ఎవరితో మంచి స్నేహం కోరతావో వారితో డబ్బుకు సంబంధించిన వ్యవహారాలు పెట్టుకోవద్దు.**

**- శుక్రనీతి సారం**

## ఓం శాంతి శాంతి శాంతిః అనేదెందుకు?

తొలిసారి శాంతి ప్రకృతి పరంగా వచ్చే ప్రళయాలూ, ఉప్పెనలూ శాంతించాలనీ, రెండో సారి శాంతి అనటం ద్వారా మనసులోని ద్వేషమూ, కుళ్ళూ, కుచ్ఛితాలూ శాంతించాలనీ, మూడోసారి శాంతి అనటం ద్వారా శరీరంలోని రోగాలూ, రుగ్మతలూ శాంతించాలని. ఓం చేర్చి పలికేది ఓ భగవంతుడా ఆ మూడింటినుంచి మమ్మూ, మా వారినీ, చుట్టూ ఉన్నవారినీ కాపాడమని.

**ఎవడు అనేక విధాలుగా విషయాల్ని ఆలోచిస్తాడో అతడే కార్యాన్ని సాధించగలుగుతాడు.**

**-వాల్మీకి రామాయణం**

## కాశీకి ఎప్పుడెళితే పుణ్యం?

పెద్దవాళ్ళ కార్యక్రమాల కోసం అనగా అస్తికలు నిమజ్జనము చేయటానికి కాశి వెళితే, వెళ్ళిన కార్యానికీ పితృదేవతలకే ఫలము.

ఆ కార్యం పరంగా గాకుండా విడిగా కాశీ విశ్వనాథుని దర్శించటానికి మహాపుణ్యం చేసుకొని ఉండాలి. అలా వెళ్ళిన వాళ్ళకే అనంత పుణ్య సౌభాగ్యము కూడా-

## ఎవరి జన్మ నక్షత్రంలో వారు చేయకూడనివి?

వారి వారి జన్మ నక్షత్రం రోజున క్షౌరము చేయించుకోకూడదు. అలాగే ప్రయాణమూ, వివాదాల సంబంధిత విషయాల్లో వెళ్ళి కూర్చోవటమూ, వైద్యుని వద్దకూ వెళ్ళరాదని శాస్త్రము.



**కోపంతో ఉన్నవానికి ఏది మాట్లాడాలి? ఏది మాట్లాడ కూడదు? అని తెలియదు.**

**- రామాయణం**

## దక్షిణావర్తమైన శంఖములో తీర్థమెందుకంత శ్రేష్ఠము?

శంఖము లక్ష్మీ స్వరూపము.

శంఖ తీర్థము సేవించటం వల్లా, ఇంట్లో నలువైపులా చల్లటం వల్లా సకల శుభాలు జరుగు తాయని అలా చేయమంటారు.

సముద్రంలోంచి వచ్చిన శంఖములో క్యాల్షియం అధికంగా వుంటుంది.

అలాంటి శంఖ తీర్థం స్వీకరించటం ద్వారా ఒళ్ళు నొప్పులు దూరమై ఎముకలు గట్టి పడి శరీరం శక్తిని పుంజుకుంటుంది.

అందుకే మన పెద్దలు శంఖ తీర్థం సేవించమన్నది.

అలాగే సాలగ్రామ తీర్థాన్ని శంఖము ద్వారా స్వీకరిస్తే మరింత ఆరోగ్యము, పుణ్యము.

## శివలింగానికి తలని ఆన్చి చెవిలో చెప్పేదెందుకు?

శివలింగం స్పర్శా లింగం. అలా తాకి చెవిలో చెబితే కోరిన కోర్కెలు మహాశివుడు స్వయంగా విని తీరుస్తాడు. తలని అలా ఆన్చటం ద్వారా ఆ ప్రత్యేక శిల వల్లా, స్వామికి చేసే అభిషేకాలూ, పూజల వల్లా శిరస్సులో మలినాలు పోయి సరైనా దారిలో మనసు మనిషిని నడిపిస్తుంది.

**సజ్జనుడు సంపదలను కోల్పోయి నప్పుడు కూడా అడవులకు పోతాడే కాని దైన్యంతో యాచించడు.**

**- వజ్జాలగ్గమ్**

## అబద్ధాలు ఆడితే ఆడపిల్లలు పుడతారంటా రెందుకు?

అలా చెప్పే వారి వల్ల అవతల వారు అనేక ఇబ్బందులు పడతారు. అనేక రకాలుగా నష్టపోతారు. ఆడపిల్ల పుడితే విపరీతమైన ఖర్చుతో అనేక రకాల ఆర్థిక ఇబ్బందులు పడాలని తమ వాక్కు ద్వారా నిరసన



తెలియచేస్తారు. ఆవేశంతో, బాధతో పలికే వాక్కులు జరుగుతాయి. అందుకే ఎవరికీ ఇబ్బంది కలిగించకూడదు. దాన్నే ఉసురు తగిలింది అంటారు. అలా అనటం అంటే శపించినట్టే.

**విషం ఒక్కరినే చంపుతుంది. కాని దేవుని సొమ్ము పుత్రపౌత్రాదులనూ చంపుతుంది.**

**- రఘువంశం**

## గర్భగుడిలో చిన్న దీపం ఎందుకు పెడతారు?

స్వామిని దర్శించి పూజించిన ఫలం కంటే, పాదాలను దర్శించి నమస్కరించటం ద్వారా అనంతమైన ఫలం వస్తుంది. స్వామి పాదాల మీద ప్రసరించే ఆ చిన్న దీపం ద్వారా స్వామి పాదాలను చూసి ధ్యానించమని.

అందుకే దేవుని ఎదురుగా శఠగోపం పెట్టేటప్పుడు తలవంచాలి. అప్పుడైనా స్వామి పాదాలకు నమస్కరిస్తూ స్వామి పాదాలను చూడాలని పెద్దలు ఆచారాన్ని పెట్టారు.

## కార్తీక మాసంలో ఎన్ని నోములూ, వ్రతాలున్నాయి?

మహాశివునికీ, విష్ణువుకీ ప్రీతికరమైన కార్తీక మాసంలో కార్తీక శుక్ల పాడ్యమి నాడు అన్నకూట వ్రతమునూ, క్షీరాబ్ధి శయన వ్రతాన్ని ఆషాఢం నుంచి కార్తీక మాసంవరకూ, శాకసప్తమీ వ్రతాన్ని కార్తీక శుద్ధ సప్తమి నాడూ, మధనద్వాదశీ వ్రతాన్ని కార్తీక శుక్ల పక్ష ద్వాదశినాడూ, క్షీరాబ్ధి వ్రతాన్ని ద్వాదశినాడు ఆచరిస్తారు.

కార్తీక సోమవార వ్రతాన్ని ఆ మాసంలో వచ్చే సోమవారముల రోజునా, అలాగే ఈ మాసంలో కేదారేశ్వర వ్రతాన్నీ, పౌర్ణమినాడు దీపదాన వ్రతాన్నీ, బహుళ పక్ష సప్తమినాడు పైతామహాకృచ్ఛ వ్రతాన్నీ, బహుళ చవితినాడు కరకచతుర్థీ వ్రతాన్నీ మహిళలు చేసుకుంటారు.

**ఎట్టి పరిస్థితుల్లోనైనా పుత్రుని విషయంలో, శిష్యుని విషయంలో హితాన్నే పలకాలి.**

**- మహాభారతం**



## ఏ గ్రహశాంతికి ఎన్ని జపాలు చేయించుకోవాలి?

సూర్య భగవానునికి ఆరువేలూ, చంద్రునకు పదివేలూ, అంగారకునకు ఏడువేలూ, బుధునకు పదిహేనువేలూ, గురువునకు పదహారు వేలూ, శుక్రగ్రహ శాంతికై ఇరవైవేలసార్లూ, శనిగ్రహశాంతికి పంతొమ్మిది వేలూ, రాహువుకు పద్దెనిమిది వేలూ, కేతువుకు ఏడువేలూ చేయించుకోవాలి.

**వ్రతంతో దీక్ష లభిస్తుంది. దీక్షతో దక్షత లభిస్తుంది. దక్షతతో శ్రద్ధ లభిస్తుంది. శ్రద్ధతోనేమో, సత్యం ప్రాప్తిస్తుంది.**

**- యజుర్వేదం**

## హనుమంతుణ్ణి 'భజరంగభళీ' అని ఎందుకంటారు?

శ్రీరామభక్తుడైన హనుమ శరీరం వజ్ర సమానము, మహా దుర్భేద్యము. అందుకే స్వామిని 'వజ్రాంగబలీ, భజరంగబలీ' అని స్మరిస్తారు. ఆపద

సమయంలో కేవలం ఈ పదము ఉచ్ఛరించినంతనే హనుమ ఆశీస్సులు లభించి నూతన బలం ఆవహిస్తుంది. అర్జునుడు హనుమ జెండాను రథంపై ఉంచుకొని కురుక్షేత్ర సంగ్రామంలో చేసిన వీరవిహారంలా సాధకుడు తన కార్యాన్ని సంపూర్ణ సఫలం చేసుకుంటాడు.

**పుట్టినరోజు నాడు చన్నీళ్ళతో స్నానం చేయటం మంచిదని బ్రహ్మాండ పురాణం శెలవిస్తోంది**

## ఏడుపు, కన్నీరు ఎలా వస్తుంది?

తట్టుకోలేని విషయం విన్నప్పుడు కన్నీరు తన్నుకొస్తుంది. మొదట శరీరము వణికిపోతుంది. కనులలో నీరు తిరుగుతుంది. పక్కవారి మాటలు వినపడవు. నాలుక స్పర్శను కోల్పోతుంది. శ్వాస బలమవుతుంది. అప్పుడు కన్నీరు బైటికొస్తుంది.

## దేవీ నవరాత్రుల్లో అమ్మవారికి ఏ రోజు ఏ పూలమాల వేయాలి?

- మొదటి రోజు బిల్వదళముల మాల లేదా మల్లెలతో కట్టిన మాల.



- రెండవ రోజు జాజిపూలతో చేసిన మాల లేదా తులసీ మాల.
- మూడవరోజు సంపెంగీ, మరువం మాలలు.
- నాలుగవ రోజు సన్నజాజులతో చేసిన మాల.
- ఐదవ రోజు మరువంతో కూడిన కదంబమాల.
- ఆరోరోజు మందార మాల.
- ఏడవ రోజు మొగలిపూల మాల.
- ఎనిమిదవ రోజు గులాబీలతో మాల.
- తొమ్మిదో రోజు నేరేడు ఆకులను మాలగా చేసి అమ్మవారికి సమర్పించాలి.

**ఉన్నతురాలైన స్త్రీ తన ఉత్కృష్ట ఆచరణ ద్వారా వేయి మంది పురుషులకు సైతం ఉత్తమ మార్గాన్ని చూప గలుగుతంది.**

**- బృహత్సంహిత**

## నవరాత్రి తొమ్మిది రోజులు పెట్టవలసిన నైవేద్యాలు ?

తొలిరోజున పొంగలీ, ఆపై రోజులలో పులిహోరా, చక్కెరపొంగలి, కదంబ అన్నమూ,

దధ్యోజనమూ, ఆరవరోజు కొబ్బరి అన్నమూ, ఆపై రోజు నిమ్మకాయ పులిహోర ఇక తొమ్మిదవ రోజున పాయసము అమ్మవారికి నవరాత్రుల్లో పెట్టవలసిన నైవేద్యాలు.

## దీపాన్ని దేనితో వెలిగించాలి?

ఎట్టి పరిస్థితుల్లోనూ భగవంతునికి పెట్టిన దీపాన్ని అగ్గిపుల్లతో వెలిగించకూడదు. కర్పూరంతో లేదా సాంబ్రాణితో వెలిగించాలి. దీపావళి దీపాలూ, తులసి కోట వద్ద దీపాలూ కూడా ఇదే విధంగా వెలిగించాలి. అప్పుడే ఆ దీపాలకి పవిత్రత చేకూరుతుంది.

## కొన్ని పుణ్యక్షేత్రాల్లో జుట్టునూ, కాలి, చేతి వేళ్ళ గోళ్ళనూ తొలగించి నదిలో వేయించేదెందుకు?

మనం చేసిన పాపాలు జుట్టులోనూ, కాలి మరియు చేతి వేళ్ళలోనూ స్థిరంగా నివాసం ఏర్పరుచుకొని ఉంటాయి.

పవిత్ర పుణ్య నదుల్లో అందుకే 'వేణిదానము' చేయిస్తారు. జుట్టు, గోళ్ళను నదిలో కలపటం ద్వారా పాపాలు నశించుతాయి. ఆపై ఎటువంటి పాపములు చేయకుండా ఉండాలి.



## శ్రీరాముడు రావణుడితో యుద్ధం చేసింది సీత కోసమే కాక నిగూఢంగా ఉన్న మరో కారణం?

రావణాసురుడు కొన్ని వేలమందికి చేసిన అన్యాయాలకీ, ఆకృత్యాలకీ, అధర్మ ప్రవర్తనకీ తను ఒక్కడై, వారందరి ప్రతినిధియై శ్రీరాముడు రావణాసురుడ్ని సంహరించాడు. పుణ్యం నశించిపోయే వరకే పాపాత్ముడు ఎన్నయినా, ఎంతటి నీచాలైనా చెయ్యగలడు.

## జపం చేసేటప్పుడు జపమాలను గోముఖ సంచిలో ఉంచేదెందుకు?

జపం చేసేవారు జపమాలను కనపడనీయ కూడదు. అందుకే ఎవ్వరికీ కనిపించకుండా గోముఖ సంచిని వాడతారు. మాలను అందులో ఉంచి జపం చేస్తారు. ఎడమ చేతితో జపమాలను తాకరాదు, అలాగే స్నానము చెయ్యకుండా జపమాలను పట్టుకోరాదు. జపమాలతో మేరువును దాటితే నీటిని అరచేతిలో పోసుకొని ఆపై జపాన్ని చేయాలి. తడిగుడ్డలతో జపం

చేయకూడదు. అలాగే బట్టలు తడిగా ఉండే పరిస్థితి ఉంటే ఏడుసార్లు విదిలించి ధరిస్తే చాలని శాస్త్రం తెలవిస్తోంది.

## మనల్ని నడిపించే మనలోని శక్తులు?

మానవుని దేహంలోని సూక్ష్మ చక్రాలు: ఆధారం స్థానములో మూలాధారమూ, అందుపైన స్వాదిష్ఠానమూ, నాభి వద్ద ఉండే మణిపూరమూ, హృదయానికి చేరువలో అనాహతమూ, కంఠం వద్దనున్న విశుద్ధమూ, రెండు కనుబొమ్మల మధ్యన ఉండే ఆజ్ఞాచక్రమూ, అలాగే బ్రహ్మ రంధ్రము వద్ద నుండే సహస్రారమూ. ఇవే మానవుడ్ని నడిపే అద్భుత శక్తులూ, శరీర శక్తులూ, అధిపతులూ.

## ఎవరికి ఎలా దణ్ణం పెట్టాలి?

భగవంతునికి శిరస్సు వంచి పది నుంచి పన్నెండు అంగుళాలు చేతులెత్తి నమస్కరించాలి. విద్యాబుద్ధులు నేర్పిన గురువులకి ముఖానికి ఎదురుగా చేతులు జోడించి నమస్కరించాలి. సన్యాసులకూ, భాగవత ప్రవచనాలను చెప్పువారికీ, ధర్మాలను చెప్పేవారికీ వక్షస్థలం వద్ద చేతులు ఉంచి నమస్క



రించాలి. తండ్రికీ, తల్లికీ పెదవుల మధ్యగా చేతులు ఉంచి నమస్కరించాలి.

అధర్మపరులకీ, అబద్ధాలు చెప్పేవారికీ, గొడవలు పెట్టేవారికీ కనులు పైకెత్తి పలకరించి నమస్కరించాలి.

## మజ్జిగలో ఎన్ని రకాలున్నాయి? అవి ఏమిటి?

అంతస్థుల తేడా లేకుండా అందరికీ అందు బాటులో ఉండే మజ్జిగలో పదిరకాలు ఉన్నాయి. మజ్జిగను దశవిధ తక్కం అని అంటారు.

మజ్జిగలో కలిపే నీటి శాతాన్ని బట్టి మజ్జిగ యొక్క పేరునూ, ఆ మజ్జిగ ఇచ్చే ఫలితాన్నీ చెప్పాయి శాస్త్రాలు.

మొదటిది మజితం. తియ్యని పెరుగుని నీరు కలవకుండా చిక్కగా చేస్తారు. దీని వలన మూత్రకోశవ్యాధులు తగ్గుతాయి.

రెండవది మిళితం. ఒక వంతు పెరుగు, మూడువంతుల నీళ్ళు కలిపి చేస్తారు. ఈ మజ్జిగ పాండు, ఉదరకోశ వ్యాధులను తగ్గిస్తుంది.

మూడవది గోళం. ఒక వంతు పెరుగు, ఒకటిన్నర వంతు నీరు కలిపిచేసే ఈ మజ్జిగ నేత్రవ్యాధులను, మూత్ర రోగాలను తగ్గిస్తుంది.

నాలుగవది దధి. ఒక వంతు పెరుగు ఐదు పాళ్ళు నీటిని కలిపి చేసే ఈ మజ్జిగను త్రాగటం వలన

చిన్నవయసులోనే ముఖంపై ముడతలు వచ్చి ముసలితనం కనిపించే చిహ్నాలు తొలగుతాయి. తిరిగి రాకుండా కూడా ఉంటాయి.

ఐదవది కాలశయం. ఒక వంతు పెరుగు నాలుగు వంతుల నీరుతో చేసే ఈ మజ్జిగ విషశక్తికి కూడా విరుగుడుగా పనిచేసి ఉదరకోశ వ్యాధుల నుంచి ఉపశమనాన్నిస్తాయి.

ఆరవది కరమథితం. కవ్వం పెట్టి చిలకకుండా పెరుగు, నీటిని సమపాళ్ళలో తీసుకొని చేతులతో పిసికి చేసేది. అయితే చేతులతో చేసేది ఏదీ కూడా శరీరానికి కావల్సినంత ఆరోగ్యాన్ని చేకూర్చదు.

ఏడవది ఉథశిత్వం. ఒక వంతు పెరుగు, రెండువంతుల నీటితో చేసే ఈ మజ్జిగ తీసుకోక పోవటం శ్రేయస్కరం.

ఎనిమిదవది తక్రం. రెండు వంతుల పెరుగు, ఒక వంతు నీరుతో మజ్జిగ చేసి శొంఠి, మిరియాలు వంటి వాటితో పాటు పిప్పళ్ళ పొడితో చేసిన కషాయాన్ని కలుపుకొని తాగితే ఇది పాండురోగాన్ని తగ్గిస్తుంది.

తొమ్మిదవది దండాహతం. ఒక వంతు పెరుగు, రెండు వంతుల నీరుతో చేసే ఈ మజ్జిగని అన్ని ఋతువులలో తీసుకోవచ్చు. ఈ దండాహతంనిత్యం



పిల్లలకి ఇవ్వటం ద్వారా ఉత్సాహాన్నీ, చురుకుతనాన్నీ వారిలో పెంచవచ్చు.

పదవది అతిమిళితం. ఒక వంతు పెరుగు, తొమ్మిది వంతులు నీటిని కలిపి చేసే ఈ మజ్జిగ అన్ని వయసుల వారికీ ఎంతో బలాన్ని చేకూరుస్తుంది. వయసులో ఉన్నవారూ, పిల్లలూ తీసుకోకపోయినా పర్వాలేదు గానీ ఓ వయసు దాటిన వారు తీసుకుంటే శక్తి విషయంలో లోటుండదు. దీన్నే మజ్జిగ తేట అని కూడా పిలుస్తారు.

ఈ మజ్జిగ తేట అమృతం వంటిది. శరీరానికి ఎంతో మేలు చేస్తుంది. ఎండవేడి తాపాన్ని తగ్గిస్తుంది. ఆయాసాన్ని తీరుస్తుంది. ముఖ్యంగా ఎండాకాలమంతా ఇంటిల్లిపాదీ తీసుకుంటే ఆ కాలమంతా చల్లని ప్రదేశాల్లో ఉన్న అనుభూతి కొంతయినా ఉంటుంది. రక్తపైత్యాన్నీ, విరోచనాలనూ కూడా అరికడుతుంది.

## భర్త భార్య ఎంగిలి ఎందుకు తినకూడదు?

జఠరాగ్నిని సంతృప్తి చేయడం కోసం జీవుడు ఆహారాన్ని స్వీకరిస్తాడు. అనగా ఆకలి అనే అగ్నికి మనం పెట్టే నైవేద్యం. ఆ పెట్టిన నైవేద్యం ద్వారా వచ్చిన ప్రసాదాన్నే మనం ప్రాణశక్తిగా మార్చుకొని జీవి

స్తున్నాము. అలాగే ఆహారాన్ని స్వీకరించేముందు మంత్రం చెప్పుకొని భగవంతుని స్మరించుకొని స్వీకరించటం మన ఆచారం.

భార్యది కావచ్చు, భర్తది కావచ్చు, ఎవరిదైనా కావచ్చు మనలో ఉన్న భగవంతునికి ఎంగిలి నైవేద్యాన్ని పెడతామా? అందుకే భార్య, భర్త కానీ, స్నేహితులైనా ఎవ్వరైనా ఒకరి ఎంగిలి ఒకరు తింటే భగవంతునికి ఎంగిలి నైవేద్యం పెట్టిన దోషం కలుగుతుంది.

ఒకప్పుడు పతివ్రతా ధర్మం ప్రకారం పతిని పరమాత్మునిగా భావించి పతి తినగా వదిలిన అన్నాన్ని ప్రసాదంగా స్వీకరించేవారు.

అయితే కొన్ని గృహాల్లో అత్తాకోడళ్ళ గొడవల్తో భార్యకి తన తల్లి అన్నం సరిగ్గా పెట్టడం లేదని గ్రహించి భర్త తానే ఎక్కువగా అన్నింటినీ పెట్టించుకుని తను మిగిల్చిన అన్నాన్ని భార్య తినాలి అనే ఆచారాన్ని తెచ్చి భార్య ఆకలి బాధను తీర్చేవాడు.

అదే కొంతకాలం తరువాత సాంప్రదాయంగా కూడా మారింది.

అయితే వైద్యశాస్త్రం ప్రకారం శుభ్రత పరంగా గానీ, ఆరోగ్య పరంగా కానీ ఎవరూ ఎవరి ఎంగిలి తినకపోవటము శ్రేయస్కరం. అది ఆరోగ్యాన్ని చేకూర్చే మంచి పద్ధతి కూడా.



**గర్భిణీతో వున్న వారు రామాయణంలో బాలకాండను పఠించటం వల్ల మహావీరుడూ, సుగుణాల రాశి వంటి పుత్రుడు జన్మిస్తాడని ఉమా సంహిత శెలవిస్తోంది.**

## ధనమున్న వానికీ, లేనివానికీ ఎందుకా తేడా?

ఉన్నవాడు అయాచితంగా ఒక్కపైసా ఇచ్చేదీ లేదు. లేనివాడు ఇవ్వనిదీ లేదు. అయినా అంత తారతమ్యమెందుకంటే ధనమున్న వాడు, మనల్ని అప్పు అడగడు... చందాలడగడు. అతనితో వ్యాపారం చేస్తే ధనమెక్కడికీ పోదు. అవసరమొస్తే మనమే అడగవచ్చు. సన్యాసితో రాసుకు పూసుకుంటే రాలేది బూడిదే. అదే ధనమున్న వాడితో పూసుకుంటే కనీసం ఖర్చయినా తగ్గుతుంది.

## వధూవరులు పెట్టుకునే జీలకర్ర బెల్లం పరమార్థం?

వివాహతంతులో వధూవరులు ఒకరి తలపై మరొకరు పెట్టుకునే జీలకర్రబెల్లంలో శక్తివంతమైన

రహస్యం దాగి ఉంది. జీలకర్ర బెల్లం వలన వధూవరుల పరస్పర జీవశక్తులు ఆకర్షింపబడతాయి. అరచేతితో ఈ మిశ్రమాన్ని ఎదుటివారి తలపై పెట్టడం వలన మిశ్రమం ద్వారా వారి చేతులయందున్న శక్తి ఇరువురి బ్రహ్మరంధ్రాలలోకి ప్రవేశించి సహస్రార చక్రం ద్వారా భ్రూమధ్యంలో ఉన్న ఆజ్ఞాచక్రం ద్వారా ఆకర్షక శక్తిని కలుగచేస్తుంది. హస్తమస్తక సంయోగమే వధూవరులు పెట్టుకునే జీలకర్రబెల్లంలోని అసలు సిసలు పరమార్థము.

## మహాపాతకమైన బ్రహ్మహత్యతో సరితూగు పాపములు?

"అతిథిని పిలిచి భోజనం పెడుతూ లోలోన బాధపడటమూ, సమయానికి పెట్టకుండా వేచి ఉండేలా చేయటమూ, ధర్మకార్యాలు చేస్తూ జీవనం సాగిస్తున్న వారి నోటి దగ్గరి ధనాన్ని లాగేసుకోవటమూ, గేదెలూ, ఆవులూ, జంతువులూ నీరు త్రాగుతుంటే అదిలించటమూ, మహాశాస్త్రాలను చులకన చేస్తూ మాట్లాడటమూ, తమ తెలితేటలతో ఎత్తులు వేసి అమాయకుల్ని రోదించేలా చేయటమూ, తగిన వరునికి కాకుండా ధనమున్నదని ఇచ్చి కూతురు గొంతు కోసిన తండ్రికీ, ఇవన్నీ మహా మహాతి పాపాలు. ఆ పాపాలకి



నిష్కృతి లేదు. ఎన్ని జన్మలెత్తినా పాపఫలం అనుభవిస్తూనే ఉండాలి.

**నీ గూర్చీ, నీ చర్యల గూర్చీ పక్కవారు వ్యధ చెందితే అది నీకు పాపాన్ని మూటగడుతుంది.**

## కర్మేంద్రియాలూ, జ్ఞానేంద్రియాలూ ఏవి?

వాగేంద్రియమూ, పాణీంద్రియమూ, పాదేంద్రియమూ, వాయురింద్రియమూ, ఉపస్థేంద్రియమూ ఈ అయిదు కర్మేంద్రియాలు. ఇక అయిదు జ్ఞానేంద్రియాలు చెవీ, చర్మమూ, కనులూ, నాలుకా, ముక్కు.

## 'వినాశకాలే విపరీత బుద్ధి' అని పెద్దలెందుకు అన్నారు?

ఆ వాక్కులో అనంతమైన పురాణ జ్ఞానము ఉంది. వినాశనము దాపురించే రావణుడు సీతను ఎత్తుకెళ్ళి నాశనమయ్యాడు. ద్రౌపది వస్త్రాలు లాగే కౌరవులు హతమయ్యారు. పరీక్షిత్తు మహారాజు ముని మెడలో చనిపోయిన పామును వేసి, ఆ చనిపోయిన పామున్న

చోటికే తానూ వెళ్ళిపోయాడు. దీన్ని బట్టి మనిషి చేసే ఆలోచనే ఒక్కోసారి వినాశనానికి దారి తీస్తుంది. ఆలోచన రాగానే మంచీ చెడ్డలు విచారించి, మంచిదైతే కార్యం ప్రారంభించమని, ఆ కార్యం ద్వారా వచ్చే నష్టాలూ, ఘోరాలూ అలాంటి వాళ్ళను చూసీ, తెలుసుకొని గానీ, అలాంటి విపరీత ఆలోచనలు చేసి అసలుకే మోసం తెచ్చుకోవద్దని, పెద్దలు నర్మగర్భంగా చెబుతారు.

## పుట్టింటివారు లక్ష్మీదేవి పటాన్నిగానీ, లక్ష్మీ విగ్రహాన్ని గానీ ఇస్తే కుబేరులవుతారా?

సహజంగా పుట్టింటివారు కూతురికి అటువంటివి ఇవ్వరు. వారింటి ధనం, వైభోగాలు ఆ పటం ద్వారా, విగ్రహాల ద్వారా వెళ్ళిపోతుందని వారి నమ్మకం. అయితే లక్ష్మీ పురాణం ప్రకారం అలా ఇవ్వటం వల్ల కూతురికి బాగా కలిసొస్తుంది. ఎంత లేని వాళ్ళయినా అనతికాలంలోనే ధనవంతులూ, కీర్తివంతులవుతారని శాస్త్రం శెలవిస్తోంది. అలా ఇవ్వకూడదని పెద్దలు చెప్పటానికి కారణం లక్ష్మీ విగ్రహం కానీ, లక్ష్మీరూపు గానీ ఇస్తే అల్లుడు అత్తింటి నుంచి ఇంకా ఇంకా ఆశించే ఆశ మొదలవుతుందనీ,



అది ఇరు కుటుంబాల మధ్య లేనిపోని సమస్యని తెచ్చిపెడుతుందని పెద్దలు ఆ ఆచారాన్ని పెట్టారు. వారు పెట్టిన ఆచారం అక్షర సత్యం.

**కన్యాదానం చేసిన తల్లి, తండ్రి కంటే పరిస్థితుల కారణంగా కన్యాదానం చేసిన బామ్మ, తాతయ్యలకూ, లేదా అన్నా, వదినకూ, పిన్నీ, బాబాయికీ, కన్న తల్లీ తండ్రికీ వచ్చే పుణ్యం కన్నా వేయి రెట్లు ఫలము వస్తుందని వివాహధర్మశాస్త్రం శెలవిస్తోంది.**

## మంథర ఎవరు?

కైకకి దురాలోచనలనూ, దుర్మార్గపు ఆలోచనలనూ కలగ చేసిన మంథర ఎక్కణ్నించి వచ్చిందో, ఎలా కైక పుట్టింటికి చేరిందో రామాయణంలో లేదు. అయితే పురాణాల ప్రకారం దుందుభ అనే గంధర్వ స్త్రీని దేవతలు మంథరగా సృష్టించి సందర్భోచితంగా శ్రీరామపట్టాభిషేక సమయాన రావణవధకై సరస్వతీ

దేవి మహిమతో ఆమె నోటి నుంచి చెప్పవలసిన మాటలను చెప్పించారు. ఎందుకోసం మంథర సృష్టింపబడిందో ఆ కార్యం పూర్తి అవ్వగానే ఆమె కనుమరుగైపోయింది.

**అతి వేడి పదార్థాలు తినగానే చల్లటి నీళ్ళుత్రాగితే ఎంతటి అనారోగ్యమో వెనుక వైపున చేతులు కట్టుకున్న వాడ్ని నమ్మినా అంతే ఫలితమని విదురుడు శెలవిస్తున్నాడు.**

## అనారోగ్యంతో వున్న వార్ని ధన్వంతరి ఆలయానికెళ్ళి దర్శనం చేసుకోమంటారెందుకు?

అనేక దీర్ఘవ్యాధులతో బాధపడేవారికి 'ధన్వంతరి ఆలయానికి శ్రమకోర్చి అయినా వెళ్ళి దర్శించు నీ బాధలు తగ్గుతాయి' అని పెద్దలు చెబుతారు. కారణం సూర్యుని వద్ద ఆయుర్వేద వైద్యాన్ని నేర్చుకున్న పదహారు మందిలో ప్రథమ శిష్యుడు ధన్వంతరి. అట్టి దేవ వైద్యుడి



ఆలయాన్ని ఆగమశాస్త్రాల ప్రకారము మన ఇరవై ఏడు నక్షత్రాలకూ, తొమ్మిది గ్రహాలకీ సంబంధించిన దివ్యఔషధ మొక్కలను నాటి పెంచి, మధ్యలో ధన్వంతరి ఆలయం కడతారు.

అక్కడికి వెళ్ళి దర్శించుకుంటే ఆ మహాదివ్యౌషధాల గాలి ప్రభావంతో అంతు చిక్కని రుగ్మతలు కూడా దూరమౌతాయని అలా చెప్పారు పెద్దలు. ధన్వంతరి ఆలయానికి వెళ్ళినప్పుడు తప్పనిసరిగా కొంతసేపు అక్కడ కూర్చుని ధ్యానం చేయాలి.

## అబ్బాయీ, అమ్మాయీ నాడీ దోషం పరిశీలించి ఎందుకు వివాహం కుదుర్చుకుంటారు?

ఈ నాడీకూటములు స్త్రీ పురుషుల్లో మూడు రకాలుగా ఉంటాయి. వరాహ మిహిరుడు శెలవిచ్చిన ప్రకారము అవి వాత, పిత్త, కఫ కూటములు. స్త్రీ పురుషుల కూటములు ఒకటే అయితే ఇరువురికీ శారీరిక పరంగా ఇబ్బందులు కలుగుతాయి.

ఇరువురిదీ వాత కూటమైనా వారి సంసార నావ సుఖంగా సాగదు. పుట్టే సంతానం విషయంలో కూడా సమస్యలు ఎదుర్కొంటారు. ఇరువురిలో ఒకే కూటమి

ఉంటే, ఇద్దరూ కలిసినప్పుడు అధికమైన అనేక సమస్యలకీ, అనారోగ్యాలకీ కారణమౌతుందని చెబుతారు. పెళ్ళి చూపులకి ముందే ఈ తంతును ఇరువురికీ చేయిస్తారు.

## కన్యాదాత దానమంత్రం చివర 'నమమ'అని ఎందుకు పలికించరు?

దానమివ్వటమంటే... ఇచ్చినదానాన్ని పాడు చేసుకొనుటకూ, తిరిగి దాన మిచ్చుటకూ, తన కిష్టమైనట్టు చేసుకొనుటకూ, పరులకీ, తన సుఖాల కోసం వినియోగించుటకూ దానము తీసుకున్న వానికి హక్కు వుంటుంది.

కన్యాదాన సమయంలో 'నమమ' అని చెప్పనిది, నీ సహధర్మచారిణిగా ఉండుటకు మాత్రమే దాన మిస్తున్నానని.

దానికి కాకుండా మరో విధంగా ప్రవర్తిస్తే సామదానదండోపాయాలతో నిన్ను అనగా అల్లుణ్ని శిక్షించి, సరైన ద్రోవలో ఉంచుటకు పుత్రిక తండ్రీ, తల్లీ అయిన మాకు హక్కు ఉన్నది, ఉండాలనీ ఆ మంత్రంలో 'నమమ'ను పలికించరు బ్రాహ్మణులు.



## స్ఫటికరాయికి నల్లతాడు కట్టి సింహద్వారానికెందుకు వేలాడదీస్తారు?

నలుపుతాడుకి దిష్టినీ, ఎంతటి ఉగ్రవేడినయినా ఆవహించి తనలో దాచుకునే శక్తి ఉంది. స్ఫటికము గట్టిది. ఎంతమంది ఎన్ని శాపనార్థాలూ పెట్టినా, ఏడుపులూ ఏడిచినా ఆ రోదనలూ, శాపాలూ నల్లతాడు గ్రహించి గట్టిదైన స్ఫటికంలో కప్పెడుతుంది. సింహద్వారం దాటి ఏ నరదిష్టిలను లోనికి రానియ్యదు. అందుకే స్ఫటిక రాయిని లావాటి నల్లతాడుకి కట్టి వేలాడదీస్తారు.

**క్రోధమూ, ద్వేషమూ గలవారితో తొలుత వినయంతోనూ, వినమ్రత తోనూ ఉండి, ఆపై మాత్రమే దండ ప్రయోగం చెయ్యాలి - ఋగ్వేదము**

## రాత్రి భోజనం తర్వాత ఏం చెయ్యాలి?

చాలామంది కొంచెం సమయం కూర్చొని నిద్రకుపక్రమిస్తారు. ఆయుర్వేదశాస్త్రం మాత్రం భోజనం

తర్వాత కనీసం నూట ఎనిమిది అడుగులు వేయాలనీ, ఎనిమిదిసార్లు ఉచ్ఛ్వాస నిశ్వాసలు తీసుకొని ఆపై విశ్రమించి పద్దెనిమిది సెకన్లపాటు కుడి వైపు తిరిగి పడుకొని, ఆపై ముప్ఫయి సెకన్లపాటు ఎడమవైపు తిరిగి పడుకొని ఆపై మామూలుగా పడుకుని మంచి వ్యక్తుల గూర్చీ, మంచి పనుల గూర్చీ ఆలోచిస్తూ నిద్రలోకి జారుకోవాలి అని చెబుతోంది.

## మౌనీ అమావాస్య రోజు మౌనవ్రతాన్ని పాటించమని పెద్దలు చెప్పిందెందుకు?

మాఘమాసంలో వచ్చే అమావాస్య రోజు మౌనీ వ్రతం ఆచరించి నదీతీరంలో గానీ, సముద్రస్నానం గానీ చేస్తే పుణ్యమని పెద్దలు చెబుతారు. దానితో పాటు అస్సలు నోరు పెగల్చవద్దని పరమనిష్ఠతో మౌనంగా ఉండమనటంలో ప్రథమ ఉద్దేశ్యం మాట్లాడటానికి సహకరించే అనేక నరాలూ, నాలుకా, నోరూ, దంతాలకీ ఆ రోజు సంపూర్ణంగా శెలవివ్వటమే. సంవత్సరంలో ఒక్కసారన్నా ఉపవాసము ఉండి కడుపుకీ, మౌనీ అమావాస్య నాడు మౌనం దాల్చి నోటికీ ఒకింత విశ్రాంతి నివ్వాలనే పెద్దలు భక్తినీ, ఆరోగ్యాన్ని



కలిపి ఆచారంగా పెట్టారు. విశ్రాంతి ఎప్పటికప్పుడు మనం తీసుకుంటాము. పెద్దలు శరీరంలో పనిచేసే అవయవాలకి ఆచారాలూ, సాంప్రదాయల పేరుతో విశ్రాంతినిచ్చారు.

**వంకర వేళ్ళున్న దాన్నీ, అలాగే పొట్టి వేళ్ళున్న దాన్నీ వివాహం చేసుకోరాదని భవిష్యపురాణం శెలవిస్తోంది.**

## ఎక్కడ స్నానము చేస్తే ఏ కార్యం నెరవేరుతుంది?

- అనేక గ్రహ బాధల కోసం దేవాలయాల్లోని బావి వద్దా.
- విజయాన్ని కాంక్షించే వారు తీర్థజలంలోనూ.
- గర్భస్రావ వ్యాధుల నివారణకు పుష్కర స్నానమూ.
- సంతానం కోసం సముద్రస్నానమూ.
- విద్యను ఆశించేవారు నదీతీరప్రాంతంలో ఒడ్డున ఉండి మాత్రమే స్నానమాచరించాలి.
- అనారోగ్యము తగ్గటం కోసం వర్షంలో స్నానం చేయాలి.

## పేరంటంలో చిమ్మిరి ఎందుకు పెడతారు?

శనికి ఇష్టమైనవి నువ్వులు. ఆ నువ్వులని ఎవ్వరూ దానం తీసుకోవటానికి సాహసించరు. ముందుకు రారు. అందులో బెల్లం, కొబ్బరీ కలిపి చిమ్మిరి ఉండగా చేసి దానితో పాటు శెనగలూ, వక్కా, ఆకులనూ పేరంటానికి వచ్చిన పేరంటాళ్ళను పిలిచి తాంబూలంగా ఇస్తారు. అలా పెట్టిన వారికి శనిగ్రహదోష నివారణ అయి శుభం చేకూరుతుంది. తీసుకున్న వారికి చిమ్మిరి వల్ల వాతాన్ని కలిగించే అనేక వ్యాధులు నయమవుతాయి. శనిగ్రహం కూడా చిమ్మిరి తీసుకున్న వారిపై తన గ్రహపీడ పడకుండా చూస్తుంది.

## నారాయణ పంచాయత పూజకై ఎవరిని ఏస్థానంలో ఉంచి పూజించాలి?

మహావిష్ణువూ, లక్ష్మీపతీ అయిన శ్రీమన్నారాయణుణ్ని మధ్యలో, ఆగ్నేయ దిశగా పరమేశ్వరుణ్నీ, నైరుతి దిశగా సూర్యభగవానుణ్నీ, వాయువ్యదిశగా వినాయకుణ్నీ, ఈశాన్యమున అంబికనూ ప్రతిష్ఠించి పూజాదికాలు నిర్వర్తించాలి.



## శివపంచాయతనంలో ఎవరిని ఏ స్థానంలో ప్రతిష్ఠించాలి?

వెండికొండ నాథుడూ, అర్ధనారీశ్వరుడూ అయిన పార్వతీపతిని మధ్యలో ప్రతిష్ఠించి, ఆగ్నేయ దిశగా శ్రీమహావిష్ణువునూ, నైరుతి దిశగా సూర్యభగవానుణ్నీ, వాయువ్యదిశగా విఘ్నవినాశకుడు గణపతినీ, ఈశాన్యమున అంబికనూ ప్రతిష్ఠించి శివపంచాయత పూజ చేయాలి.

**సంసారంలో ఉన్న వారికి నిద్రా, మూర్ఛా, మతిమరుపు ఎంతటి వారికైనా తప్పవు.**

## వినాయక పంచాయతన పూజలో ఏ దేవతలను ఏ దిక్కున ప్రతిష్ఠించాలి?

వినాయకుణ్ని మధ్యలో ప్రతిష్ఠించి ఆగ్నేయము దిశగా పరమశివుణ్నీ, నైరుతి దిశగా సూర్యభగవానుణ్నీ, వాయువ్యమున శ్రీమన్నారాయణుణ్నీ, ఈశాన్య దిశగా శక్తియైన అంబికనూ ప్రతిష్ఠించి పూజాదికాలు నిర్వర్తించాలి.

## సూర్యపంచాయతన పూజలో ఏ దేవతలను ఏ దిశగా ప్రతిష్ఠించుకోవాలి?

మధ్యలో సకల జీవకోటికి అన్న ప్రదాత సూర్యభగవానుణ్ణీ, ఆగ్నేయ దిశగా పరమేశ్వరుణ్ణీ, నైరుతి దిశగా శ్రీమహావిష్ణువునూ, వాయువ్యదిశగా గణపతినీ, ఈశాన్యదిశగా శక్తియైన అంబికను ప్రతిష్ఠించుకోవాలి.

## మహాశక్తి అంబిక పంచాయతన పూజలో ఏ దేవతలని ఏ దిక్కున ప్రతిష్టించాలి?

పంచభూతాల తత్వాలకి మూలమైన పంచ దేవతల్లోని అంబిక పంచాయతన పూజకై మధ్యలో అంబికనూ, ఆగ్నేయము దిశగా మహేశ్వరుణ్ణీ, నైరుతి దిశగా ఆదిత్యుణ్ణీ, వాయువ్యదిశగా గణపతినీ, ఈశాన్య దిశగా శ్రీమహావిష్ణువునూ ప్రతిష్ఠించి పంచాయతన పూజ చేసుకోవాలి.

## స్త్రీకి అతి బరువైన కార్యము?

స్త్రీకి కుటుంబాన్ని చూసుకోవటానికన్నా, భర్తని మార్చుకోవటం కన్నా, పిల్లల్నీ, బంధువులనూ



ఆత్మీయంగా చూసుకోవటం కన్నా తన జీవన భాగంలో తన శీలాన్ని రక్షించుకోవటమనే పనే పెద్దపని.

## ధనాన్ని ఉత్తర గదిలో దాచి పెడితే, కుబేర అనుగ్రహం కలిగి మరింత ధనం చేరుతుంది.

## శ్రీకాళహస్తీశ్వర ఆలయంలో శివలింగం వెనుక దీపాలెందుకు కదులుతుంటాయి?

ఈ క్షేత్రంలో శివాయనమః అని అనుకుంటూ అయిదు దీపాలను వెలిగిస్తే అనంత పుణ్యము వస్తుంది. స్వామి ఇక్కడ వాయులింగం. అందుకే లింగానికి వెనకున్న దీపాలు కదులుతుంటాయి. రాహుకేతు దోషాలు ఉన్నవారు ఈ క్షేత్రంలో పూజాదికాలు నిర్వహించి దోషాలను పోగొట్టుకుంటారు.

## శ్రీమహావిష్ణువు దశావతార జయంతులెప్పుడు?

| | |
|---|---|
| మత్స్యావతారము | చైత్రబహుళపంచమి |
| కూర్మావతారము | వైశాఖశుద్ధపౌర్ణమి |

| | |
|---|---|
| వరాహావతారము | చైత్రబహుళత్రయోదశి |
| నరసింహావతారము | వైశాఖశుద్ధద్వాదశి |
| వామనావతారము | భాద్రపదశుద్ధచతుర్దశి |
| శ్రీరామావతారము | చైత్రశుద్ధనవమి |
| శ్రీకృష్ణావతారము | శ్రావణబహుళఅష్టమి |
| బలరామావతారము | వైశాఖశుద్ధపౌర్ణమి |

కల్కిఅవతారము భాద్రపదశుద్ధవిదియనాడు శ్రీమహావిష్ణువు అవతారాన్ని ధరించి లోకకళ్యాణము కోసం దుష్టులను సంహరిస్తాడు.

## రోజులు గడుస్తున్న కొద్దీ, మనిషిలో జ్ఞానము పెరగాలే గాని తగ్గకూడదు

**- అధర్వణవేదము**

## ప్రాయశ్చిత్తము లేని పాపము?

బ్రాహ్మణుని చంపినా, మద్యపానము చేసినా, పరులసొత్తు అపహరించినా, వ్రతాన్ని మధ్యలో నిలిపి ఐహిక భోగములకోసం పరుగులుతీసినా భగంతుని క్షమ ఉంటుంది.

చేసిన సహాయాన్ని మరిచిన కృతఘ్నునకు మాత్రము ప్రాయశ్చిత్తము లేదు.



## ఏ వైపుగా ఉండి మంత్రాలను చదవకూడదు?

ఆసనసిద్ధిలేని మంత్రములన్నీ వ్యర్థములు. దక్షిణదిక్కుగా మంత్రాలను పఠించినా, హోమయాగాదులు చేసినా నిష్ప్రయోజనములే. ఉగ్రహోమాలు చేసేటప్పుడు మాత్రమే దక్షిణ దిక్కుగా ఉండి మంత్రోచ్చాటన చేస్తారు. ఉత్తరాయణంలోనే హోమాధులు జరపాలి.

## తిరుమల స్వామివారికి రోజులో ఎన్నిసార్లు పూజలు చేస్తారు?

వైకుంఠనాథుడైన శ్రీ వేంకటేశ్వరునకు తిరుమలలో వైఖానస ఆగమం ప్రకారం ఆరుసార్లు పూజలు చేస్తారు. ప్రత్యూష పూజలూ, ప్రభాత పూజలూ, మధ్యాహ్న పూజలూ, అపరాహ్న పూజలూ, సాయంకాల పూజలూ, అర్థరాత్రి పూజలూ చేస్తారు.

## నవరత్నాల్లోని రత్నాలు ఎన్ని రోజుల్లో తమ ప్రభావాన్ని చూపుతాయి?

రత్నశాస్త్రము ప్రకారము వైఢూర్యము నెలరోజులూ, వజ్రము ఇరవై రెండు రోజులూ,

గోమేధికము ఇరవై తొమ్మిది రోజులూ, నీలము మూడు రోజులూ, పుష్యరాగము ఏకాదశి, ద్వాదశి మధ్య రోజులలో, మరకతము వారం రోజులూ, పగడము ఇరవై ఒక్క రోజులూ, మాణిక్యము రెండు ఏకాదశుల కాలమూ, ముత్యము ముచ్చటగా మూడురోజుల్లో తమ ప్రభావాన్ని చూపుతాయి. అయితే అవి అసలయినవి అయి వుండాలి.

**అనవసర వ్యర్థ ప్రసంగాలను చేయకుండుట, అసత్యాలను పలకకుండా ఉండుట వల్లా, మాంసాహారము భుజించుకుండా ఉండటం వల్లా నాలుక ద్వారా జీవికి పుణ్యము సంప్రాప్తించును.**

## దంతాలను కొరకవద్దని ఎందుకు చెబుతారు?

పళ్ళు పటపట కోపంతోగానీ మరో కారణంతో గానీ కొరికితే కనులకి హాని కలుగుతుంది. వయస్సులోనే చూపు మసకబారుతుంది. దంతాలకీ,



కనులకీ అవినాభావ సంబంధము ఉంది. ధర్మశాస్త్రాల ప్రకారం మరుజన్మ అత్యంత దరిద్రమైన పంది జన్మ ఎత్తవలసి వస్తుంది. పళ్ళు తోముకునేటప్పుడు మౌనంగా తోముకోవడం ఆరోగ్యానికి శ్రేయస్కరం.

**తను చెప్పినవన్నీ చేస్తే అంతా స్నేహితులే. కాదంటే అంతా శత్రువులే.**

**- వేదవ్యాసులవారు**

## ఆడా, మగా ఎలా స్నానం చేయాలి?

పన్నెండేళ్ళలోపు ఆడపిల్లలూ, మగపిల్లలు వంటి మీద ఏమీ లేకుండా స్నానం చేయాలి. ఆపై మగవారు నాలుగు తడికలమధ్య చేస్తున్నా మొలకు వస్త్రాన్ని కట్టుకునే స్నానం చేయాలి. స్త్రీలు వస్త్రాలుంచుకొని స్నానం చేయరాదు.

మగవారు బట్టల్లేకుండా చేస్తే సంభోగ శక్తి తగ్గుతుంది. గోచీ వల్ల నడుము శక్తితో పాటు అంగరక్షణ కలుగుతుంది. అందుకే పెద్దలు ఆ ఆచారాన్ని పెట్టారు. స్త్రీలు అలా స్నానం చెయ్యటం ద్వారా గుప్తప్రదేశాలు కావలసినంత శుభ్రం అవుతాయి.

## పరస్త్రీలను కామంతో చూస్తే ఏ జన్మ?

- తినేసేలా చూస్తే మరుజన్మలో పుట్టు గ్రుడ్డి.
- క్రీగంట చూస్తే మెల్లకన్ను.
- తాకకూడని ప్రదేశాల్లో తాకినవాడు పిశాచజన్మ ఎత్తుతాడు.
- ధనరూపంలోగానీ, భయరూపంలోగానీ, అవసరార్థం స్త్రీని ఆ పరిస్థితికి తెస్తే మరుజన్మలో కులటగా పుట్టాల్సివస్తుంది.
- పరస్త్రీ శరీరాన్ని చూసి చొంగలు కారిస్తే మరుజన్మలో మూర్ఛవ్యాధి.
- ఎంత ఖాళీగా ఉన్నా, ఇంట్లోని భార్య ఎదురుగా ఉండకు.
- పరస్త్రీని కామంతో చూస్తే ఆ స్త్రీ ఎంత చులకనగా చూస్తుందో అంతే చులకనగా నీ శ్రీమతి కూడా చూస్తుంది.

## మహాశివుని ఏ శివలింగాన్ని పూజిస్తే ఏ ఫలమిస్తుంది?

- అష్టలోహలింగాన్ని పూజించి, అభిషేకిస్తే శరీర బాధలూ, అంటువ్యాధులూ, మానసిక వ్యాధులూ నశిస్తాయి.



- స్వర్ణలింగాన్ని సేవిస్తే సౌఖ్యం, ధన, విద్యాప్రాప్తి.
- స్ఫటిక లింగాన్ని పూజిస్తే కీర్తి, కోరిన కోర్కెలు సఫలము.
- ఖండశర్కర శివలింగాన్ని సేవిస్తే అనగా పటిక బెల్లంతో చేసిన శివలింగాన్ని పూజిస్తే ఆరోగ్యశాంతి, కుటుంబశాంతి, సంతానఫలము.
- గుమ్మడి శివలింగాన్ని పూజిస్తే ధనధాన్యాలు రెట్టింపవుతాయి. గుమ్మడికాయను శివలింగంగా నిర్మించుకొని, ఆపై ఆవుపాలతో అభిషేకించి, విభూది రాసి పూజించాలి.
- మట్టిలింగాన్ని పూజిస్తే గతజన్మ పాపాలు ప్రక్షాళనమవుతాయి. ఈ లింగాన్ని బంకమట్టితో చేసుకోవాలి.
- కొబ్బరి శివలింగము అది కూడా పాతకొబ్బరి కాయను శివలింగంగా పూజిస్తే పుట్టే సంతానము మహాప్రయోజకులూ, శక్తివంతులూ అవుతారు.
- మంచుశివలింగాన్ని అనగా అమర్‌నాథ్ లోని స్వామిని దర్శించి పూజిస్తే మహాశివుని కోరికతో పార్వతీదేవి అష్టలక్ష్ముల ఆశీర్వాదాలను కూడా ఇప్పిస్తుంది.
- గోమయముతో పరమేశ్వరలింగాన్ని స్థాపించి ఆరాధిస్తే అందమూ, ఆరోగ్యమూ, వివాహం

కానివారికి మంచి వరునితో వివాహం అవుతుంది. అనగా బాగా చూసుకునేవాడితో.

## మెటికలు విరిస్తే ఎందుకు వద్దని చెబుతారు?

అలా విరిస్తే వేల్పులు కోపిస్తారు. శపిస్తారు. వేల్పులు వేళ్ళకణుపుల వద్ద ఉంటారు. అలా విరవటం ఆరోగ్యానికి మంచిది కాదు. వేళ్ళు విరుచుకుంటుంటే చేతుల్లోని శక్తి హరిస్తుంది. పట్టు ఉండదని పెద్దలు విరవొద్దని చెబుతారు.

## అస్సలు చేయకూడనివి... అరిష్టాన్ని తెచ్చేవి?

- అద్దంలో సూర్యచంద్రులను చూడరాదు.
- నేల అదిరేటట్టు నడిస్తే నిన్ను అహంకారం గలవానితో జమకడతారు.
- అన్యాయపు సొత్తును తింటే అపకీర్తీ, దుర్గతీ లభిస్తాయి.
- అప్పు పుచ్చుకొని ఎగవేస్తే మరుజన్మలోనైనా నూరురెట్లు అధికంగా కట్టవల్సి వుంటుంది. లేదా దాసీతనం చేసి తీర్చాల్సి ఉంటుంది.



- ఆకాశం వంక చూడకు. చూసేవాడ్ని కూడా చూడకూడదు.
- ఆదివారం ఉసిరిపచ్చడి తినరాదు.
- ఇంగువ, నూనె, ఆవాలు ఎక్కువ వాడకు.
- ఆరవేసిన బట్టలనుండి నీటి చుక్కలు పడకూడదు. అలా పడే చుక్కలు మీ పితృదేవతల కన్నీళ్ళ వంటివి. కావున గట్టిగా పిండి ఆరవేసుకోవాలి.
- ఉదయం లేవగానే కనులు రుద్దుకుని మంచం దిగిన తర్వాత నాభిని చూసుకోవటం వల్ల జఠరాగ్ని పెరుగుతుంది.

**వెధవల వద్దా, దుష్టుల వద్దా, లోభి వద్దా, నీచుల వద్దా, స్త్రీలోలుని వద్దా, ధర్మం చెప్పటమూ, ఉండమనటమూ రెండు అప్రయోజనాలే.**

**- శ్రీహర్షుడు**

## వేటిని పూర్తిగా నాశనము చేయాలి?

అవసరార్థం తీసుకున్న ఋణాన్నీ, అవసరం కోసం వెలిగించిన నిప్పునూ, వ్యాధినీ, నీ శత్రువునూ పూర్తిగా నిర్మూలించాలి. లేదంటే అవి నీపైకే వచ్చి నిన్నే దహించి వేసే అవకాశం ఎంతో ఉంది.

## నీహితునకూ, నీ సన్నిహితునకూ అడగకపోయినా హితము చెప్పు.

## ఎడమచేతితో దానం ఎందుకు చెయ్యకూడదు?

దానవే కాదు. ఆ చేతితో నీరు కూడా త్రాగకూడదు. భోజన సమయంలో కూడా కుడచేతి మణికట్టుపై పాత్రనాన్చి ఎడమచేతితో పట్టుకొని నీరు త్రాగాలి. ఎడమ చేత్తో తాగినా, వడ్డించినా వచ్చేది పాపమే. అలాగే ఎవరైనా ఆ విధంగా వడ్డిస్తున్నా తినరాదు. అలాంటి భోజనము రాక్షస భోజనం అవుతుంది. ఎడమ చేత్తో పిశాచాలు చేసిన పిండమవుతుంది. కుడిచేత్తో ఏ పని చేసినా ఆరోగ్యము. ఎడమచేత్తో ఎంత గొప్ప కార్యము చేసినా అనారోగ్యము.

## తడిబట్టలతో ఏ కార్యం చేస్తే ఏ ఫలము?

- తడిబట్టలను భుజం మీద ఉంచుకుంటే నరాలపోటు కలుగుతుంది.
- తడిబట్టలను దులిపితే పితృదేవతలను దులిపినట్టే. ఎండతగలని దుస్తులను ధరింపకు.



- తదియనాడు తడిబట్టతోగానీ, పొడి బట్టతోగానీ దొండకాయ తినకు.
- తడిబట్టలను తూర్పు ఉత్తరములందు ఆరవేయుము. దక్షిణ పశ్చిమాగ్రంగా తడిబట్టలను ఆరవేస్తే ఆ దుస్తులు అపవిత్రమౌతాయి.
- తడిబట్టలతో తిరిగితే నగ్నత్వ దోషం కలుగుతుంది.
- అలాగే తడిదుస్తులతో భుజిస్తే దరిద్రం ఆవహిస్తుంది.

## భగవంతుడు మనకేం ఇచ్చాడు?

కొన్నివేలమంది కంటే అంగాలని సక్రమంగా ఇచ్చాడు. మరి కొన్నివేలమంది కంటే ఆరోగ్యాన్నిచ్చాడు. ఇంకొన్ని లక్షలమంది కంటే చదువు అనే జ్ఞానాన్నిచ్చాడు. అన్నింటికంటే ముందు కొన్ని కోట్లమంది కంటే మూడుపూటలా తినే అదృష్టాన్నిచ్చాడు. ఇంతకన్నా భగవంతుడు మనకేం ఇవ్వాలి.

## రాజుకన్నా బలవంతుడు మొండివాడెలా అయ్యాడు?

తను చెప్పిందే వేదమనుకున్నవాడు ఎవ్వరి మాట వినడు. తనకెంత నష్టం వచ్చినా, తన వారికి కీడు జరిగినా పట్టిన పట్టు వదలడు. మనిషి ధనం కోసం

లొంగుతాడు. స్త్రీ కోసము, అధికారం కోసము, భోగాల కోసము, తన వారి క్షేమము కోసమన్నా లొంగుతాడు. మూర్ఖుడు వేటికీ లొంగడు.

ఇక వాడ్ని చెయ్యగలిగేది ఏమీ లేదు. అందుకే మూర్ఖుడు రాజుకన్నా బలవంతుడు.

## భార్య గర్భిణిగా ఉన్నప్పుడు ఏ అశుభ కార్యాలకీ భర్త వెళ్ళరాదు.

## గురువు ధర్మమేంటి?

ఉత్తమమైన గురువు శిష్యులను మహావిజ్ఞాన వేత్తలుగా తీర్చిదిద్దాలి. ధనం కోసం కాకుండా, అత్యున్నత శిక్షణ ఇస్తూ తన శిష్యులను తనంత గొప్ప గురువులుగా తయారు చేసినవాడే ఉత్తమ గురువు ధర్మములు ఆచరించినవాడవుతాడు.

## ఈ పుణ్య కార్యాలు చేసినా ఫలం ఉండదు!

రోజూ వ్రతాలూ, నోములూ, దానాలూ, ధర్మాలూ, యజ్ఞాలూ, యాగాదులూ, హోమాలూ, మహాసంతర్పణలూ వంటివి ఎన్ని చేసినా తల్లీ, తండ్రినీ



ఆదరించనివారికీ, నిరాకరించిన వారికీ, దూషించిన వారికీ ఫలం అందకపోగా, మహాఘోర నరకాలని ప్రస్తుతంలోనూ ఆపై లోకాలల్లోనూ చవిచూడాల్సి వస్తుంది.

## మలవిసర్జన తర్వాత మట్టితో చేతులు రుద్దుకొని ఆపై నీటితో కడుక్కోమనేదెందుకు?

ఈ కాలంలో చెబితే చాదస్థంగా కొట్టిపారేయటం సహజం. ఆ రోజుల్లో ఆ కార్యక్రమం అయ్యాక మట్టితో చేతులు రుద్దుకొని తిరిగి నీటితో కడిగేవారు.

మలము అంటిన చేతులకు అనేక విషక్రిములు ఆవహిస్తాయి.

గోళ్ళల్లో సురక్షితంగా ఆవాసం ఏర్పరుచు కుంటాయి. కేవలం నీతో అవిపోవు. మట్టిలో సూక్ష్మక్రిములను పోగొట్టే శక్తి ఉంది. అందుకే మట్టితో రుద్దుకొని ఆపై మళ్ళీ నీటితో శుభ్రపరుచుకోవాలని చెబుతారు ఆ కాలపు వాళ్ళు.

కామాన్నీ, క్రోధాన్నీ ఆపాలి గాని మలమూత్ర విసర్జనలను ఆపకూడదు. అలా ఆపితే వచ్చేది ఉబ్బరమూ, ఆయాసమూ, కడుపునొప్పి అని ఆయుర్వేద శాస్త్రం తెలవిస్తోంది.

## మనిషి జన్మని భగవంతుడిచ్చింది దేనికి?

పెళ్ళి చేసుకుని పిల్లల్ని కని, వార్ని పెంచి పెద్ద చేసి, ఆస్తి సంపాదించి, వాళ్ళకి వివాహం చేసి మనవలని ఎత్తుకుని ఆపై షష్ఠిపూర్తి చేసుకొమ్మని మాత్రమే కాదు. అసలందుకుకాదు - నా తరుపున నువ్వు ధర్మాన్ని కాపాడమని. లోకం కోసం ఏం చేస్తావో చూద్దామని.

## దంతధావనానికి ఏ చెట్టు వల్ల ఎంత ఆరోగ్యమొస్తుంది?

- ఆయుర్వేద శాస్త్రాలు చెప్పిన దాని ప్రకారము మద్దిపుల్ల శరీరంలో అశక్తిని పోగొట్టి ఉత్సాహాన్ని ఇచ్చి ధైర్యాన్ని కలుగచేస్తుంది.
- మర్రిచెట్టు పుల్ల శరీరాన్ని కాంతివంతముగా చేస్తుంది. దానితో పాటు స్త్రీలకూ, సంగీతకళాకారులకూ కంఠస్వరాన్ని మరింత మధురంగా పలికేలా చేస్తుంది.
- మారేడు మహాశివునికి ప్రీతికరమైనది. ధనధాన్యాలను వృద్ధి చేస్తుంది. దానికి కారణం మారేడు రసం శరీరంలోకి ఎంతో కొంత వెళ్ళటం



ద్వారా శక్తివంతులవుతారు. తద్వారా ఎక్కువ శ్రమ చెయ్యగలరు. దానితో ధనమూ, ధాన్యమూ వృద్ధి చెందుతాయి.

- మేడి చెట్టు పుల్ల చక్కటి ఉచ్ఛారణని తెస్తుంది. తడబడే మాటలనూ సరిచేస్తుంది.
- మామిడి చెట్టు పుల్ల పళ్ళకూ, నాలుకకూ, పెదాలకీ మంచిది. మంచి నిగారింపు తెస్తుంది.
- వేప పుల్ల చేసే మేలు చెప్పటానికి సరిపోదు.
- ఇక లవంగం వల్ల నోరంతా శుభ్రమై, అనేక దుష్టక్రిములు నశిస్తాయి.
- రాత్రి పడుకునే ముందు మీ సహధర్మచారిణితో మాట్లాడే ముందు ఓ లవంగం వేసుకుంటే ఆమె సంతోషిస్తుంది.

అయితే వ్యాధులతో బాధపడేవారు పుల్లలతో తోముకోకూడదని ఆ శాస్త్రాలు శెలవిస్తున్నాయి.

## పంచాంగములతో నమస్కారం దైవానికీ, గురువుకీ, పెద్దలకీ ఎలా చెయ్యాలి?

మీ శిరస్సునూ, రెండు హస్తాలనూ, రెండు భుజాలనూ వంచుతూ, మోకాళ్ళపై వంగి చేసేది పంచాంగముల నమస్కారము. స్త్రీలకు నమస్కరించాల్సి

వచ్చినప్పుడు ఏక నమస్కారం చేయాలి. అనగా తలని మాత్రమే వంచి పెట్టడము.

## భగవంతునికి కొట్టే కొబ్బరికాయ ఏక దెబ్బతో పగిలితే ఎంతో శుభం.

## దీపారాధనకి బొడ్డు వత్తులనే ఎందుకువాడాలి?

అలాంటి వాటిని వెలిగించటం ద్వారా నూనె ఎక్కువ పీల్చుకొని ఎక్కువ వెలుగును ప్రసరింప చేస్తాయి. నోములూ, వ్రతాల సమయంలో దీపాన్ని తియ్యాల్సివచ్చినప్పుడు దైవపీఠాన్ని కదిలించి తీయాలి. అలాగే ఏ పరిస్థితులలోనైనా వద్దు అని అనుకున్నప్పుడు వత్తులను నూనెలోకి జార్చాలి.

## కర్రని ఎప్పుడు ప్రయోగించాలి? ఎవరిపై ప్రయోగించాలి?

- ఎన్ని చెప్పినా వినకుండా ఏదో రకంగా సాధిద్దామనుకునే శత్రువు మీదా.
- మనల్ని చూసి మొరిగే కుక్క మీదా.
- భార్యని బానిసగా చూసే భర్తమీదా, సేవకుడ్ని బానిసగా చూసే వారి మీదా.



- నిలువెల్లా విషం నిండిన మనిషి మీదా, కోరల్లోనే విషముండే పాము ఎదురైనప్పుడూ.
- కటిక చీకటిలోనూ, అమావాస్యరోజులలో.
- వృద్ధాప్యం వల్లా, పూర్వజన్మపాపాల వల్లా, కనులకి దృష్టి లోపం వచ్చినప్పుడూ.
- మాట వినని పశువులమీదా, చదువు నేర్వని మొండివాడి మీదా.
- మాట వినని, చెడు విషయాలను పలికే భార్య మీద.

## మహాఋషులూ, మహాత్ములూ రచించిన అపురూప గ్రంథాలని మనమెలా పోగొట్టుకున్నాము?

ఛాందసవాదులైన వారి వల్ల, మతపిచ్చితో అణగదొక్కబడటం ద్వారా, బలవంతముగా అబద్ధపు ప్రచారాలు చెయ్యటం ద్వారా కాలగర్భంలో ఎన్నో కలసి పోయాయి. దేవుడు లేడు అనే అధికార బలము కలవారు అబద్ధపు ప్రచారాలను కల్పించి రామాయణం చదివితే అలా అవుతుంది, భారతం చదివితే ఇలా అవుతుంది, వేదాలు చదవటం ద్వారా అలా అవుతుంది అని ప్రచారం చెయ్యటం వల్ల. ఇంకా ఆ వైద్య గ్రంథం చదివి వారలా అయ్యారూ.... ఈ జ్యోతిష్య గ్రంథాల్లో వున్నది అంతా అబద్ధమే అని బలవంతంగా, శాసించటం ద్వారా

కూడా అమోఘమైన అనేక గ్రంథాలను వందలాది సంవత్సరాల క్రితం రాజులు ప్రజలచేత, పండితుల చేత బావుల్లో, నదుల్లో, తటాకాల్లో వేయించారు. ఆ విధంగా అమృతమయమైన తాళపత్ర గ్రంథాలను ఎన్నో మనం పోగొట్టుకున్నాము.

## ఈ ప్రపంచంలో అన్నింటికంటే కష్టసాధ్యమైనది, తేలికైనది?

అన్నింటికన్నా కష్టమైనది ధర్మంగా ఉండటము. తేలికైనది అధర్మంగా ఉండటము. అలాగే అతికష్టమైనది ధనం సంపాదించటం. తేలికయినది కూడా ధనాన్ని సంపాదించటమే.

## ఏ దర్భలను ఉపయోగించాలి?

- బాగా ఎండిన దర్భలనే వాడాలి.
- బ్రహ్మదేవుని ప్రీతికరమైన సృష్టి దర్భ. గరకుగా ఉండే దర్భలను ఆదివారం నాడు కోస్తే మళ్ళీ ఆదివారం వచ్చేలోగా వాడాలి.
- అదే అమావాస్యనాడు కోస్తే రెండు అమావాస్యల వరకూ వాడవచ్చు.
- మిగతా రోజుల్లో ఏ రోజు కోసినా ఆ రోజే ఉపయోగించాలి.



- మంత్రోచ్ఛారణలోగానీ, పలికే పద్ధతుల్లోగానీ, చేసే క్రియల్లోగానీ చేసే అనేక దోషాలు సాధకునికీ, చేయించేవారికీ తగలకూడదని ఈ దర్భలను తప్పని సరిగా ఉపయోగిస్తారు.
- శ్రీరామచంద్రుడు భార్య కోసం కాకాసురునిపై ప్రయోగించింది ఈ దర్భనే. ఈ గడ్డి పరకనే.

## హోమాదుల్లో నెయ్యి వాడటం వల్ల ఎంతటి లోకకళ్యాణము?

ఆవునెయ్యి హోమంలో పోస్తూ మంత్రపఠనం చేయటం ద్వారా, ఆ నెయ్యిలోని శక్తి ఎన్నో కిలోమీటర్ల వరకూ వ్యాపిస్తుంది. తద్వారా వచ్చే ఆవిరి అనేక వాతావరణ దోషాలను తొలగిస్తుంది. దానితో వర్షాలు బాగా కురిసి అంతా సుఖంగా జీవిస్తారు.

## భగవంతునికి షోడశోపచారాలు చెయ్యటం వల్ల మన శరీరానికి ఎంతటి చలువ?

భగవంతుణ్ని పూజించిన పుణ్యంతో పాటు అంతసేపు స్వామికి అనేక రకాలుగా ఉపచారాలు చెయ్యటం వల్లా, ధూపాలను వెయ్యటం వల్లా, దీపాలను

వెలిగిస్తూ చూడటం వల్లా కనులకీ, నాసికకూ సంబంధించిన లోపాలు సరిచేయబడతాయి.

**మగపిల్లాడు చెడిపోతే తల్లి తప్పు. ఆడపిల్ల చెడిపోతే తండ్రి తప్పు. ఇరువురూ చెడిపోతే వారుండే పరిసరాలది తప్పు.**

## తినే ఆహారం కడుపులోకి ఎంతెంత చేరాలి?

రెండొంతులు ఆహార పదార్థాలూ, ఒక వంతు నీరూ, మరో వంతు ఖాళీగా ఉంటే మీకు రోగాలు చాలా దూరంలో ఉంటాయి.

ఏ మాత్రం మీరినా కూతవేటు దూరంలోంచి వచ్చి కబళిస్తాయి.

- ఆహారాన్ని ఎప్పుడూ తూర్పు తిరిగి భుజించటం ద్వారా భూమిలోని అయస్కాంత శక్తి నరాలకి ప్రాకి మీ ఆయుష్షునీ, శక్తినీ పెంపొందిస్తుంది.
- నిలుచుని తినేదీ, త్రాగేది గేదెలే.
- మెత్త మెత్తని ఆసనాలపై కూచుని భుజిస్తే వచ్చేవి మూత్రవ్యాధులే.



- అవకాశాన్ని బట్టి పొన్నగంటి కూర తప్పనిసరిగా తినటం వల్ల మసక కనుచూపు గలవారి చూపును కూడా యవ్వనవంతుల కనుచూపులా చెయ్యగలదని ఆయుర్వేద శాస్త్రం చెబుతుంది.
- చెప్పులు ధరించి ఆహారాన్ని స్వీకరించకూడదు.

## దేవాలయాల్లోకి వేరే దేశస్థులని రానివ్వకూడదని మన పూర్వీకులు ఎందుకు ఆచారం పెట్టారు?

మన దేవతా ప్రతిమలు ఎంతో సుందరంగా, సరళంగా, రమ్యంగా ఉంటాయి. భక్తి అనే భావమూ, భయము లేకుండా చూడటం తగదు. వేరే దేశస్థులకి మన దేవతల మీద భక్తి ఉండదు. వారు చూసే చూపుల్లో దోషముంటుంది. ఆ దోష రహిత కనులతో మన దేవతా విగ్రహాలను చూడకూడదనే మన పూర్వీకులు ఆ నియమం పెట్టారు.

## బందిపోట్లను కూడా అర్జునుడు ఎందుకు ఎదిరించలేకపోయాడు?

శ్రీకృష్ణ నిర్యాణం తర్వాత ఆయన అష్టభార్యలు అగ్నిప్రవేశం చేశారు. శ్రీకృష్ణుని మిగిలిన భార్యలను

అర్జునుడు భద్రంగా ఇంద్రప్రస్థానికి తీసుకు వెళుతుండగా బందిపోట్లు అడ్డగించి వార్ని అపహరిస్తారు. ఆ సమయంలో అర్జునుడి భుజశక్తీ, బాణశక్తీ పనిచేయలేదు. అర్జునుడి బలం శ్రీకృష్ణుడే. ఆయన లేని అర్జునుడు మామూలు రాజు. బందిపోట్లు అపహరించటానికి శాపకారణం ఉంది.

**గ్రహాలు ఒకదాని చుట్టూ వకటి ప్రదక్షిణంలా చెయ్యటం ద్వారా ఎలా సమస్థితిలో ఉండగలుగుతున్నాయో, మానవులు కూడా దేవాలయంలో ప్రదక్షిణలు చేయటం ద్వారా సుఖ స్థానంలో ఉంటారు.**

## పురుషుణ్ని స్త్రీ ఎంతవరకు భరిస్తుంది?

కొట్టినా, తిట్టినా, తిండి పెట్టకపోయినా తను సంపాదించి భర్తకీ, పిల్లలకీ పెడుతుంది. త్రాగుబోతయినా, తిరుగుబోతయినా భరిస్తుంది. కానీ తన శీలాన్ని శంకిస్తే భద్రకాళి అవుతుంది. ఆలోచించే ముందూ, మాట్లాడే ముందూ విచక్షణ కోల్పోతే జరిగే నష్టాన్ని తిరిగి పూడ్చుకోలేరు.



## శుక్లాంబరధరం పరమార్థమేమిటి?

32 అక్షరాలుగల ఈ శ్లోకము అన్ని శుభదైవ సందర్భాల్లోనూ వింటాము. దాని అర్థం, పరమార్థం.... తెల్లని దుస్తులను ధరించి అంతకు మించిన చంద్రుని వంటి కాంతి గలిగి, నాలుగు చేతులకలిగిన ప్రశాంతమైన నగుమోముతో సమస్త విశ్వాన్ని వ్యాపించి ఉన్న ఓ శ్రీమహావిష్ణుమూర్తీ.. నాకూ, నా వారికీ, లోకానికీ ఎల్లవేళలా శుభాన్ని కలిగించు అని.

## దేవునికి ప్రయోగించే గంటపైన హనుమ, గరుత్మంతులు ఎందుకు ఉంటారు?

భగవంతునికి ఎంత దగ్గరిగా ఉండాలో చెప్పే తత్వమది. దేవుణ్ని పూజిస్తే, భక్తిగా సేవిస్తే ఎంత ప్రీతిగా ఉండాలో, మరెంత దగ్గరిగా ఉండాలో తెలియ చెప్పటమే గంట మీద శంఖాలూ, చిహ్నాలు.

## కవచాన్ని పఠించడం వల్ల ఏ ఫలం వస్తుంది?

ఏ దేవతా, దేవీ కవచాన్ని మనం పఠిస్తామో, ఆ దేవతా అంశ మన చుట్టూ ఓ రక్షణ కవచంగా మారి,

మనల్ని దుష్టుల నుంచీ, పీడల నుంచీ సదా రక్షిస్తుంటుంది. అన్యమనస్కులైన సమయంలో ప్రశాంతంగా కవచాన్ని పఠించండి.

## ఏ తీర్థం ఏ ఫలాన్నిస్తుంది?

- సాలగ్రామ తీర్థము రోగనివారణ చేస్తుంది.
- తులసీ తీర్థము శరీరంలోని మలినాలను మాయం చేస్తుంది.
- పచ్చకర్పూరమూ, తులసీ తీర్థము మంగళకరము, ఆహ్లాదకరము.
- స్వామిని అభిషేకించిన తీర్థజలం పవిత్రం, పుణ్యం.
- ఏ తీర్థాన్నైనా కిందపడకుండా అంగవస్త్రాన్ని తీర్థం తీసుకొనే చేతిక్రింద పెట్టి ముమ్మారు తీసుకోవాలి.

**తల్లీ లేదా తండ్రీ చనిపోతే సంవత్సరం తర్వాతే కొడుక్కి వివాహం చెయ్యాలి. పుత్రికయితే అదే సంవత్సరం చేస్తే ఫలం చనిపోయిన వారికి అందుతుంది. సంవత్సరం దాటితే పది తరాల వరకూ కన్యాదాన ఫలం అందుతుంది.**



## ఎన్ని రకాల తీర్థాలున్నాయి?

ఉదకం ద్వారా, చందనం ద్వారా, చక్రం ద్వారా, శంఖము ద్వారా, ఘంట సూక్తం ద్వారా, తామ్రపాత్ర ద్వారా, అలాగే సాలగ్రామం ద్వారా, తీర్థం ఇన్నింటి ద్వారా స్వీకరిస్తాము.

**కొత్తగా పెళ్ళి అయిన వధూవరులు బంధువుల ఇంట్లో అశుభకార్యమొస్తే వెళ్ళకూడదు.**

## బావి నుంచి తెచ్చిన నీటితో అభిషేకం చెయ్యవచ్చా?

కుళాయి నుంచి గానీ, బావి నుంచి గానీ తెచ్చిన నీటితో స్వామికి అభిషేకం చేస్తే దోషం. నీటిలో అనేక దోషాలుంటాయి.

వాటిని పోగొట్టేందుకు మంత్రోచ్చాటన ఉంటుంది.

అది పూర్తయిన తర్వాత ఆ శుద్ధ జలంతో స్వామిని అభిషేకించాలి. అందుకే అభిషేకాదులు గృహస్థులు స్వయంగా నిర్వర్తించకూడదు. బ్రాహ్మణుల ఆధ్వర్యంలో చేయాలి.

## శివాలయంలో ఇచ్చిన తీర్థప్రసాదాలనీ, విభూదినీ ఇంటి వద్దకు ఎందుకు తేవద్దని అంటారు?

పరమశివుడు స్మశానవాసి. సన్యాసి.. అలాంటి ప్రదేశంలోనున్నాడు కాబట్టి కేవలం పూజించి, ధ్యానించి తీర్థప్రసాదాలను అక్కడే తీసుకొని వచ్చెయ్యమని పెద్దలు చెబుతారు. విభూది కూడా తీసుకెళ్ళకూడదు. ఆగమ శాస్త్రాల ప్రకారం ప్రసాదాన్ని తీసుకెళ్ళవచ్చు.

**'తు' అనగా మృత్యుదేవత, 'లసి' అంటే ఎదిరించేది. అందుకే తులసిని పూజించినా, తీసుకున్నా మృత్యువు ఎంతో దూరంగా ఉంటుంది.**

## ధర్మ, అధర్మాల వైపు మనిషి ఎప్పుడు పయనిస్తాడు?

నమ్మి మోసపోయినప్పుడు. అప్పుడే ధర్మం గూర్చి ఆలోచిస్తాడు. తెలుసుకోవటానికి ప్రయత్నిస్తాడు. లేదంటే



సంపూర్ణంగా రాక్షసుడిగా మారిపోతాడు. ఇంక అతన్ని బాగు చెయ్యటం సర్వేశ్వరుడి వల్లే అవుతుంది.

## ఆడపిల్లకి ఒడిబియ్యం పోస్తారెందుకు?

అత్తింట్లో ఎన్ని అదృష్టాలున్నా, భర్త ఎంత ప్రేమగా చూసుకున్నా పుట్టింటి మీద మమకారం ఆడపిల్లకి ఉంటుంది. ఆడపిల్ల చీరలూ, నగలూ, ధనమూ, దీవెనలూ, ప్రేమా కోరుకుంటుంది. అందుకే మంగళకరమైనవన్నీ ఇచ్చి పంపించడమే ఒడిబియ్యం పరమార్థము. ఒకరకంగా ఈ ఆచారం వల్ల పెళ్ళి చేసిన పిల్లను మర్చిపోకుండా నిర్లక్ష్యం చెయ్యకుండా అత్తింటినుంచి పుట్టింటికి తెచ్చి పిల్లకి ఆనందం కలుగ చేస్తారని ఈ ఆచారాన్ని పెద్దలు పెట్టారు.

**విష్ణువు ఆలయంలో 2,4,6,8,10 ఇలా సరి సంఖ్యలో ప్రదక్షిణలు చేయాలి.**

## దైవదర్శనము దొరకనప్పుడు ఏం చెయ్యాలి?

ఒక్కోసారి విపరీతమైన రద్దీ కారణంగానూ లేదా మనం వెళ్ళిన సమయంలో గుడి మూసి ఉండటం

గానీ జరుగుతుంది. అలాంటప్పుడు దైవస్మరణ చేసుకొని ఓ చిన్న మొక్కు మొక్కుకొని ఇంట్లో ముడుపు కట్టి దేవుడి దగ్గర పెట్టి మళ్లీ వెళ్లినప్పుడు సమర్పించాలి.

**ప్రతి రోజు ఒక కొబ్బరిబోండాం త్రాగితే పరిపూర్ణ ఫలం పొంద గలరు. కొబ్బరిబోండాం ద్వారా పరిపూర్ణ ఆరోగ్యవంతుడని ఆయుర్వేదం శెలవిస్తోంది.**

## నైవేద్యాలు ఎన్ని రకాలు?

మహానైవేద్యము, సాధారణ నైవేద్యము. అన్ని రకాల భక్షాలతోనూ, చేష్యలతోనూ, లేహ్యాలతోనూ చేసి పెట్టేది మహానైవేద్యం. పంచదార, బెల్లం, అరటిపండ్లు ఇత్యాదివన్నీ సాధారణ నైవేద్యాలు.

**ధ్వజస్థంభానికి వరిగడ్డి కట్టేది భూత దయకోసం. దేవాలయం మీద ఎగిరే పావురాలూ, పక్షులూ ఇత్యాది వాటి ఆహారం కోసం ధ్వజస్థంభానికి వరిగడ్డి కడతారు.**



## ఏ ఏ సమయాల్లో కాళ్ళు కడుక్కోకూడదు?

- శుభకార్యాలప్పుడు అనగా వివాహమూ, వ్రతాలూ, పూజలూ, యాగాలూ, అలాగే దేవాలయ దర్శనం తరువాత వెంటనే కాళ్ళు కడుక్కోకూడదు.
- ధర్మకార్యాలేవి చేసినా ఆ తర్వాత వెంటనే కాళ్ళు కడుక్కుంటే ఆ ఫలం పోతుందని ధర్మశాస్త్రాలు శెలవిస్తున్నాయి.
- నవగ్రహాది ప్రదక్షిణలు చేసినప్పుడు, ప్రదక్షిణలు పూర్తయిన వెంటనే బయటికి వచ్చి కాళ్ళను కడుక్కోవాలి. అలాగే జన్మదోషాలు పోవటానికి దానాలిచ్చిన వెంటనే కాళ్ళు తప్పని సరిగా కడుక్కోవాలి.

## మంగళసూత్రాల్ని తాళిబొట్టు అని కూడా ఎందుకంటారు?

పూర్వం మహిళలు తమ మంగళకరమైన మంగళసూత్రాలుగా తాళపత్రపు ఆకులను చుట్టి దానికి పసుపు దారాన్ని చుట్టి కుంకుమ రాసి మెడలో మాంగల్యంగా ధరించేవారు. అందుకే మంగళసూత్రాన్ని ఇప్పటికీ తాళిబొట్టు అని కూడా అంటారు.

**పూర్వాశ్రమంలో స్త్రీలకి మంగళ సూత్రాలుండేవికావు. ఇరువురికీ యజ్ఞోపవీతాలే ఉండేవి. స్త్రీ శరీర కారణం వల్ల యజ్ఞో పవీతాన్ని తీసి మంగళ సూత్రాల ఆచారాన్ని పెట్టారు మన పెద్దలు.**

## నిద్రపోయే ముందు ఎవర్ని ధ్యానించాలి?

అగస్త్యుణ్ణీ (జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం), మాధవుణ్ణీ, ముచుకుందుణ్ణీ, కపిలుణ్ణీ, ఆస్తీకుణ్ణీ స్మరించి ఆపై నిద్రకు ఉపక్రమించాలి.

## అష్టాదశ పురాణాలని ఎవరు బోధించారు?

బ్రహ్మదేవుడు బ్రహ్మపురాణం బోధించాడు. అలాగే పద్మపురాణమునూ బ్రహ్మ అందించాడు. అలాగే విష్ణు పురాణాన్ని పరాశరుడూ, శివపురాణాన్ని వామదేవుడూ, భాగవతాన్ని శుకుడూ, నారద పురాణాన్ని



నారద మహర్షీ, మార్కండేయ పురాణాన్ని మార్కండేయుడూ, అగ్ని పురాణాన్ని భృగుమహర్షీ, బ్రహ్మవైవర్త పురాణాన్ని వశిష్ఠుడూ, లింగ పురాణాన్ని నందీశ్వరుడూ, వరాహ పురాణాన్ని వరాహ మూర్తీ, స్కంద పురాణాన్ని కుమార స్వామీ, వామన పురాణాన్ని బ్రహ్మదేవుడూ, మత్స్యపురాణాన్ని శ్రీమహావిష్ణువూ, కూర్మ పురాణాన్ని కూర్మమూర్తీ, గరుడ పురాణాన్ని విష్ణువూ, బ్రహ్మాండ పురాణాన్నీ, భవిష్య పురాణాన్నీ బ్రహ్మదేవుడి ద్వారా బోధించారు.

**వ్యాపారి తన ధనంతో, మదంతో రాజు వద్దకెళ్ళి కార్యాన్ని సాధించు కుంటాడు. మేధావి బంట్రోతు ద్వారా అవే కార్యాల్ని సునాయాసంగా సాధిస్తాడు.**

## ఓడిపోవటానికి కారణాలు ఎవరికైనా మూడే?

నీకెంత విద్వత్ ఉన్నా, అంతకు మించి జ్ఞానమున్నా వెనకబడుతున్నావంటే మూడే మూడు కారణాలు. ఒకటి నీవు స్నేహితులు అనుకుంటున్న

వారు. రెండు స్త్రీ వ్యామోహము. మూడోది మత్తుతో కూడిన వ్యసనాలు.

## రావణ కాష్ఠంలా ఆ సమస్య కాలుతూనే ఉంటుందనేది?

ఆ కాష్ఠం నిరంతరమూ మండుతూనే ఉంటుంది. చిరంజీవి ఆంజనేయుడు ఇప్పటికీ ఆ కాష్ఠం ఆరిపోకుండా అందులో పుల్లలను వేస్తూనే ఉంటాడు. రావణాసురుడి చితిలా ఎన్నేళ్ళయినా ఆ సమస్య ఇంకా రగులుతుందనే ఉపమాలంకారం చేర్చి అంటారు.

## పెళ్ళికాని వారు హనుమంతుణ్ని తాకి నమస్కరించకూడదు.

## శ్రీకృష్ణుని అష్ట పట్టమహిషుల పేర్లు?

- రుక్మిణీ, సత్యభామా, జాంబవతీ, మిత్రవిందా, కాళింది, నాగ్నజితి, భద్ర, లక్షణ. ఇక ప్రియ నెచ్చెలి రాధ విషయానికొస్తే వృషభానుని పుత్రిక రాధ.

## దశరథ మహారాజుకు భార్యలు మూడువందలయాభైమంది.



## తేనెటీగలు తేనెపట్టుని ఏ దిక్కుపెడితే అనర్థము?

గృహానికి తూర్పు వైపుగానీ, ఈశాన్యం గానీ తేనెటీగలు తేనెపట్టు పెట్టడం శుభకరం. మిగిలిన దిక్కులు అశుభాన్ని కలిగిస్తాయి. తేనెటీగలు ప్రమాదకరమైనవీ, హానికరమైనవి. అలాగే గుడ్లగూబా, గ్రద్ధలూ ఇంట్లోకి వస్తే ఆ ఇంటిని కొన్ని రోజులు వదలాలని పెద్దలు చెప్పారు. పూర్వము చెప్పిన ఆ పద్ధతిని నేడు ఆచరించలేని పరిస్థితి. చెయ్యగలిగిందేమీ లేదు. పూజాదికాలు చేసుకొని పవిత్ర పసుపు 'పుండరీకాక్షాయ' అని అనుకుంటూ జలాన్ని నలువైపులా చల్లుకోవటమే.

## కాకి తలపై వ్రాలితే అశుభమా?

అలా కాకి వాలిన వారూ, కాకి కాలి గోళ్లు తగిలినవారూ, ముఖ్యంగా శిరస్సు మీద వాలిన వారూ, తప్పని సరిగా భగవత్ ఆలయానికి వెళ్ళి నూట ఎనిమిది సార్లు ధ్యానం తప్పని సరిగా చేయాలి. అలా జరిగినప్పుడు ఒక్కోసారి తలలో ఉండే సున్నితభాగం ఇబ్బంది పడే ప్రమాదం ఉంది. అందుకే ఎక్కువ సేపు దైవధ్యానం చేస్తే చాలు. కంగారుపడనవసరం లేదు.

## షోడశోపచార పూజని రోజూ చేయలేనివారు ఎలా చేసుకోవాలి?

షోడశోపచారాల్లోని ఓ అయిందింటిని అనగా గంధం వ్రాయటమూ, దేవునికి పుష్పాలను సమర్పించటమూ, దీపారాధన చెయ్యటమూ, ధూపాన్ని సమర్పించటమూ, ఆపై స్వామికి నైవేద్యం పెట్టడమూ చేసి పూజించుకోవాలి. ఇలా చెయ్యటం ద్వారా షోడశోపచార ఫలం దక్కుతుంది.

## షష్ఠిపూర్తిని అసలెందుకు జరుపుకుంటారు?

అరవైయేండ్లు నిండిన వారు జరుపుకోవాలని పెద్దలు సాంప్రదాయాన్ని పెట్టారు. ఆ సాంప్రదాయం వెనుక ఓ జ్యోతిష్యశాస్త్ర రహస్యం ఉంది. 'ఉగ్రరథ' అనే భయంకర దోషం అరవై నిండగానే మనిషిని ఆవహిస్తుంది. దాని వల్ల భయంకర శోకము. అందుకే షష్ఠిపూర్తి వేడుకల్లో భాగంగా 'ఉగ్రరథ' సంబంధిత కార్యక్రమాన్ని కూడా జరిపించుకుంటారు. అలాగే డెబ్భయి ఎనిమిది సంవత్సరాలు దాటినవారూ, ఇంకా ఎనభైనాలుగు దాటిన వారూ శాంతి కార్యక్రమాలను జరిపించుకుంటారు.



## మోసం చెయ్యటం ద్వారా ఎంత పాపం అందుతుంది?

ఎవ్వరైనా మోసపోయేది అవతలి వారిని నమ్మటం వల్లనే. ఆ నమ్మక ద్రోహం జరిగినప్పుడు ఇక ఎవ్వరినీ నమ్మడు. ఆదరించడు. ప్రతివారి చుట్టూ చాలామంది రకరకాలుగా ఆశ్రయం పొందుతుంటారు. ఒక వ్యక్తి చేసిన నమ్మకద్రోహానికి ఇక ఎవ్వరికీ సహాయపడడు. ఎవరినీ చూసి జాలిపడడు. తద్వారా అంతమంది ఉసురు తొలుత చేసిన నమ్మక ద్రోహికే తగులుతుంది. పాపమంతా వారికే అందుతుంది.

## నిండు నూరేళ్ళు నిండినవారు ఏ శాంతి చేయించుకోవాలి?

అరవై నిండగానే షష్ఠిపూర్తిలో ఉగ్రరథ శాంతీ, డెబ్భయి ఎనిమిదిలో భీమరథ శాంతీ, ఎనభై మూడు దాటిన తర్వాత విజయరథశాంతీ, నిండు నూరేళ్ళు నిండిన వారు పూర్ణశతాభిషేకం చేయించుకుంటారు.

## ఏ ఏ పురాణాల్లో ఎన్ని శ్లోకాలున్నాయి?

- బ్రహ్మ పురాణంలో పదివేల శ్లోకాలున్నాయి.
- పద్మపురాణంలో ఎనిమిది వేలశ్లోకాలున్నాయి.

- శివపురాణంలో ఇరవైనాలుగువేల శ్లోకాలున్నాయి.
- భాగవతంలో పద్దెనిమిదివేల శ్లోకాలున్నాయి.
- నారద పురాణంలో ఇరవై అయిదువేల శ్లోకాలున్నాయి.
- మార్కండేయ పురాణంలో తొమ్మిది వేల శ్లోకాలున్నాయి.
- అగ్ని పురాణంలో పదహారువేలశ్లోకాలున్నాయి.
- బ్రహ్మవైవర్త పురాణంలో పెద్దెనిమిది వేల శ్లోకాలున్నాయి.
- లింగపురాణంలో పదకొండువేలశ్లోకాలున్నాయి.
- వరాహపురాణంలో ఇరవైనాలుగువేల శ్లోకాలున్నాయి.
- స్కంధ పురాణంలో ఎనభైఒక్కవేల శ్లోకాలున్నాయి.
- వామన పురాణంలో పధ్నాలుగువేల శ్లోకాలున్నాయి.
- మత్స్య పురాణంలో పధ్నాలుగువేల శ్లోకాలున్నాయి.
- కూర్మ పురాణంలో పదిహేడువేలశ్లోకాలున్నాయి.
- గరుడ పురాణంలో పంతొమ్మిది వేల శ్లోకాలున్నాయి.
- బ్రహ్మాండ పురాణంలో పన్నెండువేల శ్లోకాలున్నాయి.
- భవిష్యపురాణంలో ఇరవైఏడువేల అయిదువందల శ్లోకాలున్నాయి.

వీటితో పాటు పద్దెనిమిది ఉపపురాణాలున్నాయి.



## కోరి వచ్చిన స్త్రీని కాదనవచ్చా?

ఏ వర్గంకి సంబంధించిన స్త్రీని కోరుకున్నా పాపం పాపమే. కానీ కోరి వచ్చిన స్త్రీని కాదంటే ఏ వర్గం వారికైనా పాపమే. ఎలాంటి ప్రలోభాలను చూపకుండా పరిపూర్ణమైన ఇష్టంతో వచ్చిన స్త్రీని కాదంటే ఖచ్చితంగా పాపమే. అలా కాదంటే దానికి అర్జునునిలా శాపము తప్పక ఉంటుంది.

**వ్యాసుడు చెబుతుంటే వినాయకుడు మహాభారతాన్ని రాస్తుండగా ఎనిమిది వేల ఎనిమిది వందల సందేహాలు కలిగి లేఖని ఆపి, అర్థం చేసుకొని ఆపై ముందుకు కదిలాడు వినాయకుడు.**

## దశమహావిద్యల్లో ఏ దేవతామూర్తులని ఉపాసించాలి?

మహంకాళీ, తారా, త్రిపురసుందరీ, భువనేశ్వరీ, త్రిపుర భైరవీ, ఛిన్నమస్త, ధూమవతీ, బగళాముఖీ, మాతంగీ, కమలాత్మికా... ఈ పది విద్యల్లోనూ

పరబ్రహ్మస్వరూపిణి ఉంది. ఉపాసనల ద్వారా, మంత్రములద్వారా, యంత్రముల ద్వారా ఉపాసించే మంత్రవిజ్ఞానము ఈ దశమహావిద్యల్లో ఉంది.

## మేక మాంసము తినటం దోష రహితమని పురాణాల్లో దేవతలు శెలవిస్తున్నారు.

## 'శ్రీరాఘవం...' అర్థపరమార్థమేంటి?

**శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం**
**సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం।**
**ఆజానుబాహుమరవింద దళాయతాక్షం**
**రామం నిశాచరవినాశకరం నమామి॥**

శ్రీమహాలక్ష్మీసమేతుడైన రాఘవునికి, దశరథ రాజపుత్రునికి, అప్రమేయునికి, సీతాపతికి, రఘువంశంలో జన్మించిన రత్నదీపానికి, ఆజాను బాహునికి, చక్కని పద్మదళముల వంటి కన్నులు కలవానికి, రాక్షసాధములను నాశనం చేయువాడు అయిన శ్రీరామచంద్రునికి నమామి. నమస్కరిస్తున్నాను అని భావము.



## మహాభారతంలోని నూరుగురు కౌరవుల పేర్లు?

1. దుర్యోధనుడు
2. దుశ్శాసనుడు
3. కుండశాయి
4. దుస్సహుడు
5. దుశ్శలుడు
6. జలసంధుడు
7. సముసహుడు
8. దుర్జయుడు
9. రౌద్రకర్ముడు
10. ఆశ్రయుడు
11. సుబాహుడు
12. దుష్ప్రధర్షణుడు
13. దుర్మర్షణుడు
14. దుర్ముఖుడు
15. దుష్కర్ణుడు
16. కర్ణుడు
17. వివింశతి
18. వికర్ణుడు
19. శలుడు
20. సత్వుడు
21. సులోచనుడు
22. చిత్రుడు
23. ఉపచిత్రుడు
24. చిత్రాక్షుడు
25. చారు చిత్రుడు
26. శరాసనుడు
27. దుర్మదుడు
28. దుర్విగాహుడు
29. వివిత్సుడు
30. వికటాసనుడు
31. ఊర్ణనాభుడు
32. సునాభుడు
33. నందుడు
34. ఉపనందకుడు
35. చిత్రబాహుడు
36. చిత్రవర్మ
37. సువర్మ
38. దుర్విరోచనుడు

39. అయోబాహుడు 40. మహాబాహుడు
41. చిత్రాంగుడు 42. కుండలుడు
43. భీమవేగుడు 44. భీమబలుడు
45. బలాకి 46. బలవర్ధనుడు
47. ఉగ్రాయుధుడు 48. సుషేణుడు
49. కుండోధరుడు 50. మహోదరుడు
51. చిత్రాయుధుడు 52. నిషంగి
53. పాశి 54. బృందారకుడు
55. దృఢవర్ముడు 56. దృఢక్షత్రుడు
57. సోమకీర్తి 58. అనూదరుడు
59. దృఢసంధుడు 60. జరాసంధుడు
61. విందుడు 62. సువాక్కు
63. ఉగ్రశ్రవుడు 64. ఉగ్రసేనుడు
65. సేనానీ 66. దుష్పరాజయుడు
67. అపరాజితుడు 68. పండితుడు
69. విశాలాక్షుడు 70. దురాధరుడు
71. దృఢహస్తుడు 72. సుహస్తుడు
73. వాతవేగుడు 74. సువర్చుడు
75. ఆదిత్య కేతువు 76. బహ్వాశీ
77. నాగదత్తుడు 78. అగ్రయాయి
79. కవచి 80. క్రథనుడు
81. కుండుడు 82. దండధారుడు



83. ధనుర్గ్రహుడు 84. ఉగ్రరథుడు
85. భీమరథుడు 86. వీరబాహువు
87. అభయుడు 88. దృఢరథుడు
89. అనాధృష్యుడు 90. కుండభేది
91. విరావి 92. ప్రమథుడు
93. ప్రమాధి 94. దీర్ఘరోముడు
95. దీర్ఘబాహువు 96. వ్యూఢోరుడు
97. కనకధ్వజుడు 98. కుండజుడు
99. విరజసడు 100. సత్యసంధుడు

దుస్సల

**ఆవు మూపురంలో బంగారు నాడి ఉంటుంది. అందువల్ల ఆవుపాలలో సహజంగానే స్వర్ణతత్వము ఉంటుంది. ఆ తత్వమే మానవులకి అమృతమంత శక్తి.**

## ఎవరిని ఏ రకంగా పూజించకూడదు?

శ్రీమహావిష్ణువుని అక్షింతలతో పూజింపకూడదు. తులసిని గుణవతి పూజలోనూ, భైరవుణ్ని మల్లెపూలతోనూ, శివుణ్ని మొగలిపువ్వులతోనూ,

తుమ్మిపూవులతో శ్రీమహాలక్ష్మీదేవినీ పూజింపకూడదు. ఇక సూర్యభగవానుణ్ని మారేడు ఆకులతో పూజింపకూడదు.

## మీరు ఖచ్చితమైన శాకాహారులా? అయితే ఇప్పటి ఐసుక్రీములో ఏం ఉపయోగిస్తున్నారు?

హిమక్రీము అని సగం తెలుగూ, సగం ఇంగ్లీషులో పిలిచే ఐస్‌క్రీమని నోట్లో వేసుకోగానే కరిగిపోయే గుణం కోసము ఎద్దూ, గొర్రెలూ, ఆవులకీ సంబంధించిన అనేక అవయవాల క్రొవ్వు నుంచి తీసే పదార్థాన్ని కలుపుతారు.

మీరు తినే ఐస్‌క్రీముమీద వెజిటేరియన్ గుర్తు చూసి మరీ తినండి.

## ఏ ఆవు పాలు ఎంత శ్రేష్ఠము?

భూలోక దేవతైన తెల్ల గోమాత పాలల్లో వాతాన్ని తగ్గించే గుణమూ, నల్ల ఆవుపాలల్లో పిత్తాన్ని తగ్గించే గుణమూ, ఎర్ర ఆవుపాలల్లో కఫాన్ని తగ్గించే గుణమూ ఉన్నాయి.

ఆవుపాలు సర్వరోగ నివారణతో పాటు యవ్వనాన్ని ఎక్కువకాలం స్థిరంగా ఉంచుతుంది.



## కుబేరుడిని అంతటి ధనవంతుణ్ని చేసిందెవరు?

శ్రీమహాలక్ష్మీదేవి. ఉత్తర దిక్కుకి అధిపతీ, యక్షులకి నాయకుడూ, అపార ధనరాశిగల కుబేరుని తపోనిష్ఠకి మెచ్చి మహానుగ్రహంగా అన్ని సంపదలనీ ఇచ్చింది.

## సూర్యుని సహజరంగులు ఏ ఋతువులో ఏముంటాయి?

శిశిర ఋతువులో కపిల వర్ణమూ, వసంతములో కుంకుమవర్ణమూ, గ్రీష్మంలో బంగారు రంగూ, వర్షఋతువులో తెలుపూ, శరత్‌ఋతువులో కమల వర్ణమూ, హేమంతములో రక్తవర్ణము. బృహత్సంహిత ప్రకారం.

## బృహత్సంహితలో ఏ నక్షత్రం వారికి ఎలాంటి లక్షణాలుంటాయని శెలవిచ్చారు?

1. అశ్విని — చక్కని రూపం, దక్షతకలిగినవారు, నీతివంతులు, ప్రియభాషణులు.

2. భరణి దృఢ నిశ్చయులు, సుఖవంతులు, సత్యమయులు, ఆరోగ్యవంతులు.
3. కృత్తిక తేజస్సు, ప్రఖ్యాతులు, తేజస్వులు.
4. రోహిణి సత్యవంతులు, శుభ్రత, ప్రియంవద, స్థిరమతి, సురూప.
5. మృగశిర చపలులు, చతురులు, ఉత్సాహ వంతులు, భోగులు, భీకరులు.
6. ఆర్ద్ర గర్వితులు, కృతఘ్నులు, అయినవార్ని ప్రేమించేవారు.
7. పునర్వసు సుశీలులు, అల్పసంతుష్టులు, రోగులు.
8. పుష్య శాంతస్వభావులు, పండితులు, ధర్మభూషణులు
9. ఆశ్లేష సర్వభక్షకులు, కృతఘ్నులు, అమాయకులు, సున్నితత్వం కలవారు.
10. మఘ భోగులు, ధనవంతులు, పితృభక్తులు, మహోద్యమకారులు.
11. పూ.షా ప్రియవచనములు పలుకువారు, దాతలు, ద్యుతిమానులు, నృపసేవకులు.
12. ఉ.షా భోగులు, సుఖములు కలవారు, విద్యాప్రాప్తి కలవారు.
13. హస్త ఉత్సాహవంతులు, తస్కరులు, అఘ్రుణీలు.



14. చిత్ర సులోచనాంగులు, నెరజాణలు.
15. స్వాతి కృపాళులు, ప్రియవాక్కు కలవారు, ధర్మాశ్రితులు.
16. విశాఖ ఈర్ష్య బుద్ధి కలవారు, ద్యుతులు, మాన్యవచనులు.
17. అనూరాధ విదేశీయానం కలవారు, ధర్మాత్ములు
18. జ్యేష్ఠ పలువురు మిత్రులు కలవారు, సంతృప్తి కలవారు, కోపితులు.
19. మూల లక్ష్మీపుత్రులు, సుఖపడువారు, స్థిరమనసు కలవారు.
20. పూ.ఆ సౌహార్ద్ర హృదయము కలవారు, ఇష్టముపూర్వకంగా పనిచేయువారు, కళలను ఇష్టపడువారు.
21. ఉ.ఆ ధార్మికులు, బహుమిత్రులు కలవారు, కృతజ్ఞత కలిగినవారు.
22. శ్రవణ ఉదార స్వభావులు, ఖ్యాతిపొందెదువారు, ధనవంతులు.
23. ధనిష్ఠ దాతలు, ధనలబ్ధము కలిగినవారు, సంగీతప్రియులు.
24. శతభిష సాహసికులు, కోపముకలవారు, వ్యసనపరులు.
25. పూ.భా సంతోషమును తృప్తిగా అనుభవించలేనివారు, ధనవంతులు, దాతలు.

26. ఉ.భా ఎక్కువ సంతానము కలవారు, ధార్మికులు, జితశత్రులు, వక్తలు.

27. రేవతి శూరులు, శుచివంతులు, సుభగులు, సంపూర్ణాంగులు.

## వ్రత సమయాల్లో హవిస్సునెందుకు భుజించమంటారు?

బియ్యంతోనూ, పెసరపప్పుతోనూ వండే భోజనమే హవిస్సు.

పులుపూ, కారమూ, తీపిలేని ఆ హవిస్సును తీసుకోవటం వల్ల పూజాదికాల సమయంలోనైనా మన కోపతాపాలను నిగ్రహించు కోవాలని అందుకు తప్పక దాన్నే తీసుకోవాలని శాస్త్రం కూడా శెలవిస్తోంది.

## మీ ధనం కోసం కూడా ఈ అబద్ధాలను చెప్పకూడదా?

మీకు రావాల్సిన ధనమైనా సరే వారి వద్ద తీసుకోవటానికి పిల్లలకి ఆరోగ్యం సరిగాలేదనీ, భార్యకి అనారోగ్యమనీ, ఇంటికి కావలసిన వంటసామగ్రిని కొనుక్కోవాలనీ, తీర్థయాత్రల కనీ, అనుకోని సమస్యలు వచ్చాయనీ చెప్పి మీ ధనం మీరే తీసుకోవటం



వల్ల ఒక్కోసారి అబద్ధం నిజమయ్యే ప్రమాదం ఉంది. ఒక్కో ముహూర్తంలో అన్నమాట ఫలిస్తుంది.

## ఏనుగు కుంభస్థలం కొట్టాలంటే?

అస్సలు తొట్రుపడకూడదు. ఆందోళన దరిచేరనీయకూడదు. ఒకటికి రెండుసార్లు సరిచూసుకోవాలి. సర్వేంద్రియాలూ సిద్ధంగా ఉంచుకోవాలి. మౌనంగా ఉండాలి. శక్తిని ఏకస్థానంలోకి తెచ్చుకోవాలి. చేతుల్లో శక్తీ, కళ్ళల్లో తీక్షణత, మనస్సులో సంకల్పం ఏకకాలంలో ఉపయోగించి కొడితే కుంభస్థలం పగలాలి, విజయలక్ష్మి వరించాలి.

## దగ్గూ, జలుబూ వచ్చినప్పుడు అలా వచ్చిన నోటిజలాన్ని ఉంచుకుని ఏ పనులు చేయకూడదు?

అలా చేస్తే శ్వాసలు ఎక్కువవుతాయి. అలా శ్వాసలు ఎక్కువయితే శరీరంలోని అవయవాలు అవస్థలు పడతాయి. అలా నోట్లోనే ఉంచుకొని చదవటమూ, ఆలోచించటమూ, సైగలు చెయ్యటమూ, దేవతా సంబంధిత వ్యవహారాలు అస్సలు చెయ్యకూడదు.

## పూర్వపు చన్నీటి స్నానము శుభకరం, మరి నేడు?

సకల కార్యాలనూ చన్నీటి స్నానము చేసి ప్రారంభించాలని, దానిని నియమంగా విధించారు మన పూర్వీకులు. అలా చెయ్యటం వల్ల శరీరం శుచిగా, ఆహ్లాదంగా ఉంటుందనీ, మనసు తేలికపడుతుందనీ చెప్పారు. అందులో ఎంతో సత్యముంది. ఆ రోజుల్లో వారు స్నానాన్ని బావీ, నదీ, లేదా సముద్రం వద్ద చేసేవారు. నిలువ ఉంచిన చన్నీరును వాడేవారు కాదు. బావి, చెరువు, నదులలోని నీటిలో ఔషధ గుణాలు ఉంటాయి.

ఆ నీటితో చేసేదే అసలు సిసలు చన్నీటి స్నానం. అయితే నేడు మూత పెట్టి బంధించిన నీటిలో బ్యాక్టీరియా ఎంతో కొంత చేరి ఉంటుంది. వాటిని వాడటం శ్రేయస్కరం కాదు. కాన కొద్దిగా గోరువెచ్చగా వేడిచేసుకొని వాడటమే ఉత్తమము.

**ఉప్పుకు బదులుగా సైంధవ లవణాన్ని వాడటం వల్ల హృదయకవాటాల్లో రక్తం గడ్డకట్టే ప్రమాదాన్ని నివారించ వచ్చు.**



## నెత్తిన పాలు పోసినట్టే అని అంటారెందుకు?

ఆ పనిచేస్తే నా నెత్తిన పాలు పోసినట్టే అంటారు. పూజాదికాలప్పుడు పాలూ, నెయ్యీ, పెరుగూ, తేనెలతో భగవంతునికి అభిషేకం చేసి సంతృప్తుణ్ని చేస్తాము. అనగా మంచి చేశామని. ఆ అర్థంతోనే నువ్వా పని చెయ్యటం వలన నాకేమీ ఇబ్బంది కలుగకుండా ఉంటుందని భావం. అలాగే కొన్నిసార్లు, నెత్తిమీద నిప్పులు పోశాడంటారు. అవతలవాళ్ళు చేసిన ఆ పని వల్ల ఏం చెయ్యాలో పాలుపోవటం లేదని చెప్పటము.

## నమ్మి నానపోస్తే పుచ్చిపోయాయని ఎందుకంటారు?

సంక్రాంతి అరిశెల కారణంగా వచ్చిన ఊతపదం. మరలూ, మిషన్లూ లేని రోజుల్లో బియ్యం కొట్టడానికి ఆడమనిషిని కుదుర్చుకునేవారు. ఇదిగో వస్తాను.. అదిగో వస్తానని రాకపోవటం వల్ల నానపెట్టిన బియ్యం మొత్తం పాడయి పోవటంతో, నమ్మి నానపోస్తే పుచ్చిపోయాయనే ఊతపదం వాడుకలోకి వచ్చింది. ఆ పదమే అనేక విషయాలకి ఉపయోగించటం పరిపాటయింది.

## భార్యకి వంటగదిలో సాయం చెయ్యటం కంటికి ఎంత మంచిది?

ఆడవాళ్ళతో పోల్చుకుంటే, కంటికి సంబంధించిన అనేక సమస్యలు మగవాళ్ళకెక్కువ. దానికి కారణం ఏడ్చే మగాణ్ని నమ్మకూడదనటం కావచ్చు లేదా తట్టుకునే శరీర స్వభావం కావచ్చు మగవారు కన్నీరు కార్చటము అరుదు.

అదే ఆడవాళ్ళయితే చీటికీ, మాటికీ కొంగు అద్దుతుంటారు. అలా కన్నీరు పెట్టడం వల్ల కనులలో మలినాలన్నీ బైటికొచ్చి చూపు శక్తి ఎక్కువవుతుంది. దానికి తోడు వాళ్ళు ఉల్లిపాయలు కోస్తూ కూడా కళ్ళల్లో నీళ్ళు తిరిగి కన్నీరు కారుస్తారు.

అందుకే వాళ్ళలా మంచి కంటిచూపు కోసం కనీసం భార్యకి సాయం పేరుతో ఉల్లిపాయలనైనా మగవారు తరగటం వల్ల కంటిచూపు మరింత మెరుగవుతుందని ఆయుర్వేద శాస్త్రం శెలవిస్తోంది.

## జీవితంలో ఒక్కసారన్నా చెయ్యాల్సిన స్నానము?

మహాశివునికి మాఘమాసం ప్రీతికరం. ఆ నెలలో మాఘస్నాన వ్రతం చెయ్యని జన్మ వృధా. ఈ స్నానఫలం



విష్ణులోకప్రాప్తి కూడా. సూర్యభగవానుడు మకరంలో ఉదయించిన వేళ స్నానమాచరించిన తెలిసి చేసిన తప్పులూ, తెలియక చేసిన తప్పులూ అగ్నిపై వేసిన నెయ్యిలా పుణ్యప్రదాలవుతాయి.

ఈ మాఘ మాస స్నాన ఫలం గూర్చి బ్రహ్మ నారదునితో చెప్పాడు.

## వీరినందరినీ తిరిగి చేర్చుకోకూడదు?

వదిలేసి మళ్ళీ వచ్చిన భార్యనూ, తనతో పేచీ పడి వెళ్ళిపోయి అవసరార్థం తిరిగి వచ్చి వేడుకున్నవాణ్నీ, మాటా మాటా వచ్చి విడిపోయిన స్నేహితుణ్నీ, పని మానేసి వెళ్ళిన సేవకుణ్నీ, అత్తింటిలో గొడవపడి వచ్చిన బిడ్డనూ, ఓసారి ధనాన్ని ఎగ్గొట్టిన వానినీ, చట్ట వ్యతిరేక వ్యాపారం చేస్తున్న వానినీ(తొలిసారి కూడా) దగ్గరికి చేర్చుకోకూడదు.

## వీరినస్సలు నమ్మవద్దు?

ప్రతిసారీ ధర్మాధర్మాల గూర్చి చెప్పేవాణ్నీ, తాను ఆచరింపక నీతులు చెప్పే వాణ్నీ, వయసులో మీకన్నా ఒక్కరోజు పెద్దయినవార్నీ (వ్యాపార, వ్యవహారపరంగా), అలాగే ధనవిషయంలోనూ, రహస్యమైన విషయాల్లోనూ ఎవ్వరినీ నమ్మకూడదని పురాణ సారాంశము.

## వీళ్ళతో అస్సలు గొడవలకి దిగకూడదు?

సంతానానికి విద్య నేర్పిస్తున్న గురువులతోనూ, పూజారులతోనూ, పూజాదికాలు నిర్వహించే బ్రాహ్మణులతోనూ, ఆడపడుచూ, సోదరులతోనూ, ప్రభుత్వ అధికారులతోనూ, ఇంటి కిరువైపుల వారితోనూ, తల్లీ, తండ్రీ, అత్తా మామలతో పాటు బావమరుదులతోనూ, ముఖ్యస్నేహితులతోనూ గొడవలకి దిగకూడదు. గొడవపడేలా ప్రవర్తించకూడదు.

## భారతయుద్ధం పూర్తయ్యాక ధర్మరాజు ముప్పయి ఆరు సంవత్సరాలు రాజ్య పాలన చేశాడు.

## గార్భిక దోషము స్త్రీకి ఎలా పోతుంది?

గర్భం ధరించిన స్త్రీలోని శిశువు మలమూత్రాల మధ్యనున్న దోషముంటుంది. అలా ఉంటే తల్లికి గార్భిక దోషము కలుగుతుంది.

అందుకే ఏడో నెలలో తల్లి కడుపులోని బిడ్డకి గ్రహణ శక్తి రాగానే ఆ దోష పరిహారార్థం కూడా సీమంతము చేస్తారు.



## బ్రహ్మదేవుడు తన కుమారునికి శ్రీరాముని దివ్య చరితాన్ని తొలుత చెప్పాడు.

## ఎప్పటికయినా తీర్చుకోక తప్పదా?

పిల్లలు... వీరి నుంచి గతజన్మలో ఋణం తీసుకొని తీర్చే ఆయుష్షు లేకపోవటంతో, ఆ జన్మలో ఋణాన్ని సకల వడ్డీలతో ఈ జన్మలో తీరుస్తున్నారు. అలాంటి పిల్లల చదువులకి స్తోమత లేకపోయినా, సరిగా చదవకపోయినా ఇంకా ఇంకా ఖర్చు చేసి ఋణాన్ని తీర్చుకుంటారు ఆ జన్మలో ఋణపడ్డ ఋణగ్రస్థులైన తల్లీ, తండ్రీ.

తల్లీ, తండ్రి... కావాలని అప్పు ఎగవేయటం వల్ల తల్లీ, తండ్రీ జన్మిస్తారు. పిల్లల మీద ప్రేమాదికాలు పెంచుకుంటారు. కానీ ఆ పుత్రుడూ, పుత్రికా ఏదో ఒక కారణంతో నట్టేట ముంచుతారు. అనగా గత జన్మలో నమ్మకంగా తీసుకొని ఎగ్గొట్టినందుకు మీకు పుట్టిన మేమూ అలాగే నమ్మకంగా మోసం చేశానని తెలియక తెలియచెబుతారు.

భార్య... గత జన్మలో అన్ని రకాల సేవలను చేయించుకొని, ఏ మాత్రం పట్టించుకోకుండా వారి

ఖర్మకు వారినొదిలేసినవారు భార్యగా పుట్టి, ధనాన్నీ, రక్షణనూ, అధికారాన్నీ తీసుకొని తన గత జన్మ లక్షణాల ప్రకారం సేవ చేస్తుంది.

పశువులు ... తిండి మాత్రమే పెట్టి పనిచేయించుకున్నవారూ, పక్కవారి తెలివితేటల్ని తమవిగా ఉపయోగించి వార్ని గాలికి వదిలేసినవారూ, చేసిన శ్రమకు తగిన విలువను చెల్లించకుండా ఉన్నవారూ, పైశాచికత్వంతో పలువుర్ని బాధించినవారూ పశువులుగా పుట్టి అందరి ఋణం తీర్చుకుంటారు.

**దేవాలయంలో చేసేది దైవప్రదక్షిణము. తల్లీ, తండ్రీ, ఆవూ... వీటి చుట్టూ చేసేది భూమిప్రదక్షిణము. సూర్యుని స్మరిస్తూ ఎదురుగా ఉండి ప్రదక్షిణం చేస్తే సూర్యప్రదక్షిణం.**

## పరిపూర్ణ విద్యావంతుడు అవ్వాలంటే?

గురువు నుంచి కొంత భాగం విద్యనూ, తనకి తానుగా కొంత విద్యాజ్ఞానాన్నీ, తోటివారి నుంచి మరికొంతా, పూర్తి జ్ఞానం సమాజం నుంచి నేర్చుకొని పరిపూర్ణ విద్యావంతుడవ్వాలి.



## ఆకలీ, అవసరం ఎంత గొప్పవి?

అసత్యాలని చెప్పిస్తుంది. అయిన వార్ని మోసం చేయిస్తుంది. స్త్రీని తప్పు చేయించేలా చేస్తుంది. మానాభిమానాలను మరిపిస్తుంది. విద్యలోనూ, గుణంలోనూ, ఎందులోనూ ఎక్కువగాని వారి ముందు చేతులను కట్టుకునేలా చేస్తుంది. అన్నింటికీ మించి దొంగతనము చేయిస్తుంది. ఆ రెండు అవసరాల గూర్చి మనిషి దేనికైనా సిద్ధపడేలా చేస్తుంది. అందుకే ఆకలిని తగ్గించుకోవాలి. మితంగా భుజించాలి. ఐహికమైన వాటి గూర్చి ఆలోచించకుండా ఉన్న దాంతో సరిపెట్టుకుంటే పై స్థితులు రావు.

**చాతుర్మాస్య దీక్షలు వర్షాకాలము నాలుగు నెలలు సన్యాసులు చేస్తారు.**

## డప్పెందుకు మ్రోగిస్తారు?

పూర్వము మహా భయంకర అంటువ్యాధులు ఉండేవి. అవి సోకకుండా ఎంతో జాగ్రత్తగా ఉండాలని ఎన్నో విధాలుగా ప్రయత్నించేవారు. ఎక్కువగా జనాలు కూడినప్పుడు, వారి వారి శరీరాల నుంచి విషగాలులు ఒకరికొకరికి వ్యాపించకుండా, డప్పులపై అనేక పసర్లు పూసి మ్రోగించి డప్పు శబ్దాలకీ, ఆవాసనలకీ విష

క్రిములు దూరంగా వెళ్ళేటట్టూ, అంతరించేటట్టూ చేసేందుకు దప్పులను ఉపయోగించేవారు.

## ఇవి దూరమైనప్పుడే వాటి విలువ తెలుస్తుంది?

వయసులో, వృద్ధాప్యంలో, మధ్య జీవితంలో భార్య లేనప్పుడూ, హితం కోరే స్నేహితుడు దూరమైనప్పుడూ, మంచీచెడూ చెప్పే గురువు అనే పెద్దలు దూరంగా ఉన్నప్పుడూ, తనకున్న ధనాన్ని దుర్వినియోగము చేసి దూరం చేసుకున్నప్పుడూ, నమ్మకమైన సేవకుడు వదిలేసినప్పుడూ... అప్పుడు వారి వారి విలువ తెలుస్తుంది. అయితే అప్పటికే సమయం మించిపోయి ఉంటుంది.

## వివాహమయ్యాక వధూవరుల చేత ఇరువురి పేర్లు చెప్పించేదెందుకు?

నూతన దంపతులు ఇంటిలోపలికి రాకుండా, ఇరువురూ ఒకరి పేరు మరొకరు చెప్పమనేది సరదా అల్లరే. అయినా ఇందులో ఈ పద్ధతిలో భార్యాభర్తలు మరింత చేరువవ్వటానికి ఒకరి మీద మరొకరికి ఇష్టం ఎంతున్నది అన్నది వారు చెప్పే పద్ధతిని బట్టి పెద్దలు అవగాహన చేసుకొనటానికి పెట్టింది. వివాహంలో



ఇరువైపులా ఏ విమర్శలు జరిగినా, అవేమీ మాకు పట్టలేదు అని ఇరువురూ తెలియచెప్పటమే ఆ తంతు.

## 'భార్య' అంటే భరించేది మాత్రమే కాదు?

'భా' అంటే భరించటమొక్కటే కాదు, ప్రకాశించునదీ అని భావముంది. పరిపూర్ణ జ్ఞానం కలదీ, సమస్త సహాయాలను అందిచ్చునదీ, ఆహారాన్ని సమకూర్చేదీ, అధికారాన్ని చెలాయించేదీ, సకల సుఖాలను ఇచ్చేదీ, అన్ని విషయాలను అనుభవ, ఆలోచనల ద్వారా ఇచ్చేదీ భార్య. అట్టి జగత్కారకమైన శక్తీ, పరమాత్మలే స్త్రీ పురుషులు.

**పురుషుడు తనకొచ్చే భార్య సీతాదేవి లక్షణాలతో ఉండాలని కోరుకుంటాడు గానీ తాను శ్రీరాముడిలా ఉండాలని అనుకోడు.**

## మహాశివుడు తన సతికి అర్ధశరీరం ఎప్పుడిచ్చాడు?

పుణ్య దంపతులైన పార్వతీపరమేశ్వరులు సకలశాస్త్రాలు నేర్చుకునేలా ఆనందతాండవము చేస్తూ

ఒకరిలో మరొకరు సంపూర్ణంగా లీనమైనప్పుడు పరమేశ్వరుడు భార్యకి అర్ధశరీరం ఇచ్చి అర్ధనారీశ్వరుడయ్యాడు.

## రాత్రిపూట భోజనం చేసేటప్పుడు దీపాలారిపోతే ఎందుకు భోజనం చెయ్యొద్దన్నారు?

అలాంటిది జరిగితే అన్నమును భుజించకుండా, లేచి సూర్య, చంద్రులను ప్రార్థించి పళ్ళో, పాలో తీసుకోమన్నారు పెద్దలు. అలా వారు చెప్పిన దాంట్లో ఎంతో గూఢార్థం ఉంది. ఒక్కసారిగా వెలుగు పోయినప్పుడు మనం కొంత ఆందోళనకు గురవుతాము. అలాంటిది చుట్టూ ఉన్న అనేక జీవుల సంగతి? అలా అదిరినవీ, బెదిరినవీ రాలి పడతాయి. కనిపించేవి కొన్నీ, కనిపించనివి కొన్ని. ఆహారంలో ఆ క్రిములు ఎక్కువగా పడే అవకాశము ఉంది. అందుకే ఆ ఆహారాన్ని వదలి, అగ్నిదేవుడికి నైవేద్యంగా పండూ, కాయనూ తినమన్నారు.

## వీళ్ళను కావాలనుకోవటం కేవలం ఆశేనా?

శ్రీరాముడు వంటి పుత్రుడూ, సీత వంటి భార్యా, భరతలక్ష్మణశతృఘ్నుల వంటి తమ్ములూ.



## గృహస్థ ధర్మములంటే?

నోటికి రుచికరమైన ఆహారాలను తీసుకునేవాడూ, కనులకి అందమైన దృశ్యాలను చూపించేవాడూ, మనసుకి హాయి కలిగించే కార్యాలు చేసేవాడూ, చెవులకి ఇంపైన విషయాలను వినిపించేవాడూ, నాలుకతో మంచి విషయాలను మాత్రమే పలికేవాడూ, చేతులతో చేతనైనంత సాయాన్ని పలువురికీ అందించేవాడు అవే గృహస్థ ధర్మాలు.

**స్త్రీ తన కొచ్చే భర్త శ్రీరాముడి లక్షణాలతో ఉండాలని భావిస్తుంది గాని తను మాత్రం సత్యభామ లక్షణాలతో ఉండాలనుకుంటుంది.**

## ఆవేశంలో కూడా అనరానిమాటలని ఎవరిగూర్చి అనకూడదు?

కట్టుకున్న భార్యని ఎంత ఆవేశంలో కూడా కులటా అనీ, తల్లీ, తండ్రినీ ఎదిరించటం గానీ, భోజనం చేస్తున్న వారిని తిట్టడము కానీ, ధర్మకార్యాలను చేస్తున్న వార్ని విమర్శించటం కానీ, వారితో పాటు ఎదిగిన

పుత్రుడ్నీ, పుత్రికనూ కూడా ఎంతటి తీవ్ర కోపంలో కూడా అనరాని మాటలు అనకూడదు. అనార్థాలే జరుగుతాయి.

**అగ్నిసాక్షిగా వివాహం చేసుకునేది భార్యను. మనస్సాక్షి అనగా అగ్ని అనే సాక్షిగా చేసుకునేది మిత్రుడ్ని. భార్యకూ, మిత్రుడికీ ద్రోహం చేస్తే భగవంతుని దృష్టిలో కూడా ద్రోహుడవుతాడు.**

## ముప్పయి రెండు కళలు ఇవే?

సంగీత పరిజ్ఞానమూ, వీణలో ప్రావీణ్యమూ, నాట్యంలో సిద్ధహస్తులూ, చిత్రలేఖనమూ, చక్కటి తిలకములు పెట్టే సమర్థతా, రకరకాల ధాన్యాలతో చిత్రాలు చిత్రించటమూ, పుష్పాలతో అలంకార వస్తువులతో శయ్యలను సుందరంగా తీర్చిదిద్దటమూ, దుస్తులపై, శరీరంపై చక్కటి చిత్రాలు గీయటమూ, అనేక కట్టడముల కట్టడంలో చాతుర్యమూ, నీటితో సుందర ధ్వనులను సృష్టించటమూ, వివిధ జలక్రీడల్లో ప్రావీణ్యమూ, శిరోజాలను అందంగా చేయటమూ,



చక్కని పూలమాలికలను కట్టగలగటమూ, అనేక ప్రాంతాల అలంకరణలలో నిష్ణాతులవటమూ, శంఖములతోనూ, గవ్వలతోనూ అలంకరణ సామాగ్రి తయారు చెయ్యటమూ, సుగంధ ధూపాలను తెప్పించే వాటిని చెయ్యటమూ, బంగారు ఆభరణాలను తయారు చెయ్యటమూ, రచించటమూ, శిల్పాలను చెక్కటమూ, నదులలో ఈదటమూ, పిల్లల్ని ఆడించటమూ, ఉన్నది లేనట్టూ లేనిది ఉన్నట్టూ చూపడమూ, శరీర శాస్త్రమూ, ఏ పనైనా అందరికన్నా ముందే చెయ్యగలగటమూ, రుచికరమైన ఆహారపదార్థాల్ని వండటమూ, పొయ్యి లేకుండా తయారు చేసే పానీయాల ప్రావీణ్యమూ, ధమరుకాది విద్యల్లో ప్రావీణ్యమూ, నర్మగర్భంగా మాట్లడటమూ, చెప్పిన శ్లోకాక్షరంతో మరో శ్లోకం చెప్పగలగటమూ, శబ్దాలని బట్టి అవేమిటో చెప్పగలగటమూ, వినసొంపుగా చదవటమూ, నటించటమూ... ఇవే చతుష్షష్టి కళలు.

## యజ్ఞంలా పని చెయ్యటమంటే?

వేదమంత్రోచ్చాటనలా కార్యంపై శ్రద్ధ ఉండాలి. యజ్ఞదర్భల్లా కరుకుగా ఉండాలి. యజ్ఞకుండంలా స్థిరంగా ఉండాలి. అగ్నిలో నెయ్యి పోస్తే వచ్చిన హోమాగ్ని జ్వాలలా కదలాలి. అప్పుడే దివ్యపాత్ర అందుతుంది.

**విజయాన్ని కోరేవారూ, కార్యాన్ని సాధిద్దామనుకునే వారూ, దక్షిణ దిశగా ప్రయాణించాలి.**

## స్వీకరించటానికీ, సమర్పించటానికీ తేడా?

పుణ్యాతి విషయాలకోసమూ, తన అవసరార్థం భేషజాలతో ఇచ్చినది తీసుకునేదీ స్వీకరించటము. ప్రతిఫలం ఆశించకుండా, ధర్మమే మూలమని నమ్ముతూ, మనస్ఫూర్తిగా ఇచ్చేది సమర్పించటము. భిక్ష సమర్పించేది. దానం స్వీకరించేది.

**సంవత్సరానికొక్కసారన్నా శరీరం పులకరించాలి. అలా పులకరించాలంటే అదృష్టం ఉండాలి. దానితో పాటు పుణ్యం కూడా.**

## ఓం శాంతి శాంతి శాంతిః

భగవంతుని పూజాదికాల్లో, ధర్మకార్యాల్లో, వ్రతవిషయాల్లో, పొరపాట్లు రాసి ఉంటే క్షమించుగాక.



పెద్దలు చెప్పిన విషయాల్లో లోటుపాట్లు ఉంటే పెద్దలు క్షమించి శాంతించుగాక. అక్షర దోషాలూ, భావపర దోషాలుంటే చదువరులు క్షమించి శాంతించుగాక. ఆవేశంతోనూ, కోపంతోనూ, తొందరలోనూ ఈ పుస్తకం గూర్చి నా మహాసైనికులని ఏమైనా అంటే వారంతా క్షమింతురు గాక. ఈ పుస్తకాన్ని ఇంత చక్కగా చేసినందుకు నా ప్రత్యర్థులు ఊరట చెందుదురుగాక. నా లోటుపాట్లను చెప్పినవారికి, చెప్పబోతున్న వారికి మహా పుణ్యం ప్రాప్తించును గాక.

☆ ☆ ☆ ☆ ☆

